# అచలపరిపూర్ణ
# రాజయోగీయము
# నిజప్రబోధ విధానము





అచలఋషి
దయానంద పౌన్నాలరాజయోగి
విరచితము

శ్రీ గురుభ్యోనమః

# పీఠిక

స్వభావ సిద్ధముగ నీ ప్రపంచమున ప్రాణపూరణమొనర్చు ప్రతి ప్రాణియు దుఃఖ నివృత్తిని నత్యంత సుఖప్రాప్తినిఁ గోరుచుండును. మఱియు నయ్యది సుఖ సంపాదనకు నెదురు జూచుచుఁ బ్రత్యహము తన శక్తికొలది పట్టి సుఖమును సంగ్రహింప యత్నించుచుండును. కాని మును మొదటినుండియు నొకే యంశమున నెయ్యదియు సఫలత్వమొందినది కాకపోవచ్చును. సమష్ట్యైక స్వరూపముయొక్క యేకాంతాత్మ యొక్కటి మాత్రమే యీ యత్యంత దుఃఖ నిర్మూలమునకు దారి తీసినదియుఁ దత్ఫలసిద్ధి నందినదియు ననఁదగియున్నది. ఆయ్యది సారాసార సంశోధన చేతను సామాన్య ముఖ్య వ్యాప్తిచేతను నిశ్చయింపఁ దగియున్నది. దాని నిజస్వరూప పరిజ్ఞాన సంశోధనయే మానవుని ముఖ్య కర్తవ్యము. అది తెలియక పోవుటచే మానవునకు నత్యంత దుఃఖము గలుగుచున్నది. ఈ దుఃఖ మాధ్యాత్మకాది భౌతికాది దైవికాది భేదములచే విభిన్న స్వరూపమైయున్నది. యదావిధి యీ దుఃఖము బాపుకొనుటకై రసాయనాది శాస్త్రములను కామినీ నీతి శాస్త్రాదులను నభ్యాసమొనర్చి మంత్రోపాసన జప తపాద్యుపాయ యోగాత్మకమునకు దారుల నెమకి యాయా గానవిధుల కర్మ తంత్రములొనర్చి మానవులు చరితార్థత నొందఁదలఁచియున్నారు.

మానసీయులగు విమల మనస్కులు బుద్ధి బలముతోడను జ్ఞానయోగ బలముల తోడను విచారించి నాయా సదుపాయములచే నీ దుఃఖనివృత్తినిఁ బొంద వాంఛించుచున్నారు. ఒకేసారి యే సాధకుడైనను దుఃఖనివృత్తిని బొందిన మఱల నెన్నటికైన దానా దుఃఖముల నొంద జాలఁడు. ఇట్లు సర్వ విధముల దుఃఖనివృత్తిని బొందిన పిమ్మట నీ పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము విచారింపఁ దగినది. ఈ బ్రహ్మజ్ఞానము—

శ్రుతి॥ "జ్ఞానా దేవ కైవల్యం నాన్యఃపంథా విద్యతే అయనాయ"

శ్రుతి॥ "సర్వజ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యతి"

శ్రుతి॥ ''జ్ఞానంలబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి''

శ్రుతి॥ "జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా"

ఇత్యాది పూజనీయ వాక్యముల భ్రమ ప్రమాదములయందుఁ గలుగుచున్న దోష భూయిష్ఠముల మొదలంట పెకలించి వేయుచున్నవి. కేవల జ్ఞానమాత్ర విషయకములై యివి యలరారుచున్నవి. జ్ఞానముయొక్క యాకృతియేమి ? జ్ఞానముయొక్క విషయమేమి ? తదీయ నిమిత్తమేమి ? యను నిట్టి శంకలగూర్చి విచారించు నావశ్యకత జిజ్ఞాసులకు గలుగక పోదు. దానికి సమాధానము.

శృతి॥ "బ్రహ్మ విదాప్నోతిపరమ్"
శృతి। "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి"
శృతి॥ "ఆత్మావా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యః"
శృతి॥ "ఏవంవైతమాత్మానం విదిత్వా"
శృతి॥ "ఆత్మానంచేద్విజానీ యాదయమ స్మీతిపూరుషః"
శృతి॥ "ఆత్మనిఖల్వరే దృష్టేశ్రుతేమతే యదాత్మనాఽఽత్మానంపశ్యతి"
శృతి॥ "తదాత్మనాఽఽత్మానందృష్ట్వా నిరాత్మాభవతి"
శృతి॥ శాంతోదాంతస్సమస్థితిక్షః సమాహితోభూత్వా ఆత్మన్యే వాత్మానం పశ్యేత్"

అను నిట్టి సంభావిత వచన వ్యూహముచే బ్రహ్మాత్మైకత్వ ప్రకారాత్మకమగు నాత్మ విషయము శమదమాది సాధనా నిమిత్తమైన పరిపూర్ణ పరోక్షతో జ్ఞానమే యిదియని.

ఇక నిట్టి యపరోక్షాను భూతినొందిన స్థిత ప్రజ్ఞునకుఁ బురుషోత్తమునకు బరిపూర్ణస్థితి విషయముల శిఖి కర్పూరన్యాయము, వచింపఁదగియున్నది. ఇది యెవరినుండి యెప్పటినుండి ప్రాప్తమగుచున్నది. అని విచారించినచో "ఏవంపరంపరా ప్రాప్తమిమంరాజర్షయోవిదుః" అను భగవద్వచనము ననుసరించి శ్రీ విష్ణువు మొదలుకొని యంటికా శివయోగి వేమన శ్రీధర శివరామ దీక్షితులవరకు పరంపరా ప్రాప్తమగు నతిగుహ్యమైన పరిపూర్ణ జ్ఞానబోధామృతమును సిద్ధ సిద్ధాంతరూప మహాగంగా ప్రవంతిచే సర్వలోకమును బ్రతీకృత మొనర్చుటకు శ్రీ భాగవత కృష్ణ దేశికులు బూనుకొనిరి. మఱియు వారి ముననా గ్రంథరూప ప్రవంతిని బ్రవహింపఁజేసిరి. అయ్యది కేవల కందార్థ కంద పద్యములుగ నుండుటచే దానియందు బ్రవేశించుటకు నల్పమతులకు సాధ్యపడకపోవుటవలన నద్దానియందుఁ బ్రవేశము గలిగించు నిమిత్తమై తద్గత సంకేతిక శబ్దార్థములు సులభముగ బోధఁబరుపనెంచి శ్రీ మద్దాయానంద

పొన్నాల రాజయోగీంద్రులవారు నిజప్రబోధ గ్రంథరాజమగు దీనిని రచించిరి. దేశ భాషలలో వేదాంతము బోధించిన జన సామాన్యమున కందుబాటులో నుండునను విషయము బుద్ధునినాటికే గ్రహింపఁబడినది. అందువలననే పిటకములన్నియు దేశభాషా రూపములగు పాళీ భాషలలో రచింపఁబడినవి. వీరశైవమునకును బునాదులువేసిన బసవేశ్వరుఁడును బరమ వైష్ణవాగ్రేసరులగు రామానుజాలును దేశ భాషలలోనే గద్య పద్యాత్మకముగ వాఙ్మయము సాగించుట సర్వ సౌలభ్య విలసితమునకని విమర్శకుల దృష్టికి విదితము కాకపోదు.

పదియారు వన్నియ బంగారు తోల్పెట్టెఁ
బెట్టిన బుదులు చేసట్టకుందురే ?
సీస మానవుండిచ్చిన ద్రవ్యంబు
కోవిదోత్తముఁడు గైకొనడె కూర్మి ?
నాంధ్రంబులోన నొంపారు సద్గ్రంధంబు
రచియింప మానవుల్ రసికులైన
పఠియించి సంతోషపడరె యంచుఁ దలంచి
తెలుఁగు సంధీకృతి సలపిన్నాడ
దేశ కవితయె మాధుర్యరాశియంచుఁ
దలఁచి చేసితి సీస పద్యాల దీని
శ్రీ దయానంద ! పాలిత శిష్యబృంద !
రాజయోగీంద్ర ! సద్గురు రాజచంద్ర !

అని భాగవత కృష్ణదేశికులు తన శుద్ధ నిర్గుణతత్వ కందార్ధములు యందుఁ జెప్పఁబడిన యంశమునాచేఁ బద్యరూపమున వెలువరింపఁ బడినది. విషయ మమూల్యమైనప్పుడే భాషలోనున్న నేమి ! అది గద్యముగ నున్ననేమి ? పద్యముగ నున్ననేమి? శ్రీ రాజయోగిగారు సర్వజన సౌలభ్యముగను, గరతలామలకముగను దీనిని రచించి లోకమునకు మహోపకార మొనర్చిరి. వేదాంత శాస్త్రమునకు విశేషించి పరిపూర్ణ బోధకు ననుబంధ చతుష్టయ నిరూపణమావశ్యకము.

అనుబంధ చతుష్టయము :- అనుబంధ చతుష్టయ మనఁగా నధికారి, సంబంధము విషయము, ప్రయోజనము అను వీనితోఁగూడినది. ఇచ్చట

నధికారి :- చతుర్విధ సాధనలచే ధన్యుఁడైనవాఁడు. అతఁడు నిరంతరాభ్యాస ధురంధర నిపుణుఁడయ్యుఁదమసందియములు తీరక సద్గురువులఁజేరి మంచిదారిని నెమకుచు దానికై పరితపించి ప్రయత్నించువాఁడు ఈ యధికారి దృష్టి ఘోషిని మనోగత వ్యాపారములనుజ్జగించ యఘోషిని యుతోన్మని స్థితియందుఁ బ్రవర్తించుచుండును. ఇతఁడే నిజమైన యధికారి ఇతఁడే స్థితి పురుషుఁడు స్థిత ప్రజ్ఞుఁడుగూడ; అనగాఁ బురుషోత్తమ స్థితిని స్థితప్రజ్ఞత్వమును బొందుటకు యోగ్యుఁడైనవాఁడు.

సంబంధము :- గ్రంధమునకు విషయమునకుఁ బ్రతిపాదక ప్రతిపాద్య భావ ముండును, జ్ఞానమునకు గ్రంధమునకు జన్యజనక భావనిరూఢసరణి యుండును. అధికారికిని ఫలమునకును బ్రాపక ప్రాప్యస్వరూప సంబంధముండును. విచారమునకును నధికారికిని గర్తవ్యకర్తృ సంస్కార సంబంధముండును. ఇట్లు సంబంధమును తెలిసికొనవలయును.

మఱియు నేతద్గ్రంధము గుఱుతుయొక్క స్వరూప స్వభావములను బరిపూర్ణ పరమాత్మయొక్క విలక్షణత్వమును నిర్ణయించుచున్నది. సర్వమును నిది గుర్తించుచున్నది. గావున దీనికి గుఱుతని నామమేర్పడినది. అద్యంతములులేక జగతికి నంతర్బహి స్థలములయందు నిండి నిబిడీకృతమైనెగడి యున్నది. కావున నీ బ్రహ్మమునకు బరిపూర్ణమని పేరు సార్థక మగుచున్నది. ఇంకను గుర్తును గుఱించియుఁ బరిపూర్ణమును గుఱించియు ననుభవజ్ఞులు పెక్కువిధముల వక్కాణించిరి. అందు గుఱుతును జ్ఞానమనియు జ్ఞప్తియనియు సంవిత్తనియు చిత్తనియు సత్తనియు నానందమనియు సచ్చిదానందమనియు నాత్మయనియు వ్యవహరించి యున్నారు. అద్వైతవేత్తలు సర్వవేదాంతముల పరిశోధనమొనర్చి తాము నిర్ణయించుకొన్న పరమాత్మయే యీ లేని గుఱుతు. దీనిని గ్రంధవిస్తర భీతిచే వ్రాయమైతిమిగాని వ్రాయఁదలఁచినచోఁ బెద్ద పురాణమగును.

ఇఁకఁ బరిపూర్ణ పరబ్రహ్మ మచలమై యాద్యంత రహితమై యానంద హీనమై యప్రమేయమై యనిర్వాచ్యమై స్వజాతి విజాతి స్వగత భేదరహితమై దేశ కాల వస్తుభేద రహితమై ద్రష్టదర్శన దృశ్యాది శూన్యమై సర్వదేశ సర్వకాల సర్వ వస్తువులయందుఁ గదలక నిలకడతో నలరారుచు దనకుదానే స్వయంసిద్ధమయియున్న బ్రహ్మము. ఇదియే బయలు. ఇట్టి బయలు గుఱుతుల నీగ్రంధ సంబంధాను బంధము సంబంధమొనర్చుచున్నది.

విషయము :- పరిపూర్ణము గుఱుతుగాదు. గుఱుతు పరిపూర్ణముగాదు. చీఁకటిని సూర్యుఁడుగాని చీఁకటి సూర్యునిఁగాని యెఱుగని యట్టులే పరిపూర్ణము గురుత్వమునుగాని యీలేని గురుతు పరిపూర్ణమునుగాని తెలిసికొనజాలవు. త్రికాలాబాధ్యమయి యున్న పరిపూర్ణమును నున్నట్లుగను కాలత్రయములయందు భేదప్రవృత్తిని నొంది వికల్పములఁజెంది నశించెడు లేనిగురుతును లేని యట్లుగను బోధించుటయే యీ గ్రంథ విషయము.

ప్రయోజనము :- సదసత్తాత్మకమగు సంవిత్తును సదసత్తాతీతమగు పరిపూర్ణమును దేశికు దయచేతను నిరంతర భావనా బలముచేతను గమనించి నిజస్థితి నెఱిఁగి "యిదియున్నది యిదిలేనిది" యను దలఁపునకుఁజిక్కకొనక జావుపుట్టు కలనొందని నిరపేక్ష సంయుక్త మోక్షసౌధము నధిరోహించి కర్తృత్వ శూన్యుఁడై యహమ్ పదార్థ రహితత్వము జెందుటయే మానవుని ముఖ్య ప్రయోజనము. సమగ్రముగ నిట్టి ప్రయోజన మీ గ్రంథము బోధించుచున్నది. ఇట్లు బోధించుటయే గ్రంథ ప్రయోజనము. ఈ రీతి ననుబంధ చతుష్టయముతో గూడుకొన్న యియ్యది సర్వమానవులకు నూత్న బోధామృత రసముచవిఁ జూపి నిస్సందేహ మనస్కులుగా నొనర్చి జనన మరణ భ్రాంతి రహితస్థితిని నాపాదించుచున్నది. ఇట్టి భావములతో విలసిల్లు గ్రంథ రాజమును గ్రంథరూపమున విస్తరింపఁజేసి లోకమునకు మేలు పేకూర్చిన శ్రీ రాజ యోగిగారు నన్ను దీనికిఁ టీక వ్రాయుమని యాజ్ఞాపించుట నాయందలి యపార కరుణయే. సర్వమానవులకు సులభముగ నిందలి భావము లవగత మగుటకై యెంత వరకు భాషతేలికగ నుండవలయునో యంత తేలికగా శ్రీ రాజయోగిగారు నీ గ్రంథమును నిర్వహించిరి. పారి భాషిక పదముల నుగ్గడించు విషయములందు గూడ మృదు పదములనే మధురభావములతో నలంతియలంతి యుదాహరణములతో విశదీకరించిరి. కాని కఠిన భావమునకును గడుసు పోకడలకును దడబిడ లాడించు సదాడంబరమునకును వీరి రచనలో నెంతమాత్రము తావులేదు. ఆకారమునకుఁదగిన ప్రజ్ఞయు ప్రజ్ఞకుఁదగిన శాస్త్రమును శాస్త్రమునకుఁదగిన ప్రారంభము ప్రారంభమునకుఁదగిన ఫల సిద్ధియు వీరియందు మూర్తీభవించియున్నవి. నిజముగ వీరు దయానందులమటకు వీరి స్వరూప స్వభావ ప్రవర్తనములే తార్కాణములు తమకు తెలిసిన స్వామలవ వేద్యములగు విషయముల శిష్యులకు నవగత మొనర్చుటలో వీరికిఁ గల ప్రతిభ యమోఘము. వీరినిశిత ప్రజ్ఞ సాటిలేనిది.

కొందఱు పద్యరూపమున వెలువరించిన బాగుండుననియు మఱి కొందఱు శ్లోక రూపమున నిమిడ్చిన లెస్సగనుండుననియు నీ గ్రంథరచనా కౌశలమునఁ బలుపోకడలతో దమ యభిప్రాయముల వక్కాణించిరి. కాని యీ కాలము పద్యరచనకంటె గద్యరచనకే యందును విశేషించి వ్యావహారిక భాషకేలోఁబడినది. విషయము కొలఁదిలోనే సరి పుచ్చిన బాగుండునను తలంపే నాఁటి ప్రజలలోఁ బెచ్చు పెరిఁగియున్నది. తదనుగుణ్యముగనే శ్రీ రాజయోగిగారిచే నీ గ్రంథము నిర్వర్తింపఁబడినది.

నేను మొదటినుండి చివరివరకు నీ గ్రంథ పరిశీలనగావించి యుంటిని. ఇతర వేదాంత సిద్ధాంతములకంటె దీనిలో పదార్థ పరిశోధనా విధానము కడుంగడు లెస్సగాఁ బరిపుష్టితమై సర్వజన హృదయంగమమైయున్నది. ఆ నాఁడు బోధాయన మహర్షి విజ్ఞానవాదమునందు నిట్టి పదార్థ పరిశోధనయే కవిపించునుగాని అది త్రైతవాదము. ఇది యట్లుగాక కేవల పరిపూర్ణ పరబ్రహ్మ మజాత స్వరూపమనియు దానికి నుత్పత్తి స్థితి నాశములెంత మాత్రము లేవనియుఁ బలుమారు చచ్చి పుట్టునది మాయా స్వరూపమగు జగత్తనియు నా జగత్తు సమష్టి రూపమగు నీవేననియు నిందలి ప్రతి విషయము బోధించుచున్నది. ఇట్లే నవద్రవ్య సంశోధనము త్రివృత్కరణము మొదలగు నీషన్మతభేదములుకూడ నిందు బ్రతిపాదింపఁబడి వానికి విలక్షణమగు జనన మరణ రహిత పరిపూర్ణమే ప్రధాన లక్ష్యముగఁ బేర్కొనబడినది. ఇట్లు లోకోపకారమొనర్చి సర్వ మానవుల జనన మరణ ప్రవాహరూపము నుండి తరింపనెంచిన శ్రీ రాజయోగిగారు మాకు వందనీయులు. తదీయాంతే వాసినని నేను జెప్పుకొనుటయు దదీయ ప్రేమకు నాస్పదుడనై యుండుటయు నాకు ననేక జన్మ పుణ్య పరిపాక విశేషమని తలంచుచున్నాను.

ప్రొద్దుటూరు. ఇట్లు
ది॥ 1-10-1955 కడివేటి నరసారెడ్డి
గవర్నమెంటు హైస్కూలు తెలుగు పండితుడు

# ప్రభుని మంగళగీతి

పల్లవి :- పాడుమా ! పాడుమా ! ప్రభునిమంగళగీతి,

అనుపల్లవి :- పాటతోనీమనసు ప్రభుపాదసన్నిధికి
పయనమైపోవాలి, పాదాలవ్రాలాలి ॥పాడుమా॥

1. ప్రభుదివ్యనామ సంభరితమైనీ తనువు
నాదబ్రహ్మంబులో నైక్యమయ్యేటట్లు ॥పాడుమా॥

2 బట్టబయలగు నీవెపరమాత్మవేగావె, స్వస్వరూపానంద
సరసిడోలికలలో నూగగానేలా, కలలనోగగానేలా ॥పాడుమా॥

3. నీకన్యమై యెపుడు నిలుచున్నదడెపరము
దానిగాంచి నీవు తరలిపోవుచెదారి ॥పాడుమా॥

4. కలమేల్కాంచెరిగి నీకళ బాయుమార్గంబు
శివరామదీక్షితా సిద్ధాంతమేనంచు ॥పాడుమా॥

5 గురుశిష్యులిర్వురు గూడియొకటైనంత
గుణములేదిసుమంత గుర్తుమీరినదంత ॥పాడుమా॥

6. శ్రీరాజయోగి గురుసేవించిభావించి
జనన మరణభ్రాంతి యుడుపుతీరేవరకు ॥పాడుమా॥

7. దేశికేంద్రునినోట తెలుసుకున్నామాట
రామచంద్రునిపాట రాజయోగపుబాట ॥పాడుమా॥

అచల పరిపూర్ణ రాజయోగీయము

# నిజప్రబోధ విధానము

## విషయానుక్రమణిక

కం॥ పంచాదశశరములు । ప్రపంచము తానుద్భవించె । ప్రణవాశ్రమం । దంచుశృతు లెన్నె । దాన్నెరుకంచవి యెరిగి । యెరుగు మచలాము దీనన్ । నిల్వకు మెరుక నచలాము లోనన్ । చంచాల మతిచాత । చతురాశ్రరెక్కావం । చెంచెద వెందుకు । యిదినమ్మ కెరుగుమీ । యచలాము దీనం । నిల్వకు మెరుక నచలాము లోనన్॥

కం॥ వన్నియ లై దొకదోటను । పన్నుగ గలసినది । హృదయ పద్మంబునుచున్ । యెన్నుదురు జనులు । యెరుకందున్నాదని । శృతులు బల్కుచున్నావి సుమ్మీ । తెలుసుకొ మోక్షమన్నా విసుమ్మీ । వొన్నెలన్నియు మీరి వున్న వస్తువుజాడ । నెన్నదెరుంగాక । యెన్నోరీతుల బల్కు । చున్నావి సుమ్మీ । తెలుసుకొ మోక్ష మన్నావి సుమ్మీ ॥

కం॥ కన్నుల ప్రక్కల వ్రేళ్ళిడి । తిన్నగ భ్రూమధ్యమందు దృష్టి నిలిపి । యందున్నది వెన్నెలలో బయలన్నా । కనుమందురెరుకె అది నిలువాదోయీ । తనువుతొ బొయ్యెదని తెలియుమోయీ యెన్ని తనువులు వచ్చి । యరిగీన ఋణకాక । వున్నా బయలదిజూచి । పుళ్ళక్కెరుక సుమాను । మదినిలువాదోయీ । తనువుతొ బొయ్యెదని తెలియుమోయీ ॥

కం॥ తననుతాగనిన । మోక్షంబని పల్కిరిగాని జనులు అది నమ్మకుమీ । తననుతా బట్టబె టను । గనబోయితే । తనకు దానె । కానరాదోయీ । విశ్వము తనకు కానరాదోయీ ॥ తన నుంచై నది గనుక । తాను విశ్వము రెండు । గనుపించుటుళ్ళక్కి । కావున తనకుదా గానరాదోయీ । విశ్వము తనకు గానరాదోయీ॥

కం॥ మతముల వారలు । తమ సమ్మతమైనటువంటి । శాస్త్ర మర్మాదలచే మితమేరు పరచుకొని । బహుగతులను కలహింతు । రట్టి గతినీకేమిటికి । చపలత జెందె స్థితి నీకేమిటికి । ప్రతిలేని యాబట్ట బయలుంద జూచి । సంతతములే నెరుక ; లేదని నమ్ము । మిక వారిగతి నీకేమిటికి । చపలతజెందె స్థితి నీకేమిటికి॥

ఓం

శ్రీ గురుభ్యోనమః

# అచల పరిపూర్ణ రాజయోగీయము
# నిజప్రబోధ విధానము

## ప్రథమ సోపానము

### ప్రస్తావన

అచల పరిపూర్ణ ప్రబోధయందేయారోపణలు పనికిరావు. నిజసంప్రదాయక గురువులచే నున్నదియున్నట్లు. తెలిసికొనవలెను. కాని గ్రంథావలోకనమువలనఁ దనకుఁ గలుగు నూహాపోహలతోఁ గ్రహించుట కెంతమాత్రమా యచల పరిపూర్ణ బ్రహ్మము సాధ్యపడదు. అట్లు గ్రహింపఁ బూనుట శూన్యపద్ధతియగును. స్వయంశక్తిచే దీని సాధింపఁదలచినవాఁడు తాను చెడుటయేగాక తన్నాశ్రయించిన వారిని గూడ నధోగతిపాలుచేసినవాడగును.

యాజ్ఞవల్క్య యంతటి బ్రహ్మవేత్తయైనను సూర్యభగవాను నాశ్రయించి భ్రాంతిరహితాచల పరిపూర్ణ ప్రబోధ తెలిసికొనవలసి వచ్చెను.

జనకుఁడెంతటి జ్ఞానియైనను యాజ్ఞవల్క్యుచే నీ జ్ఞానాజ్ఞాన రహిత పరిపూర్ణబోధ నెఱుఁగక తప్పినదికాదు

శుకుఁడెంతటి త్యాగియైనను జనకునిచే నీ పరమ పురుష నిర్ణయాచల పూర్ణరహస్యము గ్రహింపక శాంతిచేకూరలేదు.

శ్రీ కృష్ణుఁడెంతటి దైవస్వరూపుఁడైనను సాందీపుచేఁ బునరావృత్తి విశూన్య ప్రపూర్ణస్థితి నాలింపవలసివచ్చెను.

బసవేశ్వరుఁడెంత మహనీయుఁడైనను నల్లమప్రభువు సన్నిధి నహం పదార్థ విహీనాచలపూర్ణ ప్రబోధ స్వీకరింపక చిత్తస్థైర్యము గలుగలేదు. కావునఁ జాటుమార్గమ్ములు దొంగత్రోవలు నచల పరిపూర్ణ ప్రబోధకుఁ బనికిరావు. ఉన్నదియున్నట్టు లెఱుఁగుటే రాజమార్గమని తెలియవలెను.

## సాధన చతుష్టయము

నిత్యానిత్యవస్తువివేకము, ఇహమూత్రాది ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వము-అనునవి సాధనచతుష్టయము.

౧. సద్గురునిచే నిత్యపరిపూర్ణమును, ననిత్యప్రపంచమును దెలిసికొనుట నిత్యానిత్యవస్తు వివేకమనఁబడును.

౨. అష్టైశ్వర్య వనితాపుత్రాది యిహలోక భోగంబుల సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, జీవబ్రహ్మైక్యాది పదవుల బ్రహ్మలోక పర్యంతాది పరలోకభోగంబులఁ గోరకుండుటయే ఇహామూత్రాది ఫలభోగ విరాగమనఁబడును.

౩. శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము లనునవి శమాదిషట్కసంపత్తు లనఁబడును

1. బ్రహ్మవిద్యా శ్రవణాదులందుఁ దప్ప నితర విషయవాంఛల యందు మనస్సును జొప్పింపక యితర శ్రవణాదులయం దిచ్చలేకుండుట శమమనఁబడును.

2. జ్ఞానకర్మేంద్రియంబుల ప్రవర్తన గురువులచే శ్రవణముచేసిన విషయములందు వర్తింపఁజేసి వ్యతిరిక్త విషయములందుఁ జొరనీయకుండుట దమమనఁబడును.

3. స్వార్థరహిత కర్మాచరణమే యుపరతియనఁబడును.

4. కర్మాను సారముగావచ్చు సుఖదుఃఖాదుల సంతోషముతో ననుభవించుట-అనఁగాఁ గష్టమందు దుఃఖముగాని సుఖమందు సంతోషముగాని పొందక సర్వకాలములందేకత్వముతో నుండుట తితీక్షయనఁబడును.

5. ఇతర విషయాదులపైఁగల శ్రద్ధలనన్నిటి నుజ్జగించి సద్గురు నిశ్చయ ప్రబోధ విషయమందే శ్రద్ధగల్గి యుండుట శ్రద్ధయనంబడును.

6. జననమరణ రహితపద్ధతియందు సమాధానముగల్గి యితరపద్ధతు లగు జీవబ్రహ్మైక్య యోగయోగాంగములయందు సమాధానములేక యుండుట సమాధానమనఁబడును.

४. ధన సంపాదనవలన దారిద్ర్యమోక్షము, సంతానప్రాప్తివలనఁ బరలోకమోక్షము, సాధనలవలన జీవబంధమోక్షము, మహావాక్య శ్రవణాదులవలన దైవబంధమోక్షము గల్గుచున్నదను పద్ధతి ముముక్షత్వముకాదు. జననమరణ భ్రాంతిరహితమే ముముక్షత్వమని తెలియవలెను.

''నిత్యానిత్యవస్తు వివేకమను నొక సాధన యున్నఁజాలదా ? నాల్గు సాధనలేలఁజెప్పవలెను ?'' అనిన నిత్యానిత్యవస్తువివేకముగల విద్వాంసులు గూడఁ గామ్యకర్మంబుల నొనర్చు చున్నారు. కావున రెండవ సాధనమగు విహాముత్రార్థ ఫలభోగ విరాగముండవలసి వచ్చెను. ఇట్టి రెండు సాధనములున్నను త్యాగులకుఁ గోపతాపంబు లడంగుటలేదు. అందువలన మూఁడవ సాధనమగు శమాదిషట్కసంపత్తి యావశ్యకమయ్యెను. ఇట్లు వివేక విరాగ శమాది షట్క సంపత్తులుగల్గిన సన్యాసులు కచ్ఛదములు విగించి కేవలములఁజేతఁబట్టి బైక్షవృత్తితో గ్రామైక రాత్రమొనర్చుచుందురు. అట్టి వారికి శ్రవణాదు లనపేక్షణీయములు. అందుచే నాల్గవ సాధనమగు మోక్షేచ్ఛయావశ్యకమయ్యెను. ఇట్లు చతుస్సాధనలందారి తేరిన సాధకుఁడే వేదాంత శ్రవణము చేయఁదగిన యధికారి.

సాధన చతుష్టయము కాయక వాచక పద్ధతికాదు. కేవలం మానస ప్రవృత్తి. కావున విషయ రహిత బుద్ధిగలవారు సాధన చతుష్టయ పద్ధతి నవలీలగ సాధించు కొనఁగల్గుచున్నారు.

## శుశ్రూషా చతుష్టయము

ఆత్మశుశ్రూష, అంగశుశ్రూష, స్థానశుశ్రూష, భావశుశ్రూషయని శుశ్రూషలు నాల్గు విధములు.

౧. తన ప్రవర్తనమందు గురుమూర్తి కెట్టి యనుమానమురాకుండఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రవర్తించుట యాత్మ శుశ్రూషయనఁబడును.

౨. నియమితాచారముగా శరీరమును బ్రవర్తింపఁజేయుట యంగ శుశ్రూషయనఁబడును. ఈ పద్ధతిచే బ్రహ్మతేజస్సుగల్గును. తద్వ్యతిరిక్త వర్తనచే శరీరము ప్రేతకళగా మారును. కావున సాధకుఁ డంగ శుశ్రూషా క్రమమున జాగ్రత్తగాఁ బ్రవర్తింపవలెను.

౩. తానెంతటి ధనధాన్యాది వస్తువాహన వితానములఁ గడించినవాఁడై నను వర్ణాశ్రమాచారముల యందాధిక్యుఁడుగానున్నను, నిజ ధర్మ ప్రబోధకు గురుస్థానమునకే రావలయును; కాని తన స్థానమునకు గురువుల పిలిపించుకొని ధర్మమును దెలిసికొనఁగోరుట తగదు. ఒక వేళనట్లు, శిష్యుఁడు గురులఁదన గృహమునకు రప్పించుకొని ధర్మమెఱిగినను దానివలన ఫలముండదు. ఈ పద్ధతి గురు శిష్యన్యాయమునకు విరుద్ధము. జనక కృష్ణాదులు స్థాన శుశ్రూషాక్రమము తెలిసినవారు; కావున యాజ్ఞవల్క్యసాందీపాదుల చెంతకేగి శుశ్రూషనొనర్చి నిజబోధ నెఱింగి ధన్యులైరి. శ్రీరామచంద్రుఁడాక్రమమెఱుఁగక గురువగు వసిష్ఠుని తనచెంగటకుఁబిలిపించుకొని ధర్మము తెలిసికొనెను. కావున శిష్యన్యాయము రామునియందు సార్థకము కాదు. ఇదియే స్థాన శుశ్రూష.

౪. జనన మరణ భ్రాంతి రహితమున కేపదార్థ మావశ్యకమని సద్గురువుచే నిర్ణయ మొనర్పఁబడియున్నదో సర్వకాల సర్వావస్థల యందట్టి పదార్థమందే భావముంచుట భావ శుశ్రూష యనఁబడును కాని భావమందన్యథా సంకల్పము లుండగూడదు. అట్లుండిన భ్రాంతి విస్తారమై జనన మరణములకుఁ గారణమగును. ఇట్లు చతుర్విధ శుశ్రూషల ముముక్షువు జాగ్రత్తగా నాచరించి ధన్యుఁడు కావలెను.

## భక్తిజ్ఞాన వైరాగ్యతత్వ ముముక్షత్వ నిర్ణయము

భక్తి :— భయముచేతఁ గూడినప్రేమ, భక్తియనఁబడును. త్రికరణంబులగు మనోవాక్కాయముల యేకైక రూపమగు నాత్మ సమష్టియందుఁ బరమాత్మగాఁ జెప్పఁబడును. కావునఁ ద్రికరణశుద్ధితోఁ బ్రవర్తించిననాత్మకు విశుద్ధత్వముగల్గి పరమాత్మస్థితి సిద్ధించును. అట్లుగాక నియమాతిరిక్తముగా వర్తించిన నాత్మకుఁబాప భూయిష్టత్వ మతిశయిల్లి నీచయోనిత్వ ప్రాప్తి తటస్థించును. ఇట్లు త్రికరణ శుద్ధియందు నిశితదీక్షయు, ప్రవర్తనయందు భీతియు, నాత్మయందు. ప్రేమయు గల్గి వర్తించు ప్రవృత్తిని భక్తియని చెప్పఁ బడును.

## త్రికరణ శుద్ధిప్రవర్తన

తన సంతతిపైఁ గల ప్రేమయే యితర సంతానముపై నుంచి సమ చరిత్వముతోఁ ప్రేమించి వర్తించిన నంతఃకరణ శుద్ధియగును.

వితథత్వములేని స్వార్థ రహిత సత్య సంభాషణ మొనర్చు వాక్కు సత్యవాక్కని చెప్పఁబడును. ఇట్టి వాక్కుతో నుండిన వాక్శుద్ధి గల్గును.

స్వార్థ త్యాగమగు నుపకారముచే శరీర శుద్ధి గల్గును. ఇట్టి పద్ధతులకు వ్యతిరిక్తముగా వర్తించు ప్రవర్తనచేఁ త్రికరణములకు నశుద్ధత్వ వర్తనము సంభవించుచున్నది.

జ్ఞానము :— తనయందు సర్వమును, సర్వమునందు తనను దెలియు నట్టిది జ్ఞానము. జ్ఞానముయొక్క పరిణామమగు జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకమును గ్రహించి కర్మేంద్రియములచేఁ గర్మల నొనర్చి వాని చేగల్గు ఫలాఫలంబుల యనుభవించుటకుఁ దానే కారణమనియు, సకల పరిణామంబులు బీజవృక్షన్యాయమునఁ దానే యగుననియుఁ తెలియునట్టి జ్ఞానమే జ్ఞానమనఁబడును. కాని యితర విషయంబు లెన్నియెఱిగినను నది జ్ఞానమని చెప్పఁబడదు. మఱియుఁదన్నుఁదా నెఱుంగక తన కన్న భిన్న పదార్థముల నెఱిఁగి "వానిచే నేను రక్షింపఁబడుచున్నాను." అనునిట్టి పద్ధతి భౌతిక వాంఛా మయము; కావున దీని నజ్ఞానమని చెప్పఁబడును.

వైరాగ్యము :— రూపనామక్రియా స్పదమగు నంతర్బాహ్య ప్రపంచ మనిత్యమని తెలిసికొనుట కంటె వానిని దెలియు నట్టియుఁ దెలియఁజేయు నట్టియుఁ జేతన బ్రహ్మమే యనిత్యమని తలంచి దానియందు వాంఛలేక యుండుట వైరాగ్య మనఁబడును.

తత్వము: — ఉత్తమ పురుషుని పరిణామరూపమగు క్షరాక్షర పురుషుల యొక్కయు, శక్తిద్వయ పరిణామమగు జీవజగదోపాధి స్వరూప పంచ వింశతి తత్వములయొక్క విచారణ వస్తు నిశ్చయముగాఁ దెలిసికొనఁబడు నది తత్వమనఁబడును. మఱియు అష్ట ప్రకృతులయొక్కయు, నవద్రవ్యముల యొక్కయు విచారణ నాత్మలో నొనర్చుట తత్వమనఁబడును.

ముముక్షుత్వము :— జననమరణ భ్రాంతి రహిత స్థితియుఁ, దనతో సర్వము రహితమై గురులేని స్థితియు ముముక్షుత్వ మనఁబడును.

వైశేషిక దర్శనము

## బ్రహ్మాండ రూపమగు జీవేశ్వర జగద్వ్యాప్తి నిర్ణయము

అగ్నియొక్క విజశక్తిచే ధూమముత్పన్న మగుచున్నది. ఈ ధూమము దేశాంతరము దూరముగాఁ బోయినప్పుడగ్నియొక్క సంయోగము లేకయే స్వయముగా నుండునట్లు తెలియఁబడుచున్నది. అయినను సమష్టిరూపమగు వగ్నియొక్క యధిష్ఠాన సత్తాయందు నాధారపడియున్నవి. అదే విధముగా నాత్మయొక్క విజశక్తిచే మహత్తత్త్వాది ప్రకృత్యాదులు స్థావర జంగమాత్మక మగు జీవోపాధు లుత్పన్నము లగుచున్నవి. ఈ యుపాధు లాత్మయొక్క యాధారములేక యాత్మకు దూరముగానున్న దేశాంతరముల యందు నున్నట్లు తెలియఁబడుచున్నవి. యైనను నాత్మయొక్క విజశక్తిపై నాధారపడియున్నవి; కావున నాత్మ పరిణామరూపమగు మహత్తత్త్వాది ప్రకృత్యాదుల వ్యాపక ధర్మమునకు బుద్ధ్యాదుల యందలి యధ్యాత్మికాది భౌతికాది దైవిక తాపత్రయంబుల వ్యాపక ధర్మమునకుఁ గల సంబంధము వ్యాప్తియందురు. ఇట్టి వ్యాపక పద్ధతి తెలిసినవారు వ్యాప్తిరూపులును స్వతంత్రులునునై యున్నారు.

కారణమగు నాత్మ యుండుట చేతనే కార్యమగు జగత్తు తెలియ బడుచున్నది.

కారణమందు నేగుణముండునో కార్యమునందును నదియేగుణ ముండును.

పరిణామము :— చిన్నది పెద్దది యనియు నణువు మహత్తనియు ద్వంద్వ రూపముగా నున్నది. చెట్లు గుట్టలు పృథ్వీ సముద్రములు దాని రూపములే.

అసత్తునుసరించి స్వశబ్దముండును గావి కేవల స్వశబ్దముండఁజాలదు. గృహారామ క్షేత్రాదులయందు నసత్యముకు, దానికిఁగారణమగు పృథ్వీ యందు సత్స్వరూపమును దెలియఁబడుచున్నవి. కావున నసత్తుమందియే సర్వ పదార్థము లేర్పడిన వని చెప్పవలసియున్నది. కావున సదసద్రహిత మే యచల పరిపూర్ణ పరబ్రహ్మమని నిర్ణయమగుచున్నది.

✱ ద్రవ్య నిర్ణయము తెలియు విధానము :- కార్యమునకుఁ బూర్వముగా నుండి కార్యమునందు సమవేతమగునది అనఁగా, దానొకవస్తువుగా నుండి యితర వస్తువులతోఁ గలియు స్వభావము గలది ద్రవ్యమని చెప్పఁబడును. దీనిని సమవాయి కారణమనిగూడఁ జెప్పుదురు.

1 ద్రవ్యమునందు సమాన విరోధ పద్ధతులు :— పృథ్వియందు, జలమునందును, జడత్వము (తెలివిలేనితనము) సమానముగా నున్నను; పృథ్వియందలి కఠినత్వము, గంధత్వము, శుల్కత్వము – అనువానికిని; జలమునందలి ద్రవత్వము, కోమలత్వము, రసత్వము, అనువానికిని విరుద్ధము. కావున విరోధ సామాన్య ధర్మములు ప్రతిద్రవ్యము నందుఁ దెలిసినవారే నిజముగా ద్రవ్యము తెలిసిన వారగుదురు.

2 గుణ నిర్ణయ పద్ధతి :— ఒకవస్తువు మఱియొకవస్తువును నపేక్షింపక సంయోగ విభాగంబులకుఁగారణముగాక ద్రవ్యము నాశ్రయించి యుండునది గుణమని చెప్పఁబడును. చెవులకు శబ్దము, నేత్రములకురూపము–ఇతరుల ప్రేరేపణ లేక గలుగు చున్నవి. అనఁగా జ్ఞానేంద్రియములకు విషయపంచకము–యితరుల ప్రేరణలేకయే కలుగుచున్నది. పంచతన్మాత్రల చేరిక గల్గినట్టిది పుష్పము. దాని యందలి శబ్ద స్పర్శ రూపరస గంధములు–ఇతరుల ప్రేరేపణలేకయే జ్ఞానేంద్రియములు తెలిసికొనుచున్నవి. కావున నితరుల ప్రేరణలేక యింకొక వస్తువు చేతఁ దాను సంయోగము గాక తెలియునట్టిది గుణమని చెప్పఁబడును.

3 కర్మ నిర్ణయము :— గుణరహితమై సంయోగ విభాగంబులకు నపేక్షారహితమై ద్రవ్యమును నాశ్రయించియుండు నట్టిది కర్మయనఁబడును. కంటి తెప్పలఁబై కెత్తుట, క్రిందికిఁదించుట, ముడుచుట, వ్యాపింపఁ జేయుట, వచ్చుట, పోవుట, తిరుగుట, చచ్చుట, పుట్టుట, యను స్థితులు గలది కర్మ యని చెప్పఁబడును.

మనోప్రేరణలేక కర్మేంద్రియ కార్యక్రమములు జరుగవు. కావున మనస్సు కర్మకుఁ గారణమని స్థూల దృష్టిగాఁ దెలియుచున్నది. మనః ప్రేరణకు నపేక్ష రహితమగు నాత్మ చేతనము కర్మగా నున్నందున స్వకారణమగు చేతనకర్మ యాత్మయని నిర్ణయము. ఆత్మరూప చేతనకర్మరహితము వల్లనే జన్మరహితముగావిమనః ప్రేరేపణ రూపకర్మేంద్రియకర్మ రహితము వలన జన్మ రహితముకాదు.

4 సామాన్య నిర్ణయము:— బంగారముతో బంగారత్వము సమాన ధర్మము, మనుష్యులలో మానవత్వము సమానధర్మము. కావున సామాన్య మిట్లు తెలియఁబడుచున్నది. మఱియు నాత్మతో నాత్మత్వము సామాన్యము.

5 విశేష నిర్ణయము :— ఇత్తడియందు బంగారము విశేషము. పశు వులలో మానవత్వము విశేషము. ప్రకృతిలోఁ బ్రత్యగాత్మ విశేషము. ప్రత్య గాత్మలోఁ బ్రహ్మము (పరమాత్మ) విశేషము.

6 సమవాయి నిర్ణయము :— కారణముగా నుండి కార్యములయందుఁ గలియు స్వభావము గలది సమవాయి యనబఁడును.

7 అభావ నిర్ణయము :—ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యా భావము,అత్యంతాభావము, అభావము-అని యభావములైదు విధములు.

1. ప్రాగభావము :— పూర్వమందు లేనిదిఁ అనఁగా నుత్తరమందున్నది యని యర్థమగుచున్నది. బంగారమందు నగలకును, భూమియందుఁగుండల కును స్వరూపమగు క్రియాగుణములు లేనందునఁ బ్రాగభావమని చెప్పఁ బడును. రూపములగు క్రియాగుణములు నసత్తులని చెప్పఁబడును. బంగారము మన్ను సత్తని చెప్పఁబడును

2. ప్రధ్వంసాభావము :— కార్యోత్పత్తియైన తరువాతఁ గార్యకారణ ములు రెండు నశించి పోయినయది సదసత్తనఁబడును. ఉపాధులును నుపాధులకుఁగారణ మగు నెఱుకయు బూర్వమందు లేవు ఆవి నశించిన పిమ్మట నున్నట్లు తెలియబడవు. కాని మధ్యన నున్నట్లు తెలియును. ఇదియే ప్రధ్వంసా భావమని చెప్పఁ బడును.

3. అన్యోన్యా భావము:— ఆవు గుఱ్ఱము యేకపోలికలుగా తెలియు చున్నను ఆవు గుఱ్ఱము కాదు. గుఱ్ఱము యావుకాదు. అట్లే యచల పరిపూర్ణ పరబాహ్యము యొక్క పోలికగా నాకాశావరణము లున్నను నయ్యవి పరి పూర్ణ పరబాహ్యము కాజాలవు. కావున సత్తాసత్ అని చెప్పబడును.

4. అత్యంతాభావము :— భూతలమునందు ఘటములేదు. కాని నర సింహము, ఆకాశ పుష్పము, వంధ్యాసుతుడు పీనివలె భూతలమునుండి యగు చున్నట్లు తెలియుచున్నదైనను నది భ్రాంతియని నిశ్చయమగు చున్నది.

సదసత్‌యని దానిని చెప్పఁబడును. ఇది భ్రాంతి పద్ధతిగా నిర్ణయింపఁబడినది. కావునఁ బై మూఁడు పద్ధతులకు భిన్నముగా నున్నది.

అభావము :— గృహమునందు ఘటములేదు. అనఁగా వేరొకచోట నున్నదని ధ్వనించును. అయినను గృహమునకు ఘటమునకు సంబంధము లేదు. అనునట్టి నిర్ణయ మభావమని చెప్పఁబడును.

అభావములయందు తెలియుపద్ధతి :— భూమి, బంగారము సత్స్వరూపములు, వానినుండి చేయునట్టి నగలు, కుండలు అసత్స్వరూపములు అని యిట్లు తెలియుచున్నది. కావున దీనిని ప్రాగ భావమని చెప్పఁబడును.

కార్య కారణములు రెండు కూడనశించుచున్నవని ప్రధ్వంసాభావము వలనఁ దెలియఁబడుచున్నది. అందువలన దీనిని సదసత్ అని చెప్పఁబడు చున్నది.

అచల పరిపూర్ణ పర బాహ్యము యొక్క పద్ధతిగానే యుపాధికిఁ గారణమైన పరాకాశము బయలుగానున్నను "అది యిదికాదు. ఇది యది కాదు." అని యిట్లు చేయఁబడు నిర్ణయము సత్తాసత్ అనవలెను. దీనిని అన్యోన్యాభావమనియు వ్యవహరింతురు.

ఉపాధి భ్రాంతిరూపముగాని నిజముకాదని సదసత్ నిర్ణయించు చున్నది. దీనిని అత్యంతా భావమని యందురు. అచల పరిపూర్ణ పరబాహ్యము తప్పవితర పదార్థము లేదు. "ఉన్నది యిదికాదు" అను నిర్ణయ మభావమని చెప్పఁబడును.

గుణకర్మలుగల ద్రవ్య నిర్ణయము :— గుణకర్మలు గల ద్రవ్యములు పృథ్వీ జలాగ్నివాయు మానసాత్మలని యాఱు విధములు.

గుణము మాత్రముండి కర్మలేని ద్రవ్యమాకాశదిక్కాలములని మూడు విధములు.

లక్ష్య నిర్ణయము :— కంటితో రూపము గ్రహింపఁబడినట్లు దేనిచే లక్ష్యము గ్రహింపఁబడునో యది లక్ష్యము.

పరాపర నిర్ణయము :— పరమనగా ముందుగా నుండునది. అవర మనగా దదుపరి నుండునది. ఇంద్రియార్థ సన్నికర్ష జ్ఞానము ప్రత్యక్షమనఁ బడును.

# ద్వితీయ సోపానము

## నవవిధ పదార్ధగుణకర్మ స్వభావనిర్ణయము

మనుష్యుడు యధాయోగ్యముగా ధర్మానుష్ఠాన మొనర్చుటచే పవిత్రుడగుచున్నాడు. పృధ్విజలాగ్ని వాయురాకాశకాలములు, దిక్కులు, మనస్సు, ఆత్మలను నీతొమ్మిదింటికి, ద్రవ్యగుణ కర్మ సామాన్య విశేష సమావాయ్యభావములను సప్తవిధపదార్థ జ్ఞానములుగాఁ జెప్పఁబడు చున్నవి. అనగా దత్వజ్ఞానము తెలిసికొన్నప్పుడు మానఁవుడు వానిచేమోక్షమును బొందుచున్నాడు. పట్టువిడుపుల దాను నెఱుఁగు చున్నాఁడు.

పై పై విమర్శించి తెలిసికొనువారు శబ్దరూపమైన సంజ్ఞాజ్ఞానము కలిగి పదార్థప్రత్యక్షము లేక ప్రౌఢ్ధతిరుగుడు పుష్పములవలె చలనత్వము చెందుచున్నారు.

సూ॥ రూపరసగంధ స్పర్శవతి పృధివీ

(౧.) <u>పృధ్వియను ద్రవ్యనిర్ణయము</u> :— పృధ్వి గంధవతియని చెప్పఁబడు చున్నది. అనగా గంధగుణముగలది పృధ్వియని లక్ష్యనిర్దేశము. <u>గంధవతియనునది లక్ష్యము</u>, (పృధ్వియనునది నిర్దేశము.) మఱియు విది నిత్యము, అనిత్యమని రెండువిధములు.

పరమాణుస్వరూపముగా నున్నది నిత్యపృధ్వి. కార్యరూపమగు గృహారామ క్షేత్రాధికముగ గోచరించునది యనిత్యపృధ్వి.

మఱల నియ్యది శరీరేంద్రియ విషయములని మూఁడు విభేదము లందుచున్నది. విరాడ్రూప శరీరమునందలి పృధ్వీసంబంధము............ శరీరము.

సమష్ఠి గంధగ్రాహ్యమగు....ఘ్రాణేంద్రియ...మింద్రియమనఁబడును. పర్వతాది పాషాణములు...దీని విషయములు.

పృథ్వీత్వస్థితః పృథివ్యాం గంధః

౨. పృధ్వియొక్క <u>గుణము</u> <u>గంధము</u>. ఇదే ఘ్రాణేంద్రియముచే తెలియఁబడుచున్నది. ఇది కేవల పృధ్వీమాత్ర గుణము. ఇందలి శబ్ద, స్పర్శ, రూప, రసము లితర భూత మిశ్రమము చేఁగలినవి.

౩. పృధ్వియొక్క కర్మ <u>ధరించు</u>నది, అనఁగా మెలిక వేయుట, కఠి<u>నత్వ</u>ము, దీని ధర్మములనఁబడును.

౪. పృధ్వియొక్క స్వామాన్యత యాకాశ వాయువగ్ని జలములకన్న చిన్నది. కనుక సామాన్య మనబడును.

౫. పృధ్వియొక్క విశేషత్వము :— పర్వత, వృక్ష, గృహారామ క్షేత్రాదులకన్న గొప్పగానున్నది. కావున నీపృధ్వికిఁ విశేషత్వమిట్లు చెప్పఁ బడి యున్నది.

౬. పృధ్వియొక్క సమవాయి :—స్థావర జంగమాత్మకమగు జీవకోటులకు నన్నమయరూపమగు స్థూలశరీరాదులు; నరములు, అస్థులు, చర్మము, మాంసము, రోమములు యివి పృధ్వియొక్క సమవాయిలు. అనగా కారణరూప పృధ్విపరిణామములు. ఇట్లు వీనికిఁ గారణత్వముగా నున్నది పృధ్వికనుక వీనికి పృధ్వి సమవాయియని నిర్ణయింపఁబడినది.

౭. పృధ్వియొక్క యభావము :— మొదట జలమునుండి యీపృధ్వి యెట్లు పుట్టినదో యట్టేయియ్యది గిట్టుచున్నది. కావునఁ బృధ్వి యభావమని నిర్ణయింపఁ బడినది. జలమునందియ్యది పుట్టిన దనుటకు "అపః పృధ్వీః" యని శృతి ప్రమాణము గలదు.

శ్లో॥ రూప రస స్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః

(2) (౧.) జలముయను ద్రవ్యనిర్ణయము :— జలము రసగుణము గలది యను లక్ష్య నిర్దేశ్యము జలమను ద్రవ్యనిర్ణయమందు గలదు.

జలము చల్లని స్పర్శగుణముగలది. అనఁగా స్పర్శగ్రాహ్యము, శీతల స్పర్శలక్షణము.

అప్సు శీతతా

జలము నిత్యా నిత్యములని రెండువిధములు. నిత్యజలము పరమాణు రూపము. అనిత్యజలము కార్యరూపము. అనగా వర్ష, నదీ నద రక్తశుక్ల, స్వేద, మూత్ర, శ్లేష్మాదికము.

జలము; శరీరము, ఇంద్రియము, విషయము యని మూఁడు భేదములు పొందుచున్నది. వరుణలోకమునందుండు జలముశరీరమనియు, సమష్టి రసగ్రాహ్యకమగు జిహ్వేంద్రియ మింద్రియమనియు, సముద్రాదులు విషయములనియు, నీజలమును దెలియవలయును.

౨. జలముయొక్క గుణము రసము :— రసము జిహ్వచేఁ దెలియ బడుచున్నది. దీని స్వగుణము తీపి, ఉప్పు, కారము, చేదు, వగరు, చప్పన

అనునవి యితర భూత మిశ్రమములచే కలిగినవి. మఱియు శబ్ద, స్పర్శ రూపములుగూడ నితర భూత మిశ్రమములని యీ జలవిషయమున తెలియ వలెను.

౩. జలముయొక్క కర్మ ముద్దచేయుట. తడుపుట యనునది దీని ధర్మము.

౪. జలముయొక్క సామాన్యము :— ఆకాశము, వాయువు, అగ్ని యను నీ మూఁడింటికంటె నియ్యది చిన్నదిగ నున్నది కావున నీ జలము యొక్క సామాన్యత్వమిట్లు తెలియుచున్నది.

౫. జలముయొక్క విశేషము :— ఇది పృథ్వీకన్నఁ బెద్దదియగు టచే దీనియొక్క విశేషత్వము గోచరమగు చున్నది.

౬. జలముయొక్క సమవాయి :— స్థావర జంగమాత్మకములగు జీవోపాధులను నీజలము పెంపొనర్చి ప్రాణరూపమున రక్షించు చున్నది. కావున సర్వమునకు నీజలము సమవాయిగా నున్నది.

౭. జలముయొక్క యభావము :— అగ్నినుండి యిది పుట్టినది గనుక నిదియభావము పొందునట్టిది యని తెలియబఁడుచున్నది.

## ౩. అగ్నియొక్క గుణకర్మనిర్ణయము

౧. అగ్నియను ద్రవ్యము తేజము గలదని తెలియఁబడు చున్నది. కావున తేజస్సు దీని లక్షణము. రూపము లక్ష్యము, అనగాఁ గన్నులచేతఁ దెలియు నట్టిది.

అగ్ని నిత్యానిత్యములని రెండువిధముల భేదము నొందుచున్నది. నిత్యాగ్ని పరమాణురూపము. అనిత్యాగ్ని కార్యరూపము. అనగా ఆకలి, దప్పిక, నిద్ర, సంగమము, ఆలస్యము, అను నివి దీని కార్యరూపములని తెలియవలెను.

అగ్ని శరీరేంద్రియ విషయములు. అగ్నియొక్క శరీర మాదిత్య లోకము. సమష్ఠి రూపగ్రాహ్యకమగు నేత్రేంద్రియము దీనికి నింద్రియము, భౌమ, దివ్య, ఔర్వా, కరజములని యగ్నికి నాల్గువిధముల విషయములు గలవు. భౌమ మనగా బాహ్యాగ్ని, దివ్యమనగా మెఱుపులు, ఔర్వమనగా జఠరాగ్ని, ఆకరజమనగా సువర్ణాదులయందు తెలియు తేజస్సు.

౨. అగ్నియొక్క గుణ నిర్ణయము :— రూపము, ఎఱుపు, తెలుపు, పసుపు, ధూమ్రము, సునీలము అనునవి రూపభేదములు. కాని తెలుపు, ప్రకాశము స్వగుణమనియు; తక్కినవి యితరభూత మిశ్రమములచే కలిగిన వర్ణ సముచ్చయమని తెలియవలయును.

౩. అగ్నియొక్క కర్మనిర్ణయము :— పాకముచేయుట అగ్నియొక్క కర్మ. ఊష్ణమొనర్చుట దానిధర్మము.

౪. అగ్నియొక్క సామాన్య నిర్ణయము :— ఆకాశ వాయువుల కన్న నగ్ని చిన్నదిగ నున్నది కావున దీని సామాన్యత్వమిట్లు తెలియఁబడు చున్నది.

౫. అగ్నియొక్క విశేషనిర్ణయము :— పృధ్వీజలములకన్న వియ్యది గొప్పది. కావున దీని విశేషత్వమిట్లు వాసి కెక్కినది.

౬. అగ్నియొక్క సమవాయినిర్ణయము :— స్థావర జంగమాత్మకములగు నెనుఁబదినాల్గులక్షల జీవోపాదులయొక్క స్వరూపముల నిరూపించుచు క్షుత్పిపాస నిద్ర సంగ మాలస్యాదులను గలుగఁజేయుచు నియ్యది పరిణమించు చున్నది కావున నిది యట్టి పరిణామమునకు సమవాయిగానున్నది.

౭. అగ్నియొక్క యభావము :— ఇది వాయువునందు బుట్టినది. కావున దీనికి స్వయముద్భవము లేదు. అందుచే నిది యభావమని తెలియవలయును.

౪. వాయువుయొక్క గుణకర్మనిర్ణయము

౧. వాయువను ద్రవ్యనిర్ణయము. వాయువు స్వరూపము లేనిదియని లక్షణము. గుణముగలదను వస్తునిర్దేశ్యముచే స్పర్శగుణము దీనికి లక్ష్యమగు చున్నది.

వాయువు నిత్యా నిత్యములని రెండువిధములు. నిత్యవాయువు పరమాణురూపము. అనిత్యవాయువు కార్యరూపము. అనఁగా సమానవ్యాన ఉదాన ప్రాణోపానములు. వాయువు శరీరేంద్రియ విషయములు. వాయులోకము శరీరము. మఱియు సూత్రాత్మ దీనికి సమష్టి ప్రాణమని చెప్పఁబడును. అపానరూపమున బృధ్వియందును, ప్రాణరూపమున (జలమునందును) సూర్యునియందును, నుదానరూపమునఁ దేజమునందును, వ్యానరూపమున

సర్వమునందును, సమానరూపమున భూమ్యాకాశ మధ్యప్రదేశమునందునుండి బ్రహ్మాండముల భరించుచున్నది కావున వాయులోకము దీనికి శరీరమని చెప్పబడును.

౨. సమష్టి శరీరవర్తియగు త్వగింద్రియము దీనికి నింద్రియమనఁబడును. అనఁగా సమాన వ్యానోదాన ప్రాణాపానములని యైదువిధములుగా విది తెలియఁబడు చున్నది. సమానముయొక్క యంతరభూతమపానము, ప్రాణముయొక్క యంతరభూతము దానము. కావునఁ నుదాన సమాన వ్యానములను త్రివిధ వాయువులు ముఖ్యములు. వ్యానము యొక్క యావరణము నందు నుదాన సమానము లుండును. కావునఁ త్రివిధవాయువులలో వ్యాన వాయువు ముఖ్యము. అందుచే వ్యానము దీనికి నింద్రియమని చెప్పఁబడినది.

౩. వృక్షాది కంపన వి స్తీర్ణ హేతువు లీవాయువునకు విషయములు.

౨. వాయువుయొక్క గుణ నిర్ణయము :— స్పర్శ ఇందలి శబ్ద మాకాశ మిశ్రమము వలనఁ గలిగినది. గుణము త్వగింద్రియముచేఁ గలిగినది. మఱియు విందు నుష్ణమున్నది. శీతలము జల సంబంధమైనది. అనుష్ణాశీతలములు పృద్వీవాయు సంబంధములు.

౩. వాయువుయొక్క కర్మనిర్ణయము :— పొదుపుచేయుట దీని కర్మము. చలించుట దీనిధర్మము.

౪. వాయువుయొక్క సామాన్యము :— ఆకాశమునుండి యిది యుత్పన్నమైనది. అందుచే నాకసముకన్న నిది చిన్నదని తెలియవలెను.

౫. వాయువుయొక్క విశేషత్వము :— పృధ్వీ జలాగ్నిలకన్న నిది పెద్దది. మఱియు ప్రాణరూపమునఁ బ్రపంచమును భరించుచున్నది. అందువలన నియ్యది వానికన్న గొప్పది. ఇట్లని దీని విశేష నిర్ణయము చేయఁబడినది.

౬. వాయువుయొక్క సమవాయి :— స్థావర జంగమాత్మకమగు జీవోపాధులయందు స్పర్శగ్రాహ్యకమగు త్వగింద్రియముగా నుండి దాచుట, దాటుట పరుగెత్తుట, తిరుగుట, వణకుట, యను నిట్టి పరిణామముల గలిగించు చున్నది. కావున సమవాయి పద్ధతి యిట్లు దీనియందు నిర్ణయ మగుచున్నది.

౭. వాయువుయొక్క యభావము :— ఆకాశము నుండియిది పుట్టినది. ఏకారణముచే మొదట జన్మించినదో ఆకారణముచే చివరనశించుచున్నది. అందువలన దీనికి శాశ్వతత్వములేదు. అభావమే యగుచున్నది.

శో॥ శబ్దగుణమాకాశం

## ౮. ఆకాశము యొక్క గుణకర్మనిర్ణయము :

ఆకాశేనవి ధ్వనే

౧. ఆకాశము రూపములేనిది — శబ్దగుణకమైనది - అని యాకాశ ద్రవ్యనిర్ణయము. రూపము లేదనుట లక్షణము, శబ్దగుణక మనుట లక్ష్యము. నిత్యానిత్యములచే నియ్యది రెండు విధములు. నిత్యాకాశ మావరణ రూపము. అనిత్యాకాశము కార్యరూపము. అనగా ఘట, మఠ, శిరోకారములు.

ఆకాశము శరీరేంద్రియ విషయములచే మరల మూఁడు భేదము లొందుచున్నది. ఆకాశము బయలుగానుండి అంతఃకరణాది సమష్టి వ్యష్టింద్రియ సముదాయమును, స్థావర జంగమాత్మకమగు సకలోపాధులను దిరుగ నిచ్చుటకును, కూర్చొన నిచ్చుటకును నవకాశ మొసంగు చున్నది. కావున నీ యవకాశమే యావరణము. ఇయ్యది యీ యాకాశమునకు శరీరము. సమష్టిశబ్దగ్రాహ్యకమగు శ్రోత్రేంద్రియ మాకాశమున కింద్రియము.

## ధ్వనించుట, ప్రతిధ్వనించుట దీని విషయము

౨. ఆకాశము యొక్క గుణము శబ్దము. ఇది యితర భూత మిశ్రమమునందు లేదు. కేవల శబ్ద మీ యాకాశమునకు చెందినది.

౩. శబ్దము శ్రోత్రేంద్రియమునుబొంది బుద్ధికి గ్రహింప యోగ్యమై మనః ప్రయోగముచే ప్రకాశితమై యలరారుచున్నది. ఇది యాకాశ ప్రదేశము స్థానము గలదిగా నున్నది.

శబ్దము ధ్వన్యాత్మక, వర్ణాత్మకములని రెండు విధములు. భేర్యాదుల యందు ధ్వన్యాత్మకముండును. గీర్వాణాది భాషలయందుండునది వర్ణాత్మకము.

౩. స్వయముగ జలించు పద్ధతి యాకాశమునకు లేదు. కావున దీనికి కర్మ నిర్ణయములేదు. అట్లయినచో నిది బ్రహ్మమనుటకు వీలుగాదు. ఎందు కనఁగా దీనికి గుణము కలదు. కావున నిది యచల పరిపూర్ణము కాఁజాలదు.

౪. ఆత్మకన్న నాకాశము చిన్నది. కావున దీనియొక్క సామాన్యత్వము మనకు గోచరించుచున్నది. "ఆత్మానమాకాశసంభూతః" అని శ్రుతి.

౫. పృథ్వీజలాగ్ని వాయువులకన్న నాకాశము గొప్పదిగా నున్నది. అందుచేత నాకాశ విశేషత్వము నిర్ణయ మగుచున్నది.

౬. స్థావర జంగమాత్మకములగు జీవోపాధులయందు శబ్దగ్రాహ్యకమగు శ్రోత్రేంద్రియముగాను, కామ, క్రోధ, లోభ, మోహ భయములుగాను పరిణామ మీ యాకాశము పొందుచున్నది. అందుచే దీనియొక్క సమవాయిత్వము నిర్ణయమగుచున్నది.

౭. ఆత్మనుండి యాకాశము పుట్టినది. కావున దీనికి జన్మ కలదు. జన్మ మెప్పుడు గలదో మరణము కూడ నప్పుడే కలదు. కావున నాకాశము యొక్క యభావమిట్లు నిర్ణయమగు చున్నది.

## ౬. దిక్కులయొక్క గుణకర్మనిర్ణయము

౧. సూర్యోపాధి స్థానము దిక్కుల లక్ష్య నిర్దేశ్యము. దిక్కుల లక్షణములు - సూర్యోపాధి సంభవించు దిక్కు తూర్పు. దీని యెడమ ప్రక్క యాగ్నేయము. దానికి నెడమప్రక్క దక్షిణము. దాని నెడమప్రక్క నైఋతి, దాని యెడమ ప్రక్క పశ్చిమము దాని యెడమప్రక్క వాయవ్యము. దాని యెడమప్రక్క ఉత్తరము. దాని యెడమప్రక్క యీశాన్యమని యిట్లు దిక్కుల నిర్ణయము చెప్ప నొప్పుచున్నది. ఇందు తూర్పున సూర్యునకు నుదయము కల్గుచున్నది. అట్లే పశ్చిమమందు నస్తమయము కల్గుచున్నది.

### ౨. దిక్కులయొక్క గుణనిర్ణయము

శ్లో॥ "పూర్వ దశే పుణ్య మతిః
ఆగ్నేయే నిద్రాలశ్యౌ, దక్షిణే క్రూరం,
నైఋతే పాపం పశ్చిమే క్రీడా సక్తిః,
వాయవ్యే గమనం, ఉత్తరే రతిప్రీతిః, ఈశాన్య ద్రవ్యదానం,
మధ్యే వైరాగ్యం, కేసరే జాగ్రతాయాం,
కర్ణికే స్వప్నం, లింగేనుషుప్తిః"
పద్మ త్యాగే తురీయః.

౩. దిక్కులకు కర్మ నిర్ణయములేదు. ఎందుకనగా నివి స్వస్థానము నుండి కదలునవి గావు. అందుచే వీనికిఁ గర్మలేదు.

౪. జంగమాదుల శిరోభాగమునందు వీనికి మూర్తిస్థాన నిర్ణయము చేయఁబడినది. అందుచేత నీ దిక్కులయొక్క సామాన్య నిర్ణయము తెలియఁబడు చున్నది.

౫. సమష్టి ప్రాణిరూప సూత్రాత్మనుండి యివి సంభవించినవి. కావున వీనికి విశేష నిర్ణయము చేయఁబడినది.

౬. సహస్రార రూపాష్టదళ పద్మమునందు దిక్కులు పరిణామము పొందు చున్నవి. అందుచేఁవీని సమవాయిత్వ మిట్లు నిర్ణయమైనది.

౭. అభావ రూపాకాశము నందుఁ గాలరూపమగు కారణముచేత దిక్కు లేర్పడినవి, కావున దిక్కులభావములై నవి.

## ౭. కాలము యొక్క గుణకర్మనిర్ణయము

౧. కాలముయొక్క ద్రవ్య నిర్ణయము :— ఇదిగడచిపోయినది. ఇఁకముందిది కాఁగలదను వ్యవహారము దేనియందుఁ దెలియఁబడుచున్నదో యదియే కాలముయొక్క లక్ష్యము. ఆగక గడచిపోవుట దీని లక్షణము.

౨. కాలముయొక్క గుణనిర్ణయము :— జలమునందలిశీతలము. అగ్నియందలి యుష్ణత్వము. పృథ్వీ వాయువులందలి అనుష్ణాశీతలములు దీనియందుఁ గలవు. కావున శీతోష్ణానుష్ణా శీతలము లీ కాలముయొక్క గుణములని తెలియవలయును.

౩. కాలముయొక్క కర్మను నిర్ణయించుటకు సాధ్యముకాదు. ఎందువల ననఁగా నిది సకల జీవోపాధుల కర్మానుభవమునకుఁ గారణ మగుచున్నది. ఇట్లు కారణ రూపమగు దీనికి కర్మానుభవము శూన్యమయ్యెను.

తిథి, వార, నక్షత్ర యోగ కరణములందు దిన, వార, పక్ష, మాస, ఋత్వాయన, సంవత్సర, పురుషాంత, యుగాంతములయందు జీవోపాధులు కర్మానుభవము పొందుచున్నారను నిర్ణయముగలదు. కాని తిథి, వార నక్షత్ర యోగ కరణములుగాని, దినాది యుగాంతములుగాని-కర్మానుభవము పొందినట్లు నిర్ణయములేదు. కావున గాలమునకుఁ గర్మానుభవములేదు.

౪. కాలముయొక్క సామాన్యనిర్ణయము :— స్థావరజంగ మాత్మక ములగు జీవో పాధుల కాల నిర్ణయము సామాన్యము. మఱియు వర్తమాన కాలము సామాన్య మనఁబడును.

౫. కాలముయొక్క విశేషనిర్ణయము :— భూతతద్దర్శభవిష్య త్కాలములు, కాల విశేషములు.

౬. కాలముయొక్క సమవాయి :— జగచ్చక్షువగు దివాకరుని యందు గాలము సముత్పన్న మగుచున్నది. సర్వకాల నిర్ణయము దివాకరుని వలన నగుచున్నది అందుచే గలియు స్వభావము దీనియందున్నది. కనుక సమవాయిత్వకాలము నిర్ణీతమైనది.

౭. కాలముయొక్క అభావనిర్ణయము:—అతీతాది వ్యవహార హేతు వగు చలనకాలము. అందుచే నీ కాల మభావము చెందునదియనినిర్ణయము.

## ౮. మనస్సు యొక్క గుణకర్మనిర్ణయము

౧. మనస్సను - ద్రవ్యనిర్ణయము :— ఆత్మకుఁ బదార్థజ్ఞానము కలుగఁజేయునది మనస్సు-అని లక్ష్యము. సుఖాద్యుపలబ్ధి సాధనములక్షణము. తనయందుఁగల సుఖదుఃఖముల గనుఁగొనుటకు నాత్మకియ్యది కారణ ముగా నున్నది. ఈ మనస్సు లేనిచో నాత్మకు నే విషయము గోచరము గాదు.

నిత్యా నిత్య భేదములచే నిది రెండు విధములు. పరమాత్మ పరముగా నున్న మనస్సు నిత్యమనియుఁ బ్రకృతిపరముగా నున్న మనస్సనిత్యమనియుఁ జెప్పఁబడును శరీరేంద్రియ విషయములీ మనస్సునకుఁ గలవు. హిరణ్య గర్భము లేక సమష్టిరూప సూక్ష్మ దేహము మనస్సునకు శరీర మనబడును. సమష్టి సంకల్ప రూపమగు నంతఃకరణ మీ మనస్సునకు నింద్రియము.

సృష్టి, స్థితిలయ, వి స్తీర్ణాకర్షణములు దీని లక్షణములు.

౨. మనస్సుయొక్క గుణనిర్ణయము :— సంకల్ప వికల్పములు మనోగుణములు.

౩. మనస్సుయొక్క కర్మ నిర్ణయము :— మనస్సు పరమాణువగు సూక్ష్మద్రవ్యమును పృథివ్యాది సూక్ష్మస్థూల ద్రవ్యములను బ్రమాణ బద్ధము లుగాఁ పదార్థ నిర్ణయముచేసి తనయందే యుంచి, వానిని బెంపుచేసి, తన యందేలయింపఁజేసికొనుచున్నది. మఱియు నంతఃకరణమందుఁ బ్రజ్ఞారూపము

గను, బాహ్యమునందు సంకల్పరూపముగను నుండి రూప నామ క్రియలుగ నీ సంసార సాగరమును బహువిధము లొనర్చు చున్నది యీ మనస్సు. కావున నిదియే దీని కర్మయని తెలియవలయును.

४. మనస్సుయొక్క సామాన్య నిర్ణయము :— వ్యష్ట్యంతఃకరణ విషయం మనస్సునకు సామాన్యము. "నాగృహము, నాభార్య, నాపుత్రుఁడు, నాయారామ ధనకనక వస్తువాహన వితానములని కించిజ్ఞత్వముచేఁ గూపస్థ మండూకమువలె భావించునట్టిస్థితిని కలుగజేయునంతఃకరణము సామాన్యము.

౫. మనస్సుయొక్క విశేష నిర్ణయము :— గృహస్థాశ్రమమున ననుభవములగు సుఖదుఃఖాదుల సంతోషముతో స్వీకరించుచుఁ దోసిపుచ్చక వానివలనఁగలుగు ననుభవమును తెలిసికొని గుర్వాజ్ఞానుసారముగ నమస్థాన సిద్ధిగలిగి లోక కళ్యాణాస్పదములైన కార్యముల నొనర్పఁ బ్రబోధన మొనర్చునట్టి మనస్సు విశేషమని చెప్పఁబడును. మఱియు నంతఃకరణమందు సుషుప్త్యావస్థ నొందక బాహ్యమునందు విషయపంచకముతోఁ జేరక యాత్మ యందు వ్యాపకము చేయునట్టి మనస్సు విశేష మనస్సనియుఁ జెప్పఁబడును.

౬. మనస్సుయొక్క సమవాయినిర్ణయము:-మనస్సు పరిణామమువలన జ్ఞానేంద్రియ రూపమునొంది విషయ పంచకమును తెలిసి కర్మేంద్రియముల ద్వారా కర్మాచరణ మొనర్చి దానిచేఁ గలుగు కర్మానుభవ విషయములు తన యందునుంచి వాని ననుభవ మొనర్చుటకు బ్రయత్నించును. కనుక మనస్సు సమవాయి యని నిర్ణయింపఁబడినది.

౭. మనస్సుయొక్క అభావ నిర్ణయము :— జాగ్రదావస్థయందు మనస్సు గోచరించు చుండును. సుషుప్త్యావస్థయందు మనస్సు తెలియక యున్నది. కావున మనస్సు శాశ్వతముగాక అభావమై యున్నది.

## ౯. ఆత్మయొక్క గుణకర్మనిర్ణయము

జీవేశ్వర ద్వంద్వపద్ధతి యాత్మదియని లక్ష్యనిర్దేశ్యము. స్వప్రకాశ మని, యధిష్ఠానమని, క్షేత్రజ్ఞుఁడని లక్ష్యము. ఇట్లాత్మయను ద్రవ్యమునుఁ దెలిసికొనవలయును.

ఈ యాత్మ నిత్యమని, - అనిత్యమని రెండువిధములు. పరమాత్మ రూపమగు ధర్మము నిత్యము. జీవేశ్వర స్వరూప మధిదేవత్వము లనునవి యనిత్యములు, అశాశ్వతములు.

శరీరేంద్రియ విషయములని యాత్మ మూడు విధములు. ప్రకాశములయందలి స్వయంప్రకాశము దీనికి శరీరము, బుద్ధిరూపమగు జ్ఞానము దీనికి నింద్రియము. బుద్ధియొక్క నిశ్చయము సర్వవ్యవహారములకుఁ కారణమగుచున్నది. అందుచే నీ బుద్ధి జ్ఞానమని వ్యవహరింపఁబడినది. ఇది శ్రుతి రూపజ్ఞానమనియు, ననుభవజ్ఞానమనియు రెండు భేదములు పొందుచున్నది.

శ్రుతి సంస్కారమువల్ల మనుష్యునియందు పుట్టిన జ్ఞానము శ్రుతి జ్ఞానమనియు, దానికిభిన్నమగు జ్ఞాన, మనుభవజ్ఞానమనియుఁ జెప్పఁబడును. ఈ యనుభవజ్ఞానము యదార్థజ్ఞానమనియు, నయదార్థజ్ఞానము లనియు రెండు విధములు.

౧. వెండినిజూచి వెండియని నిర్ణయించుట యదార్థజ్ఞానము. :— ముత్యపు చిప్పయందలి మెఱుపునుజూచి వెండియని నిర్ణయించుట అయదార్థ జ్ఞానము. కావున యదార్థజ్ఞానము పరమాత్మకు నింద్రియ [illegible]. శ్రుతిజ్ఞానముగాని, అయదార్థజ్ఞానముగాని పరమాత్మకు నింద్రియములు కాజాలవు. ఏలయన, శబ్దసంజ్ఞవల్లఁ గలిగినది శ్రుతిజ్ఞానము. కావున ననుమాన ప్రమాణము నిశ్చయముగా నుండదు. రాత్రిజూచిన యొందు మొద్దునందు మానవ నిర్ణయము పగలు భిన్నముగ మాఱుచున్నది. అందుచేత శ్రుతిజ్ఞాన మయదార్థజ్ఞానము, పరమాత్మజ్ఞానములు కావని తెలియ వలెను. యదార్థజ్ఞాన మనగా నున్నది యునట్లు తెలిసికొనుట. కావున వస్తు నిశ్చయ జ్ఞానము పరమాత్మకు నింద్రియమని చెప్పఁబడినది.

ఆత్మపాద చతుష్టయమగు విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మలను, బ్రహ్మపాద చతుష్టయమగు విరాడ్హిరణ్యగర్భుల వ్యాకృత పరమాత్మలను. చతుర్దశేంద్రియాది దేవతలను పరమాత్మకు విషయము లని తెలియ వలయును.

౨. ఆత్మయొక్క గుణ నిర్ణయము :— పరమాత్మ రూపమునఁ దెలియఁజేయుటయు బ్రత్యగాత్మ రూపమునఁ దెలిసికొనుటయు నాత్మయొక్క గుణమని నిర్ణయింపఁబడినది.

౩. ఆత్మయొక్క కర్మ నిర్ణయము :— అవ్యాకృత రూపమున నంతః కరణమందు నుండి కర్మానుభవములను బొందుటయు, హిరణ్య గర్భ రూపమున సూక్ష్మ శరీరముల యందుండి నేను నేనని యభిమానించుటయు, విరాడ్రూపమున వ్యష్ట్యభిమానమువలన నేను వ్యష్టిరూపుడనని భావించుటయు, మఱపు నందుండి గుఱుతును దనంత తానే పొందుటయు ననగాఁ దెలివిబొందుటయు సుషుప్తినుండి మేలుకొనుటయు, మరణమునుండి పునరావృత్తికి వచ్చుటయుఁ, బ్రాణవాయువును వెలుపలినుండి లోనికి పీల్చుటయు, నపానవాయువును లోపలినుండి వెలుపలికిఁ బోనిచ్చుటయుఁ, గంటిఱెప్పల, బైకెత్తుటయు వ్రాల్చుటయుఁ, బ్రాణమును ధరించుటయు, నాలోచించుటయు, యదేచ్ఛా గమనము కల్గియుండుటయు, వింద్రియముల నువిషయములయందు జేర్చి వానిని గ్రహించుటయు; నాకలి, దప్పిక, రోగము, సుఖము దుఃఖము లను వీని బొందుటయు నాత్మయొక్క కర్మ నిర్ణయమని తెలియవలయును.

౪. ఆత్మయొక్క సామాన్య నిర్ణయము :— అంతఃకరణాధిష్ఠాన రూపము సామాన్యము. అనఁగాఁ దనయందుఁ దనయొక్క యునికి సామాన్యమని భావము.

౫. ఆత్మయొక్క విశేష నిర్ణయము :— ఊర్ధ్వభాగమునందుఁ బరమాత్మ రూపమగు పరబ్రహ్మము, ప్రకాశమగను నధోభాగమునందుఁ దన్మాత్ర సహిత జడముగను, మధ్యభాగమునందు దైవస్వరూపమగను, మిశ్రభాగములందు జీవత్వముగను నీ యాత్మను విశేషముగ నిర్ణయింపఁబడినది.

౬. ఆత్మయొక్క సమవాయి నిర్ణయము :— వృక్షమును విడిచి బీజము, బీజమును విడిచి వృక్షము లెట్లుండవో అట్లాత్మయొక్క సమవాయి నిర్ణయమగును. అనగా వృక్ష పరిణామము బీజ మగుచున్నది మఱల నా బీజ పరిణామము వృక్షమగుచున్నది. అట్లే యాత్మ పరిణామము జీవేశ్వర జగత్తగను, జీవేశ్వర జగత్పరిణామ మాత్మముగను నగుచున్నవి. కావున నాత్మ సమవాయము యని చెప్పఁబడును.

౭. ఆత్మయొక్క యభావ నిర్ణయము :— ఉప్పెనచే వృక్షము నశించును. వి త్తనము వాతావరణము మాఱుటవలనఁ బుచ్చును. అట్లే యచల పరిపూర్ణ పరబాహ్యముయొక్క స్థితివలన నాత్మ నశించుచున్నది. కావున, నాత్మ యభావముఁ జెందుచున్నదని సిద్ధాంతము.

## త త్వ ము

పల్లవి :— కనుగొనగలవా జీవా । ఘనబోధో క్తస్థితిసి ॥ కను ॥

1. కర్మ, భక్తి, జ్ఞానంబుల వీడి । మంత్ర, యోగ, ధ్యానంబుల మాని । ఉన్న బయలునా సున్న యెరుకయని । అన్న మాత్రమున యధికుడవేనా ॥ క ॥

2. సాధనలన్నియు చాల వ్యర్థమని । పూర్ణగురువునకు పూజ చాలునని । తను మన ధనములు తనకే యిమ్మని । బోధచేసేటి బోధ గురులచే ॥క॥

3. రెంటికిం జెడిన రేవడి రీతిగ । ఎరుక జగంబులు యెన్న స్వప్నమని । బయలదొక్కటే పరమ మేల్కయని । ఊహ మాత్రమున యువ్విళ్లూరా ॥క॥

4. ఎరుకనయేదో, యెటుల బుట్టెనో । ఏడబోవునో, యెటుల వీడునో । యేమి తెలియకా, ఎరుకశూన్యమని । యెంత గొణిగినా, ఏమిఫలమురా ॥క॥

5. "వేదశాస్త్రములు వివిధ విద్యలూ । ఏమి ప్రమాణములేను చేసినవే" । అవి వాదించెద వందలి సత్యము । సమన్వయించగ జాలకనేగా ॥క॥

6. "అచల పూర్ణుడను అశరీరుండను । లేనివాడనే శేక జేసెదమ । నేనె యబద్ధము నేను జేసినవి । విక్కమే లెట్లని సిగ్గినంతలో ॥క॥

7. చలాచలంబులు సద్గురుచేగని । ఎరుకై నిల్చుట యెరుగకనే । బయలుకు బయలౌ పరమ గోప్యమున । బయలు శూన్యమని మ్రగ్గకనే ॥క॥

8. దీక్షిత సిద్ధాంత దేవ మార్గమున । నిజగురు రూపము నెరుగుమురా । రాజయోగి గురు రాచబాటలో । రామచంద్రువలె రయమున రారా॥

॥కనుగొనగలవా॥

# తృతీయ సోపానము

## సృష్టి నిర్ణయము

| | | |
|---|---|---|
| ౧. బ్రహ్మము | ఆత్మ | పరాకాశము |
| ౨. అవ్యక్తము | మనస్సు | దహరాకాశము |
| ౩. మహత్తు | దిక్కులు | నిర్వయవాకాశము |
| ౪. మహదహంకారము | కాలము | సూర్యాకాశము |
| ౫. భూతాకాశము | శబ్ద గుణముకలది. | |
| ౬. వాయువు | శబ్దము, స్పర్శము అను రెండుగుణములుకలది. | |
| ౭. అగ్ని | శబ్ద,స్పర్శ,రూపములనుమూడుగుణములుగలది. | |
| ౮. జలము | శబ్ద, స్పర్శ, రూప, రసములను నాల్గు గుణములు గలది. | |
| ౯. పృధ్వి | శబ్ద, స్పర్శ: రూప, రస, గంధములను నైదు గుణములు గలది. | |

వీనిని నవ ద్రవ్యములని తత్వవేత్తలు నిర్ణయించి యున్నారు. వీని కన్న వితరద్రవ్యము లేవికూడలేవు. ముమ్మాటికి నిదియే సిద్ధాంతము.

ఈ నవ ద్రవ్యములయందు బ్రహ్మాండ. విశ్వ. పిండాండములను మూఁడు నిర్ణయములు గలవు.

## బ్రహ్మాండ నిర్ణయము

౧. పరాకాశము, ఉత్తమ పురుషుఁడని, స్వయంప్రకాశమని, చేతన బ్రహ్మమని, చెప్పఁబడును.

౨. దహరాకాశ మక్షరపురుషుఁడని, సమష్ట్యంతఃకరణమని చెప్పఁబడును.

౩. నిరవయవాకాశము, పరా ప్రకృతి, సూత్రాత్మ, సమష్టి ప్రాణమని చెప్పఁబడును.

ఈ త్రివిధ ద్రవ్యముల సమూహమునకు బ్రహ్మాండమని పేరు.

## విశ్వ నిర్ణయము

| | |
|---|---|
| ౧. సూర్యాకాశము<br>౨. భూతాకాశము<br>౩. వాయువు<br>౪. అగ్ని<br>౫. జలము<br>౬. పృధ్వి | ఈషడ్విధ ద్రవ్యముల సమూహమునకు విశ్వమని పేరు. |

## విశ్వాభిమాని యగు నీశ్వర నిర్ణయము

సూర్యాకాశ మీశ్వరుని యంతఃకరణము.
భూతాకాశ మీశ్వరుని శిరోభాగము.
వాయు వీశ్వరుని కంఠస్థానము.
అగ్ని యీశ్వరుని హృదయస్థానము.
జల మీశ్వరుని కటిస్థానము.
పృధ్వి యీశ్వరుని పాదస్థానము.

విశ్వాభి మానియగు నీశ్వరుని విరాడ్రూప మన్నమయ కోశమని చెప్పఁబడును. జనన మరణము లన్నమయకోశ ధర్మములు.

సమష్టిస్థూలరూప విరాట్టనియు నీకోశమును జెప్పఁబడును.

## పరమేశ్వరుని ప్రాణమయకోశ నిర్ణయము

౧. సమాన రూపమున భూమ్యాకాశ మధ్య భాగమునందు వియ్యది యుండును.

౨. వ్యానరూపమున నిది సర్వమందుండి జగత్తును ధరించును.

౩. ఉదాన రూపమున నిది తేజస్సు నందుండును.

౪. ప్రాణరూపమున నిది సూర్యుని యందుండును.

౫. అపాన రూపమున నిది పృధ్వి యందుండును.

సర్వమునందు వ్యానరూపమున నున్న సమష్టి ప్రాణము సూత్రాత్మ యని చెప్పఁబడును.

ఈ సూత్రాత్మ యన్ని దేవతలలో గొప్పది.దీని సామర్థ్యమువలన నభి దేవతలు సమష్టి ప్రపంచమునకుఁ బ్రకాశము నొసగుచున్నారు. అగ్ని మండు చున్నది. మేఘములు వర్షించుచున్నవి. నక్షత్రములు రాలక యున్నవి. భూమి క్రుంగక నిలిచియున్నది. భూమియందన్నాదులు సముత్పన్నములగుచున్నవి. స్థూల సూక్ష్మ రూపమగు సర్వ ప్రపంచము ధరింపఁబడు చున్నది.

## పరమేశ్వరుని కర్మేంద్రియములు

౧. అగ్ని
౨. యింద్రుదు
౩. ఉపేంద్రుఁడు
౪. ప్రజాపతి
౫. యముఁడు

ప్రాణేంద్రియములు కర్మేంద్రియములు గూడి యీశ్వరువిప్రాణమయకోశమగును. కాలత్రయరూపమున యిది సర్వము నాక ర్షించుచున్నది. కావున దీని ధర్మము ఆక ర్షించుట యైయున్నది.

## పరమేశ్వరుని మనోమయకోశ నిర్ణయము

౧. దిక్పాలురు
౨. వాయువు
౩. సూర్యుడు
౪. వరుణుఁడు
౫. అశ్వనీ దేవతలు

ఇవి పరమేశ్వరుని జ్ఞానేంద్రియ ములు. మనోధిష్ఠాన దేవతయగు చంద్రుడు జ్ఞానేంద్రియములతోఁ జేరుటచేఁ బరమేశ్వరుని మనో మయకోశ మేర్పడుచున్నది.

జీవుల కర్మానుసారముగ ఫలానుభవముల సృష్టింపఁబడుట దీవి ధర్మమైయున్నది.

## పరమేశ్వరుని విజ్ఞానమయకోశ నియర్ణము

జ్ఞానేంద్రియము లై దు :— విశ్వమనాదియని యభిమానించు బ్రహ్మ మనగా సమష్టి బుద్ధేంద్రియాభిమాని యగు బ్రహ్మముచేరి పరమేశ్వరుని విజ్ఞాన మయకోశ మేర్పడుచున్నది. స్థితిచేయుట దీని ధర్మము.

## పరమేశ్వరుని యానందమయకోశ నిర్ణయము

నిరవయవాకాశమగు పరాప్రకృతిని సమష్టి ప్రాణమని చెప్పబడును. దీవిని సూత్రాత్మయనియు చెప్పుదురు. ఇది పరమేశ్వరుని యానందమయ కోశము, సర్వము తనయందు లయము చేసికొనుట దీని ధర్మము.

పరమేశ్వరుని హిరణ్మయకోశనిర్ణయము:— దహరాకాశమగు నక్షర పురుష రూప సమష్ట్యంతఃకరణాధిష్ఠానము పరమేశ్వరుని హిరణ్మయకోశమని చెప్పబడును. తెలియజేయుట దీని ధర్మము.

స్వయంప్రకాశమగు పరబ్రహ్మ నిర్ణయము:— తెలియజేయుట, తెలిసికొనుట, యను నిర్ణయములేక కేవలము ప్రకాశవంతముగ నుండునది. స్వయం ప్రకాశ పరబ్రహ్మమని చెప్పబడును.

## పరమేశ్వర తను చతుష్టయ నిర్ణయము

౧. మహాకారణ శరీరము:— దహరాకాశమగు సమష్ట్యంతఃకరణము. పరమేశ్వరుని హిరణ్మయకోశము. దీని యభిమాని యక్షర పురుషుఁడు. ఈశ్వరోపాధియగు విశ్వము లయము పొందినను దాను చలించక యట్లేయుండును. కావున నీ యభిమాని నక్షర పురుషుఁడని చెప్పబడుచున్నాడు.

౨. కారణ శరీర నిర్ణయము:— ఆనంద మయకోశమును నిరవయవాకాశమందురు. నీ నిరవయవాకాశమగు పరా ప్రకృతి యీశ్వరుని యానంద మయకోశముగా నున్నది. దీని యభిమాని పరమేశ్వరుఁడు. ఇతనికి నంతర్యామియని పేరు. మఱియు సకలజీవులకు కర్మానుసారముగా ఫలముల నిచ్చుటచేత నితనికి నంతర్యామియని పేరు సార్థకమైనది. అవ్యాకృతుడనియు నిత నిని వ్యవహరింతురు.

౩. సూక్ష్మ శరీర నిర్ణయము:— ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములను త్రికోశములు కలిసి పరమేశ్వరుని సూక్ష్మ శరీరమగుచున్నది. దీనియభిమాని హిరణ్య గర్భుఁడు. సకల సూక్ష్మ శరీరములయందు సూత్రాత్మయగు ప్రాణుఁడు నేనని యభిమాన పడుటవలన హిరణ్మయ గర్భుఁడనియు, హిరణ్య గర్భుఁడనియు జెప్పఁబడుచున్నాడు.

౪. స్థూల శరీర నిర్ణయము:— స్థూల శరీర రూపమగు నన్నమయ కోశాభిమానిగానున్న పరమేశ్వరుని విరాట్టుగా వ్యవహరింతురు. సూక్ష్మ శరీరాభిమానము విడువక సకల ప్రాణుల స్థూల శరీరముల యందు నేను నేనని యభిమానము ధరించుటవలన నితనికి వైశ్వానరుఁడనియు, పేరు.

గలదు. , వైశ్వానరుఁడనేక రూపములతోఁ బ్రతీతి యగుటచే విరాట్టుఁడను నామము సార్ధకమగుచున్నది.

పరమేశ్వరుని భోగసాధన ముఖముల నిర్ణయము :— సమష్టి ప్రాణ పంచకము, సమష్టి జ్ఞానేంద్రియ పంచకము, దిక్పాలకులు, వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వనీదేవతలును; సమష్టి కర్మేంద్రియ పంచక మగు నగ్ని, యింద్రుఁడు, ఉపేంద్రుఁడు, ప్రజాపతి, యముఁడు ననువారును సమష్ట్యంతఃకరణ చతుష్టయాది దేవతలగు చంద్రుఁడు, బృహస్పతి, క్షేత్ర జ్ఞుడు రుద్రుఁడు ననువారును మొత్తముకలిసి పందొమ్మిది ముఖములుగాఁ బరమేశ్వరునకు నేర్పడి యున్నవని చెప్పడుచున్నది. వీనిలో ప్రాణ పంచ కము, కేవలా కర్షణ మాత్రముగ నుండుటచే దానిని తగ్గించి జ్ఞాన పంచక కర్మ పంచకాంతఃకరణ చతుష్టయాది దేవతల మాత్రమే పరమేశ్వరుని భోగసాధనా ముఖములని పెద్దలు నుడివి యున్నారు.

ఈ చతుర్దశ ముఖముల ద్వారా జీవుల కర్మమథవముల నెరుగుచు , నండజ, స్వేద జోద్భిజ్జ జరాయు జంబులను నుపాధుల గల్పించి వానికి భోగ యోగ్యంబులగు నన్నాదుల సృష్టించి తన్నివాసంబునకు దనయందుఁ బర మేశ్వరుఁడు పదునాల్గు లోకముల గల్పించెను. అందుచే నతని ముఖముల జీవుల కర్మానుసార నివాస లోకములుగాఁ బరిణమించెను.

ఇందుకు వేమనాదులిట్లు ప్రమాణవాక్యముల నొసగియున్నారు.
ఆ॥వె॥ అంతరంగమందు నపరాధములుచేసి మంచి వానివలెనే మనుజుఁడుండు

వితరు లెరుగకున్న నీశ్వరుఁడెరుగఁడా విశ్వదాభిరామ : వినుర వేమ :
కందార్థం : మరణ సుషుప్తులు జెందిన పురుషుఁడు ।

మేల్కొనినవాఁడుభువి తధితరుడౌ పురుషుఁడు ।
కలగను వాఁడని యెఱిఁగుండుము ।
మొదటి యాతఁడెఱుఁగడీ రెంటీ ।
రెండవ పురుషుఁడెఱుగు నీ రెంటి
నిర్వుతొక్కటెసుమ్మి తిరిగి పుట్టుచునుంద్రు
తిరిగి పుట్టఁడు వాఁడీ గురుబోధ నెరిగితే॥

## విరాడ్రూప నిర్ణయము

| ఆకాశము | శబ్దము | పరాశక్తి | అంబీజము | సదాశివుఁడు |
|---|---|---|---|---|
| వాయువు | స్పర్శము | ఆదిశక్తి | యంబీజము | ఈశ్వరుఁడు |
| అగ్ని | రూపము | జ్ఞానశక్తి | రంబీజము | రుద్రుఁడు |
| జలము | రసము | ఇచ్ఛాశక్తి | వంబీజము | విష్ణువు |
| పృధ్వి | గంధము | క్రియాశక్తి | లంబీజము | బ్రహ్మ |

౧. స్థూల సూక్ష్మ నిర్ణయము :— పృధ్వికన్న జలము సూక్ష్మము. జలముకన్న నగ్ని సూక్ష్మము. అగ్నికన్న వాయువు సూక్ష్మము. వాయువుకన్న నాకాశము సూక్ష్మము. ఆకాశముకన్న సూత్రాత్మ సూక్ష్మము. సూత్రాత్మకన్న నాకాశము స్థూలము. ఆకాశముకన్న వాయువు స్థూలము. వాయువుకన్న నగ్ని స్థూలము. అగ్ని కన్న జలము స్థూలము. జలముకన్న పృధ్వి స్థూలము.

### దీని వివరణ

పృధ్వి :— పట్టుకొనుటకుఁ జేతికి నబ్బును. (నమరును)

జలము :— చేతియందు నిలుచునుగాని చేతికి నబ్బదు.

అగ్ని : — రూపము మాత్రము తెలియును; కాని యది చేతితోఁ బట్టుకొనుటకు సాధ్యముకాదు. దాని కణముల నితర సాధనలచేఁ గై కొనవచ్చును.

వాయువు :— స్పర్శ గ్రాహకము. కాని దాని రూపము తెలియబడదు.

ఆకాశము:— స్పర్శ గ్రాహకముగాక శబ్దజనిత మూలమై యున్నది. అనగా శబ్దము దానియందు కలుగుచున్నదని యర్థము.

సూత్రాత్మ యన్నిటిని గుర్తించును, గాని తన్ను గాని, తన పద్ధతిని గాని దేనిచేత నెరుగ సాధ్యపడదు ఇట్లే సూక్ష్మాతి సూక్ష్మముల గ్రహింపవలయును అనగా స్థూలాతి స్థూలములెట్లు గ్రహింపఁబడినవో సూక్ష్మాతి సూక్ష్మములఁగూడనట్లే గ్రహింపఁ దగియున్నవి.

౨. గంధ తన్మాత్ర కన్న రస తన్మాత్ర సూక్ష్మము. రస తన్మాత్రకన్న రూప తన్మాత్ర సూక్ష్మము. రూప తన్మాత్రకన్న స్పర్శ తన్మాత్ర సూక్ష్మము.

స్పర్శ తన్మాత్రకన్న శబ్ద తన్మాత్ర సూక్ష్మము. శబ్ద తన్మాత్రకన్న సూత్రాత్మ సూక్ష్మము.

సూత్రాత్మకన్న శబ్ద తన్మాత్ర స్థూలము. శబ్దతన్మాత్ర కన్న స్పర్శ తన్మాత్ర స్థూలము. స్పర్శ తన్మాత్రకన్న రూప తన్మాత్ర స్థూలము. రూప తన్మాత్రకన్న రస తన్మాత్ర స్థూలము. రస తన్మాత్రకన్న గంధతన్మాత్ర స్థూలము.

## దీని వివరణ

ఘ్రాణేంద్రియముచేఁ దెలియఁబడు వాసనలు స్థూలాకృతిగానున్నవి. కావున గంధతన్మాత్ర స్థూలమని చెప్పఁబడినది.

జిహ్వేంద్రియముచేఁ దెలియఁబడు రస తన్మాత్ర స్థూలము యొక్క సూక్ష్మభాగముగానున్నది. అందుచేత రస తన్మాత్ర గంధ తన్మాత్రకంటె సూక్ష్మమని చెప్పఁబడుచున్నది.

నేత్రేంద్రియముచే తెలియఁబడు రూపము స్థూల సూక్ష్మ పద్ధతులు గాక కేవలాకార మాత్రముగానున్నది. అందువలన రస తన్మాత్ర కంటె రూప తన్మాత్ర సూక్ష్మమని చెప్పఁబడుచున్నది. మఱియు నీ మూఁడు తన్మాత్రలు వస్తువుయొక్క స్థూల సూక్ష్మాంశములను రూపములను తెలిసి కొనునవిగ నున్నవి. ఇట్లు వ్యవహరింపఁబడునది బాహ్య వృత్తియనఁబడును.

త్వగింద్రియముచే దెలియబడు స్పర్శ తన్మాత్ర రూపతన్మాత్రకన్న సూక్ష్మమని చెప్పఁబడినది.

శ్రోత్రేంద్రియముచేఁ దెలియఁబడు శబ్ద తన్మాత్ర స్పర్శ గ్రాహకము గాక కేవల శబ్దమాత్రముగనున్నది. కావున స్పర్శ తన్మాత్రకంటె శబ్ద తన్మాత్ర సూక్ష్మమని చెప్పఁబడుచున్నది.

శబ్దముచేఁ దెలియఁబడు సూత్రాత్మ పరావాక్కనఁబడును. ఇది శబ్ద తన్మాత్రకన్న సూక్ష్మమని తెలియవలయును. పరావాక్కనగా గుణాతు. (అంతఃకరణము నందలి తెలివియనియు దీనిని చెప్పవచ్చును.) ఇట్లే స్థూల విజ్ఞయమెఱుఁగఁదగును.

౩. క్రియాశక్తికన్న నిచ్ఛాశక్తి సూక్ష్మము. ఇచ్ఛాశక్తికన్న జ్ఞానశక్తి సూక్ష్మము. జ్ఞానశక్తికన్న నాదిశక్తి సూక్ష్మము. ఆదిశక్తికన్నఁ బరాశక్తి సూక్ష్మము. పరాశక్తికన్న సూత్రాత్మ సూక్ష్మము.

సూత్రాత్మకన్న పరాశక్తి స్థూలము. పరాశక్తికన్న నాదిశక్తి స్థూలము. ఆదిశక్తికన్న జ్ఞానశక్తి స్థూలము. జ్ఞానశక్తికన్న నిచ్ఛాశక్తి స్థూలము. ఇచ్ఛాశక్తికన్నఁ గ్రియాశక్తి స్థూలము.

## దీని వివరణ

క్రియా రూపము బాహ్య వ్యవహారముగ నున్నది కాఁబట్టి దీనిని స్థూలమని నిర్ణయింప బడినది.

ఇచ్ఛాపద్ధతి యంతరింద్రియమగు మనోరూపముగానున్నది. అందుచేతఁ గ్రియాశక్తికన్న నిచ్ఛాశక్తి సూక్ష్మమని తెలియవలయును. జ్ఞానపద్ధతి మనోనిర్ణయముకంటె సూక్ష్మముగనున్నది. కావున నిచ్ఛాశక్తి కంటె జ్ఞానశక్తి సూక్ష్మమని యెఱుఁగవలయును.

ఆది యగు గుఱుతు కలిగియున్నది; గావున జ్ఞానమిట్టిదని నిర్ణయింప వీలగుచున్నది. అందువలన జ్ఞానశక్తికంటె నాదిశక్తి సూక్ష్మమనిచెప్పబడెను.

పరాశక్తి ఆదిశక్తి కంటె సూక్ష్మమని తెలియవలెను. ఆదిగా నున్న గుఱుతునుఁ గ్రియోన్ముఖము చేయునట్టి సత్త పరాశక్తికిఁగలదు. కావునఁ బరాశక్తి - ఆదిశక్తికంటె సూక్ష్మమని యెన్నదగియున్నది. ఇది సర్వమును ప్రబోధన మొనర్చుచున్నది. ( ప్రేరేపించుచున్నది. ) పరాశక్తి కన్న సూత్రాత్మ సూక్ష్మమైయున్నది. క్రియోన్ముఖమగు ప్రతివిషయము తెలిసికొని తగుఫలము నొసగునది సూత్రాత్మ. అందుచేఁ బరాశక్తి కంటె సూత్రాత్మ సూక్ష్మమని చెప్పఁబడినది.

౪. లం బీజముకన్న వం బీజము సూక్ష్మము. వంబీజమున కన్న రం బీజము సూక్ష్మము. రంబీజమున కన్న యంబీజము సూక్ష్మము. యంబీజమున కన్న అంబీజము సూక్ష్మము. అంబీజమున కన్న సూత్రాత్మ సూక్ష్మము.

సూత్రాత్మ కన్న అంబీజము స్థూలము అంబీజమున కన్న యంబీజము స్థూలము యంబీజముకన్న రంబీజము స్థూలము. రంబీజమునకన్న వంబీజము స్థూలము. వంబీజమునకన్న లంబీజము స్థూలము.

## ౭ దీని వివరణ

లంబీజము పృధ్వీ వాచకము. స్థంభన క్రియ స్థూలమని చెప్పబడును. వంబీజము జలవాచకము. మోహన క్రియగలదియై యిది యుండును. అందుచే లంబీజమున కంటె నిది సూక్ష్మమని వ్యవహరింపఁబడినది.

రంబీజ మగ్ని వాచకము దీనిని మారణ క్రియయని చెప్పుదురు. అందుచే నిది వంబీజమున కంటె సూక్ష్మమైయున్నది.

యంబీజము వాయు వాచకము. ఉచ్చాటన క్రియ గలిగి యిదియొప్పు చున్నది. కావున రకారమునకంటె నిది సూక్ష్మమని తెలియవలయును. అంబీజము బ్రహ్మ స్వరూపమగు నాకాశ వాచకము. ఇది యాకర్షణ క్రియతో నలరారుచున్నది. కావున యంబీజమున కంటె నిది సూక్ష్మముగా నున్నది.

సకల బీజములకు సూత్రాత్మ యాధారము అందువలన అంబీజము కన్న సూత్రాత్మ సూక్ష్మమని గమనింపఁదగును.

౫. బ్రహ్మకన్న విష్ణువు సూక్ష్మము. విష్ణువుకన్న రుద్రుఁడు సూక్ష్మము. రుద్రునికన్న నీశ్వరుఁడు సూక్ష్మము. ఈశ్వరునికన్న సదాశివుఁడు సూక్ష్మము. సదాశివుని కన్న సూత్రాత్మ సూక్ష్మము.

సూత్రాత్మకన్న సదాశివుఁడు స్థూలము. సదాశివుని కన్న నీశ్వరుఁడు స్థూలము. ఈశ్వరునికన్న రుద్రుఁడు స్థూలము రుద్రునికన్న విష్ణువు స్థూలము. విష్ణువుకన్న బ్రహ్మ స్థూలము.

## దీని వివరణ

బ్రహ్మ సృష్టిచేయు వాఁడు గనుక స్థూల లక్షణము గలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

విష్ణువు స్థితి చేయువాఁడు గనుక బ్రహ్మకంటె నితఁడు సూక్ష్మ స్వరూపుఁడుగా నున్నాడు.

రుద్రుఁడు లయకారుఁడు కనుక విష్ణువుకంటె సూక్ష్మ స్వరూపుఁడై యితఁడలరారుచున్నాఁడు. కావున స్థూల రూపమైన ప్రాణమును నితఁడు దహించుచున్నాడు. అందుచే సూక్ష్మరూపునిగా నితని జెప్పఁబడును.

ఈశ్వరుఁడు వి స్తీర్ణము చేయుచున్నాఁడు. అందువలన రుద్రునికన్న సూక్ష్మ రూపునిగా నీతనిని వ్యవహరించుచున్నారు. లయము జెందిన జీవులను వారి వారి కర్మానుసారమునుబట్టి నాయాలోకములకు నితఁడు చేర్చుచున్నాడు. కనుక రుద్రునికంటె నీ యీశ్వరుని సూక్ష్మ స్వరూపిగాఁ జెప్పఁబడెను.

సదాశివుఁడు సర్వము నాకర్షించుచున్నాడు. అందుచే నితఁడీశ్వరుని కన్న సూక్ష్మ స్వరూపిగా నున్నాడు. స్థావర జంగ మాత్మకములగు నెనుఁబది నాల్గు లక్షల జీవోపాధుల సూక్ష్మ శరీరముల నాకర్షించి యజ్ఞాన రూపక మగు మఱుపునందు నీ సదాశివుఁడు చేర్చుచున్నాఁడు. కావున నీశ్వరునికన్న నితఁడు సూక్ష్మ స్వరూపుఁడని చెప్పుచున్నారు.

సదాశివుని కన్న సూత్రాత్మ సూక్ష్మమైయున్నది. అజ్ఞానావరణ రూపమగు మఱుపునందు నున్న జీవచయంబులకు గర్మాను సారంబుగా నుపాధులు గల్పించి యవస్థాత్రయ రూప కర్మానుభవము తెలియఁజేయు చున్నాడు. అందుచేత సదాశివునికన్న సూత్రాత్మ సూక్ష్ముఁడని తెలియనగు.

## సూత్రాత్మయొక్క భూతసముదాయ కర్మధర్మములు

సూత్రాత్మయొక్క ధర్మము తెలియజేయుట. తెలిసికొనుట దానికర్మము.

౧. బయలుగానుండుట యాకాశముయొక్క ధర్మము.
అవకాశమిచ్చుట దాని కర్మము.

౨. చలించుట వాయువుయొక్క ధర్మము.
చేర్చుటఁ పొందుపుచేయుట దాని కర్మము.

౩. వెలుగుట అగ్నియొక్క ధర్మము. కాల్చుట దానియొక్క కర్మము.

౪. తడుపుట జలముయొక్క. ధర్మము. ముద్దజేయుట దాని కర్మము.

౫. కఠినముగానుండుట పృథ్వి ధర్మము. ధరించుట దాని కర్మము.

కావున సూత్రాత్మ పృధ్వి యధిష్ఠాన దేవతయగు బ్రహ్మ స్వరూపంబున లకార బీజము యొక్క ప్రేరేపణచే క్రియాశక్తి రూపమున గంధతన్మాత్రద్వారా పృధ్వినుండి సకలము పుట్టించు చున్నది. అందుచే నిది పృధ్వీ సబకమని చెప్పఁబడును.

సూత్రాత్మ జలాధిష్ఠాన దేవతయగు విష్ణురూపమున వకార బీజము యొక్క ప్రేరేపణచేత నిచ్ఛాశక్తి స్వరూపుఁడై రసతన్మాత్ర ద్వారా జలము నుండి సర్వము పోషించుచున్నది. కావున దీనిని జల సబకమని వ్యవహరింతురు.

సూత్రాత్మ అగ్ని యాధిష్ఠాన దేవతయగు రుద్ర రూపమున రకార బీజముయొక్క ప్రేరేపణచే జ్ఞానశక్తి రూపుఁడై రూప తన్మాత్ర ద్వారా అగ్నినుండి సర్వము నిరూపించుచున్నాడు. మఱియు దహించుచున్నాఁడు. ఇది అగ్ని భూత సబకము.

సూత్రాత్మ వాయు వ్యధిష్ఠాన దేవతయగు నీశ్వర రూపమున యకార బీజముయొక్క ప్రేరేపణచేత నాదిశక్తి రూపుఁడై స్పర్శ తన్మాత్ర ద్వారా వాయువునుండి సర్వము విస్తీర్ణ మొనర్చును. ఇది వాయు భూత సబకము.

సూత్రాత్మ యాకాశాధిష్ఠాన దేవతయగు సదాశివ స్వరూపమున అకార బీజముయొక్క ప్రేరేపణచే పరాశక్తి రూపుండై శబ్ద తన్మాత్ర ద్వారా నాకాశమునుండి సకలము నాకర్షించుచున్నాఁడు. ఇది యాకాశ సబకము.

ద్వితీయ సృష్టి

## పిండాండ సృష్టి నిర్ణయము

౧. పంచ భూతములనుండి స్థూల శరీరము కల్గెను.

౨. పంచ తన్మాత్రలనుండి యింద్రియములు గల్గెను.

౩. పంచ శక్తులనుండి జీవుఁడేర్పడెను.

౪. పంచబీజములనుండి ప్రాణమేర్పడెను.

౫. పంచాధి దేవతలనుండి ప్రత్యగాత్మ కల్గెను.

## ౧ పంచ భూతములనుండి స్థూల శరీర మేర్పడిన నిర్ణయము

౧. పృథ్వినుండి యెముకలు, మాంసము, నరములు, చర్మము, రోమములు కల్గినవి. పృథ్వియొక్క నిజాంశమగు కఠినత్వమువలన నెముకలు గల్గినవి, పృథ్వి, జలముతో చేరినపుడార్ద్రీకృత మొంది మాంసము కలిగెను. పృథ్వియొక్క కఠినత్వము, జలముయొక్క మృదుత్వము మాంసమునందు గలదు. పృథ్వి యగ్నితో చేరినపుడు నరములేర్పడెను. నరములందు నగ్ని యొక్క తేజము పృథ్వియొక్క కఠినత్వము కలదు పృథ్వి వాయువుతోఁ జేరినపుడు చర్మమేర్పడెను. చర్మమునకు వాయుగుణమగు స్పర్శయు, పృథ్వి గుణమగు కఠినత్వమును కలదు. పృథ్వి యాకాశముతో జేరినపుడు గోళ్ళు వెంట్రుకలు కల్గెను. గోళ్ళు వెంట్రుకలయందు నాకాశముయొక్క శూన్య తయు బృథ్వియొక్క కాఠిన్యము గలదు.

౨. జలమునందు చొల్లు, చెమట, రక్తము, మూత్రము, శుక్లము, అనునవి కల్గినవి.

జలముయొక్క నిజాంశముచే శుక్లము గల్గెను. శుక్లము ప్రాణమునకు నాధారముగా నున్నది.

కావున నిది జలముయొక్క నిజాంశమని తెలియవలసియున్నది. జల మాకాశముతో జేరినందున చొల్లు కలిగెను, చొల్లు అవకాశమునుండి కల్గుచున్నది, జలము వాయువుతోఁ జేరినపుడు చెమట కల్గుచున్నది. చెమట వాయు వాంశమగు చర్మమునుండి కల్గుచున్నది, జలమగ్నితోఁ జేరినందున మూత్రము కల్గెను. మూత్రమునందు నగ్నియొక్క వేడిమియు జలమును మిశ్రమై యేర్పడినది, జలము పృథ్వితో జేరినపుడు రక్తము కల్గెను. రక్తము నందుఁ బృథ్వి రూపోపాధియు జలమునందుండు ద్రవమును గలవు.

౩. అగ్నినుండి యాకలి, దప్పిక, నిద్ర, సంగమము, ఆలస్యము నను నవి కల్గెను అగ్నియొక్క నిజాంశమువలన నాకలి కల్గును. దహించు పద్ధతి యగ్ని యందున్నట్లుగనే యాకలి యందును నట్టి శక్తి కలదు. అగ్ని యాకాశముతోఁ జేరినపుడు నిద్ర కల్గుచున్నది. నిద్రయందు నాకాశ శూన్య తయు నగ్నియొక్క తేజో పద్ధతియు గలవు. కావున నీ రెంటిచే నిద్రస్థాయి

తెలియఁబడుచున్నది. అగ్ని వాయువుతోఁ జేరిన దప్పిక గల్గుచున్నది దప్పిక యందు వాయువుయొక్క శోషింపఁజేయు పద్ధతియు, నగ్నియొక్క వేడిమియు, కల్గియున్నది అగ్ని జలములోఁ జేరినందువలన సంగమము కల్గును. సంగమమునందు నగ్నియొక్క వేడిమియు జలముయొక్క ద్రవత్వమును గలవు. అగ్ని పృథ్వితోఁ జేరినపుడాలస్యము కల్గుచున్నది. ఆలస్యమునుండి అగ్ని యొక్క తేజము మందముగాను, పృథ్వియొక్క జడవృత్తియు తెలియబడు చున్నవి.

४. వాయువునుండి పరుగెత్తుట, దాటుట, తిరుగుట, చాచుట, ముడు చుట యనునవి కల్గినవి. వాయువుయొక్క నిజాంశమువలన ధావనము కల్గెను. (ధావన మనగా పరుగెత్తుట) పరుగెత్తుటయందు వాయువుయొక్క నిజాంశ మగు చలనముకలదు. ఇతర భూత మిశ్రమము లేదు. వాయువాకాశముతోఁ జేరినపుడు ప్రసారణము, చాచుట, దాటుట యనునవి కల్గెను. దాటుట యందునాకాశము యొక్క యవకాశము వాయువుయొక్క చలనము గలవు. వాయువగ్నితోఁ జేరినపుడరుగుట గల్గెను. తిరుగుటయందు నగ్నియొక్క రూప నిర్మితియు, వాయువుయొక్క చలనము గలవు ప్రదక్షిణముచేయు నపుడు కుడి భాగమునుండి తిరగవలెను. నేత్రము కుడియెడమలకుఁ ద్రిప్పవల యును. అనునిట్టిరూప నిర్మితయగ్ని లక్షణమైయున్నది. వాయువు జలముతోఁ జేరినపుడు చలనము, చాచుట అనునవి కల్గెను. చాచుటయందు, జలాంశమగు ప్రాణాధారము వాయువుయొక్క చలనమును గలవు వాయువు పృథ్వితోఁ జేరినందున ముడుచుట గల్గెను. ముడుచుటయందుఁ బృథ్వియొక్క ధరించు పద్ధతియు వాయువుయొక్క చలనమును గలవు.

## ఆకాశమునుండి కామ, క్రోధ, లోభ, మోహ, భయములు కలిగిన నిర్ణయము

౧. ఆకాశముయొక్క నిజాంశమువలన శోకము కల్గినది. శోకము నందలి యాకార శూన్యత శరీరేంద్రియములయందుఁ దెలియుచున్నది.

౨. ఆకాశము వాయువుతోఁ జేరినపుడు కామముగల్గుచున్నది. కామమునందు జ్ఞానశూన్యత్వము, చంచలత్వముఅను రెండును దెలియు చున్నవి.

౩. ఆకాశము అగ్నితోఁ జెందినపుడు క్రోధము గల్గును. క్రోధమునందు జ్ఞాన శూన్యతయు, నగ్ని వేడిమియు గలవు

౪. ఆకాశము జలముతోఁజేరినపుడు మోహము గల్గుచున్నది. మోహమునందు జ్ఞాన శూన్యతయు, ఘ్రాణముయొక్క మోహ రూపాజ్ఞాన సంబంధమగు కోరిక గల్గుచున్నది. ఇదియే జలసంబంధమని తెలియవలెను.

౫. ఆకాశము పృధ్వితోఁ జేరినపుడు భయము గల్గుచున్నది. భయమునందు జ్ఞాన శూన్యతయుఁ బృధ్వియొక్క జడత్వమునుఁ దెలియఁబడుచున్నవి.

కామ, క్రోధ, లోభ, మోహ, భయము లాకాశము నుండియుఁ జాచుట, దాటుట, పరుగెత్తుట, వణకుట, ముడుచుట అనునవి వాయువు నుండియు; నాకలి, దప్పిక, నిద్ర, సంగమము, అలస్యము అనునవి యగ్ని నుండియు; మూత్రము, శుక్లము చెమట, రక్తము, జొల్లు నను నవి జలము నుండియు; నరములు, అస్తులు, మాంసము, చర్మము గోళ్ళు, వెంట్రుకలు పృధ్వి నుండియు పుట్టినవి. కావున వీనిని పంచభూత సముదాయమందురు దీని వలననే స్థూల శరీరము గల్గినది.

## ౨. పంచ తన్మాత్రలనుండి యింద్రియములు కల్గిన నిర్ణయము

౧. శబ్ద తన్మాత్రనుండి జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార మనునవి కల్గెను. మనోప్రాణముల చేరికచే శబ్ద మేర్పడును. శబ్ద మెట నుండునో జ్ఞాన మచ్చటనుండును. అందువలన శబ్ద తన్మాత్రనుండియే జ్ఞానము కల్గినదని రూఢిపడు చున్నది.

౨. జ్ఞానము వాయువుయొక్క ధర్మమగు చలనముతో జేరినప్పుడు మనస్సు కల్గుచున్నది. మనస్సునందు, తెలిసికొనుటయు, చాంచల్యమును గలవు. అనగా జ్ఞానమునుండి తెలిసికొనుటయు, వాయువునుండి చలనత్వమును నీ మనస్సు పొందుచున్నది.

౩. జ్ఞానమగ్నియొక్క ధర్మమగు రూపముతోఁ జేరినపుడు బుద్ధియగుచున్నది. బుద్ధియందు జ్ఞానపద్ధతియు రూపనిశ్చయత్వమును దెలియఁబడుచున్నవి.

౪. జ్ఞానము జలముయొక్క ధర్మమగు (చేర్చుటయను) గుణముతో జేరి చిత్తమగుచున్నది. చిత్తమునందుఁ జింతనయొక్క చేరికయు, జ్ఞాన మెఱుంగు పద్ధతియు రెండును తెలియఁబడు చున్నవి.

౫. జ్ఞానము పృథ్వియొక్క ధర్మమగు కఠినత్వముతోఁ జేరినపు డహంకారము కల్గుచున్నది. అహంకారమునందు కఠినత్వమును, నభిమాన రూపమగు జ్ఞానపద్ధతియుఁ దెలియఁబడు చున్నది.

## (2) స్పర్శ తన్మాత్రనుండి సమాన వ్యానోదాన ప్రాణాపానంబులు కలిగిన విధానము

౧. వాయువుయొక్క సూక్ష్మ భాగమగు స్పర్శ తన్మాత్ర వ్యానమని చెప్పఁబడును. వ్యానమందితర భూత సముదాయము లేదు. కేవల వాయువు యొక్క సూక్ష్మాంశ స్పర్శయే గలదు. కావున నయ్యది వ్యాన మనఁబడు చున్నది.

౨. వ్యానమాకాశముయొక్క ధర్మపద్ధతియగు నవకాశముతోఁజేరి సమాన మగు నామముతో నలరారుచున్నది. సమానమునందు స్పర్శ పద్ధతి యగు వచనమును నవకాశ రూప వ్యాపకమును గలవు. వ్యాపకమనగాఁ బరుచుటయనిగాని, ఆవరించుకొనుటయనిగాని అర్థము.

౩. వ్యానమగ్నియొక్క ధర్మమగు తేజముతో జేరుటవలన నుదాన మని చెప్పఁబడు చున్నది. ఉదానమునందు నగ్నియొక్క సూక్ష్మరూపమగు శబ్దము ఉద్దేశ్య రూపమగు స్పర్శయుగలవు. కావున వైఖరి రూపమునఁ బలుకుల నియ్యది పలికించును.

౪. వ్యానము జలముయొక్క ధర్మమగు చేర్చుటయను దానితో జేరినది. కావున ప్రాణమని చెప్పబడును. ప్రాణ మాగామి రూప కర్మల నంతఃకరణ మందుఁజేర్చుచున్నది. సూర్య చంద్రనాడుల ద్వారా చలించు ప్రాణహంసల బాహ్యమునందు లయింపఁజేసి ఆయుస్సును క్షీణింపఁజేయుచున్నది. ఆగామి రూపమగు హంసల నంతఃకరణమునందుఁ జేర్చి పునరావృత్తికిఁగారణమగు చున్నది. కావున ఈ ప్రాణమునందు జలముయొక్క ధర్మమగు జేర్చుటయు, వాయువుయొక్క స్పర్శ రూపమగు చలనమును గలవు.

౫. వ్యానము పృథ్వి ధర్మమగు కఠినాంశముతోఁ జేరుటవలన సమాన మని చెప్పఁబడుచున్నది. అపానమందు గంధము, స్పర్శరూపవ్యానముగలవు.

(3) ౩. రూప తన్మాత్రనుండి శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణములను జ్ఞానేంద్రియములు గల్గినవి

౧. అగ్నియొక్క సూక్ష్మ భాగమగు రూప తన్మాత్ర చక్షురింద్రియ మని చెప్పఁబడుచున్నది. చక్షురింద్రియమునందు నితర భూత సముదాయము లేక కేవల రూప నిర్మాణ పద్ధతియే కలదు. కావున అగ్నియొక్క తన్మాత్ర చక్షు రింద్రియమని చెప్పబడుచున్నది.

౨. చక్షురింద్రియము శబ్ద తన్మాత్రతోఁ జేరుటవలన శ్రోత్రేంద్రియ మని చెప్పఁబడుచున్నది. శ్రోత్రేంద్రియమునందు శబ్దము, శబ్ద గ్రాహకమగు రూపము తెలియఁబడు చున్నది.

౩. చక్షురింద్రియము స్పర్శ తన్మాత్రతో జేరుటవలన త్వగింద్రియ మని చెప్పఁబడుచున్నది. త్వగింద్రియమునందు స్పర్శమునందలి రూప నిర్మితియు, స్పర్శయు రెండు రీతులును దెలియుచున్నవి.

౪.చక్షురింద్రియము రస తన్మాత్రతోఁ జేరుటవలన జిహ్వేంద్రియమని చెప్పఁబడుచున్నది. జిహ్వేంద్రియమునందు రస పద్ధతియు, రసమునందలి రుచి పద్ధతియు దెలియఁబడుచున్నవి.

౫. చక్షురింద్రియము గంధ తన్మాత్రతోఁ జేరుటవలన ఘ్రాణేంద్రియ మని చెప్పఁబడుచున్నది. ఘ్రాణేంద్రియమునందు గంధ పద్ధతియు, గంధము నందలి రూప నిర్మితియు దెలియఁబడుచున్నవి.

(4) ౪. రస తన్మాత్రనుండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయేంద్రియములు గల్గినవి

౧. జలముయొక్క సూక్ష్మ భాగమగు రస తన్మాత్రను నిచ్చా రూప మగు రస నేంద్రియమని చెప్పఁబడుచున్నది. రస నేంద్రియమునందుఁ; తీపి, చేదు, కారము, వగరు, పులుపు, చప్పన యను షడ్రుచులు తెలియఁబడు చున్నవి. అందువలన నీ యిచ్చా రూప రస నేంద్రియ మీవిధముగ సిద్ధాంత మైనది.

౨. ఇచ్ఛా రూపమగు రస తన్మాత్ర శబ్ద తన్మాత్రతోఁ జేరుటవలన విషయ రూపమగు శబ్దేంద్రియముగ నగుచున్నది.

శ్రోత్రేంద్రియముచే విను శబ్దము విషయాదులచేఁ గూడుకొని యుండును. కావున రస తన్మాత్రయందు నిచ్ఛా శబ్దములు రెండును గలవు. కావున దానిని విషయ రూప శబ్దేంద్రియమని చెప్పబడు చున్నది.

౩. ఇచ్ఛా రూప రస తన్మాత్ర స్పర్శ తన్మాత్రతోఁ జేరినపుడు విషయ రూప స్పర్శేంద్రియము కల్గుచున్నది.

త్వగింద్రియముచేఁ దెలియు భార్యా పుత్ర ధన ధాన్య గృహ రామా క్షేత్రాదుల స్పర్శలయందు, నిచ్ఛా రూప రసనేంద్రియము స్పర్శ తన్మాత్రయు రెండును కలిసి తెలియఁబడుచున్నది. కావున దీనిని విషయరూప స్పర్శ తన్మాత్రయని చెప్పఁబడినది.

౪. ఇచ్ఛా రూప రసనేంద్రియము రూప తన్మాత్రతోఁ జేరినపుడు దానిని విషయ స్వరూపరూపేంద్రియమని చెప్పఁబడును.

చక్షువుఁతో దెలియు స్వరూపమునందు నిచ్ఛారూప రసనేంద్రియము, రూప తన్మాత్ర స్వరూపమను నీ రెండును తెలియఁబడుచున్నవి. కావున దీనిని విషయ స్వరూప రసనేంద్రియమని చెప్పఁదగియున్నది.

౫. ఇచ్ఛారూప రసనేంద్రియము గంధ తన్మాత్రతోఁ జేరినపుడు విషయ స్వరూప గంధేంద్రియమని చెప్పబడును.

ఘ్రాణేంద్రియమునుండి దెలియు గంధమునందు నిచ్ఛారూప రసేంద్రియము, గంధ తన్మాత్రయునున్నవి. కావున దీనిని విషయ స్వరూప రసనేంద్రియముగఁ జెప్పదగియున్నది.

## (5) ౫. గంధ తన్మాత్రనుండి వాక్పాణి పాదగహ్యగుదములను కర్మేంద్రియములు కల్గిన వివరము

౧. పృథ్వియొక్క సూక్ష్మ భాగమగు గంధ తన్మాత్రను గుద్దేంద్రియమని చెప్పఁదగును.

సృష్టికి గారణముగా గంధ తన్మాత్రయున్నది. సృష్టికి గార్యమగు కర్మేంద్రియ రూపముననున్న గుదేంద్రియ మియ్యదియవి పెద్దలు నుడివిరి. అందువలన గంధ తన్మాత్ర గుదేంద్రియముగా నున్నది.

౨. గుదేంద్రియము శబ్ద తన్మాత్రతో జేరినపుడు వాగింద్రియమని చెప్పబడును.

విషయ రూప వాసనయు శబ్ద తన్మాత్రయు వచన రూపమైన వాక్కునందుఁ దెలియఁబడుచున్నవి. కనుక గుదేంద్రియము శబ్ద తన్మాత్రయుఁ జేరి వాగింద్రియమని వ్యవహరింఁబడినది.

౩. గుదేంద్రియము స్పర్శ తన్మాత్రతోఁ జేరినపుడు పాణింద్రియమని చెప్పఁబడుచున్నది.

పాణింద్రియమునందు విషయ రూప క్రియయు స్పర్శ తన్మాత్రయు రెండును తెలియఁబడుచున్నది. కావున గుదేంద్రియ స్పర్శ తన్మాత్రలుచేరి పాణీంద్రియముగాఁ జెప్పఁబడు చున్నవి.

౪. గుదేంద్రియము రూప తన్మాత్రతోఁ జేరినపుడు పాదేంద్రియమని చెప్పఁబడును. పాదేంద్రియమునందు రూప నిర్మిత పద్ధతియు గమన విషయమును రెండును గలవు. కావున గుదేంద్రియము, రూప తన్మాత్రయుఁజేరి పాదేంద్రియమని చెప్పఁబడును.

౫. గుదేంద్రియము రస తన్మాత్రతో జేరినపుడు గుహ్యేంద్రియమని చెప్పఁబడును.

గుహ్యేంద్రియమునందు రస రూప విషయ గ్రాహ్యమును, గుదేంద్రియ విషయమును రెండును దెలియఁబడుచున్నవి. అందువలన రస తన్మాత్రతో జేరి గుహ్యేంద్రియమని యిది వ్యవహరింపఁబడు చున్నది.

జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఇవి శబ్ద తన్మాత్ర నుండి గల్గినవి.

సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము, అపానము ఇవి స్పర్శ తన్మాత్రనుండి కల్గినవి.

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము ఇవి రూప తన్మాత్ర నుండి కలిగినవి.

శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ఇవి రస తన్మాత్ర నుండి కలిగినవి.

వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదము ఇవి గంధ తన్మాత్ర నుండి గల్గినవి.

కావున పంచ తన్మాత్రలనుండి యింద్రియములు కల్గినవి. అందువలనఁ బంచ తన్మాత్ర సముదాయమే యింద్రియములని తెలియవలయును.

## ౩. పంచ శక్తులనుండి జీవ నిర్ణయము

౧. ప్రాణమనంబు లేక రూపత్వమొంది స్వప్రకాశ బ్రహ్మముయొక్క యధో రూప పరిణామశక్తిగా నుండును. ఇట్టి శక్తి క్రియోన్ముఖమునందుఁ గ్రియాశక్తిగను, జింతనా పద్ధతియందు నిచ్ఛాశక్తిగను, విజ్ఞాన పద్ధతియందు జ్ఞానశక్తిగను, నిశ్చయాత్మకమందు నాదిశక్తిగను. మోక్ష పద్ధతియందు బరాశక్తిగనుఁ జెప్పఁబడుచున్నది.

౨. వ్యష్టి ప్రాణ మనంబులకేకైక రూపమగు ప్రత్యగాత్మ జాగ్రదావస్థ యందు విశ్వుఁడనియు, స్వప్నావస్థయందుఁ దైజసుఁడనియు, సుషుప్త్యవస్థ యందుఁ బ్రాజ్ఞుఁడనియు, దురీయావస్థయందు బ్రత్యగాత్మ యనియుఁ జెప్పఁబడు చున్నది. కేవలము మఱపుగానున్న మరణావస్థయందు నీయాత్మ జీవుఁడుగాను జెప్పబడును. జీవుఁడజ్ఞానియై మఱపుఁ జెందుచుండును గావున నతనికి మోక్షమవసరమై యున్నది. మఱపుతోఁగూడిన జీవుఁడు క్రియాశక్తి రూపమున గ్రియోన్ముఖియగును. ఇచ్ఛాశక్తి రూపమున నితఁడు చింతనా పద్ధతి యుండును. జ్ఞానశక్తి రూపమున విజ్ఞాన పద్ధతి నెఱుఁగును. ఆదిశక్తి రూపమున నితఁడు "బుద్ధిఃకర్మానుసారిణి" అను న్యాయమును గర్మయొక్క నిర్ణయ పద్ధతిని జెందుచున్నాఁడు. మఱియుఁ బరాశక్తి రూపమున నితఁడు మోక్షమందు చున్నాఁడు. కావున నిట్లు పంచశక్తులనుండి జీవోపాధి గల్గినదని నిశ్చయింపఁబడినది.

## ౪. పంచ బీజములవలన ప్రాణమేర్పడిన నిర్ణయము

ప్రాణమనంబుల చేరికచేఁ బరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అను నాల్గు వాక్కులు కల్గుచున్నవి. ఈ వాక్కుల నిర్మితియందు లకార బీజము చేత స్తంభన క్రియయు, వకార బీజముచేత మోహన క్రియయు, రకార బీజముచేత మారణ క్రియయు, యకార బీజముచేత నుచ్చాటన క్రియయు, అకార బీజముచేత నాకర్షణ క్రియయు గల్గుచున్నది. కావున వీనివలన కల్గు కర్మానుభవమునకు ప్రాణోపాధి యేర్పడు చున్నది. అందుచే బీజము వలనఁ బ్రాణము, ప్రాణమనంబుల వలన వాక్కులకు మూలమగు బీజములను గల్గుచున్నవి.

## ౫. పంచాధి దేవతలవలన ప్రత్యగాత్మ పుట్టిన విధానము

౧. వ్యష్టి ప్రాణమనంబుల కైకైక రూపమగు ప్రత్యగాత్మ తన్మాత్ర విషయ పంచక భ్రాంతిచే మఱుపు రూపమైన మరణావస్థను జెందుచున్నది. కర్మానుభవమునకు నధిష్ఠానాధి దేవతలచేఁ బునర్జన్మ కలిగింపఁబడు చున్నది. కావున పంచాధి దేవతలచేఁ బ్రత్యగాత్మోపాధి కలిగెనని తెలియ నగును.

## ౬. ఎరుకస్థాన నిర్ణయము

౧. స్థూల శరీరము, ౨. యింద్రియములు, ౩. జీవుడు, ౪. ప్రాణము, ౫. ఆత్మ. ఈ యైదుచేరి జరుపునట్టి వ్యవహారమునకు జాగ్రతావస్థయని పేరు. దీని స్థానము భ్రూమధ్యము.

౨. స్థూల శరీరము శయ్యపైన పరుండి యింద్రియంబులు, జీవుఁడు, ప్రాణము ప్రత్యగాత్మ అను నీ నాల్గిటి సముదాయముచే జరుగు నాంతరంగిక వ్యవహారమును స్వప్నావస్థయని చెప్పఁబడుచున్నది. దీని వ్యవహారము కంఠమునుండి జరుగుచున్నది. కావున దీనికి కంఠము స్థానము. మఱియు కంఠమునందలి హితయను నాడియందిది వర్తించు చున్నది.

౩. ఇంద్రియములు, జీవుఁడు సూక్ష్మ శరీరము నందుండగాఁ బ్రాణాత్మల చేరిక గల్గుచున్నది. అట్టి స్థితికి సుషుప్త్యవస్థయని పేరు. దీని స్థానము హృదయము. పురీతమను నాడియందిది వర్తించుచున్నది.

४ ప్రాణము ప్రత్యగాత్మయందు నైక్య మందునపుడుకలుగు స్థితికిఁ దురీయమని పేరు. దీని స్థానము సహస్రారము.

స్థూల శరీరము, యింద్రియములు, జీవుఁడు, ప్రాణము, ఆత్మ అనునవి వేర్వేఱుగా నుండుటచే వీనికి దెలిసికొనఁదగిన తెలివిలేదు. ప్రాణము నంబు లొండొంటిని విడువక నుండునట్టివి. కావున వీని యేకైక రూపమగు లింగ శరీరమందు సర్వము విదిత మొనర్చుకొనునట్టి తెలివి గల్గుచున్నది. అందువలన నెఱుక స్థాన నిర్ణయము లింగ శరీరమున వీని యెఱుగవలయును.

## స్థూలశరీర ధర్మములు

బాల్య, యౌవన, కౌమార, వృద్ధాప్యములుగా స్థూల శరీరము పరిణామమును బొందెను. ఇదియే దీని ధర్మము.

## ఇంద్రియముల ధర్మములు

జాగ్రత్స్వప్న, సుషుప్తి, తురీయములను చతుర్విధావస్థ లింద్రియ ధర్మములని తెలియవలయును.

## జీవ ధర్మము

ఆత్మ స్వరూపమునకు విభిన్నమై భౌతిక విషయ వాసనలచే ధన ధాన్యభస్తు వాహనాదులచే రక్షింపఁబడుచున్నానని బాహ్యవృత్తియగు జాగ్రదావస్థయందు నుండగోరి ప్రాణ రూపంబులగు కామనాదులను, మనో రూపంబులగు నింద్రియ భోగంబులను, జ్ఞాన రూపమగు పరబ్రహ్మవాంఛయు జీవుఁడు పొందుచున్నాడు. ఇదియే జీవ ధర్మము.

## ప్రాణ ధర్మములు

సూర్య చంద్ర నాడులద్వారా ప్రాణ హంసలు బాహ్యమునందు నశించి జీవోపాధియడఁగి పోవుచున్నది. అయినను రాత్రిఁబవళ్ళను నిర్ణయము లేక ప్రాణ ధర్మము తన స్వరూపమగు కామవాంఛల నంతఃకరణమునందుఁ జేర్చి పునరావృత్తికిఁ గారణమగుచున్నది మఱియు ప్రాణముయొక్క తటస్థ లక్షణము మఱుపనియుఁ జెప్పఁబడును. ప్రాణముయొక్క విక్షేప లక్షణము పుట్టుటయు, దెలిసికొనుటయు నగును.

## ఆత్మ ధర్మము

స్థూల ధర్మమిట్టిది, యింద్రియ ధర్మమిట్టిది, జీవ ధర్మమిట్టిది, ప్రాణ ధర్మమిట్టిది, అని తెలియఁ జేయుటయే ఆత్మ ధర్మమనఁబడును.

## స్థూల శరీరసిద్ధి

ఇది స్వస్తికాసన సమేత చిన్ముద్రచే గల్గుచున్నది. కౌమార, వృద్ధాప్యములయందు నెల జవ్వనమిది కల్గించుచున్నది. కావున దీని ఫలమిట్లు దెలియవలయును.

## ఇంద్రియ సిద్ధి

తారక యోగమువలన నింద్రియ సిద్ధి గల్గును ఈ తారక యోగము బ్రహ్మసాక్షాత్కారమునకు గారణమైన మొదటికర్మగా నున్నది. ఇట్లనుటకుఁ గారణమేమన "తారకంబు మనస్సిద్ధి కారకంబు" అనున్యాయమున మనోసిద్ధిగలవారికి బ్రహ్మసాక్షాత్కారము కాగలదు. ఇది యితరులకుఁ గాఁజాల దవి వేఱుగాఁ జెప్పవలసిన యవసర మప్పుడుండదుగదా? మనస్సిద్ధి కారకమైన తారక యోగమును సదికారి ముందుఁ దెలియవలయును.

నాడుల యొక్కయుఁ జక్రములయొక్కయు, విధాయకము దెలియని యెడల నీ తారకయోగ పద్ధతి దెలియఁబడదు. నాశికారంధ్రమునుండి షెడలు ప్రాణవాయు విడాపింగళాదిక్యలతో వ్యవహరింపఁ బడుచున్నది. ఈ రెంటి యొక్క చేరికచేఁ గలుగు సుదాన వాయువు బాహ్య సుషుమ్నయని చెప్పఁ బడును. బాహ్య సుషుమ్నను నధో భాగమునకు నణగద్రొక్కిన యెడల సమాన వాయువుతోఁ జేరి యది యధోకుండలిని మేల్కొల్పును. పిమ్మట బ్రహ్మదండి మధ్యభాగమునసున్న యంతస్సుషుమ్న నాళమునందుఁ బ్రవేశించును. తరువాత సూర్య చంద్ర సమైక్య రూపమగు స్వయంప్రకాశత్వము పొందును.

స్వయం ప్రకాశమగు సుషుమ్న నాడియందు నావరణ రూపములగు నాఱు పద్మములు గలవు. సుషుమ్న నాళమార్గాంతము సహస్రారము, మఱియు నష్టదళ పద్మమువఱకు ననగా బ్రహ్మరూప స్వయం ప్రకాశము వఱకు దీని మార్గాంతము. మఱియు బ్రహ్మమునందు నైక్యమగుటయే

యీ మార్గముయొక్క యంత్యమని తెలియవలయును ఇట్టి నాడియందు నవయవములతోఁ గూడిన చక్ర నిర్ణయమిట్లు తెలియనగును.

౧. ఆధార చక్రము, పృధ్వీభూత సంబంధము. ఘ్రాణేంద్రియము పృధ్వీభూత సంబంధమైనది దీని ద్వార నాఘ్రాణించు గంధత్వము, సువాసన, దుర్వాసన, సువాసన మిశ్రమము, దుర్వాసన మిశ్రమము, అనగా సువాసనయందు సువాసనయు, దుర్వాసనయందు దుర్వాసనయు మిశ్ర రూపముగనుండును. లేక సువాసనయందు దుర్వాసనయు, దుర్వాసనయందు సువాసనయు మిశితమైనపుడు వీని భేదములిట్లు తెలియనగును. ఇట్లు గంధ గుణ రూపములగు నీ నాల్గు రీతులు పృధ్వీ దళమగు నాధార చక్రమునకు నాల్గు దళములుగా నున్నవి మఱియు వ, శ, ష, స, అను నాలుగక్షరములు దీని యుపాధికి స్థానములుగా నుండును. కావున దళములయొక్కయు, బీజములయొక్కయు నిర్ణయమిట్లు తెలియఁదగి యున్నది.

౨. స్వాధిష్ఠాన చక్రము, జలభూత సంబంధము. మఱియు జిహ్వేంద్రియము జలభూత సంబంధమని చెప్పఁబడును. తీపి, కారము, చేదు, ఉప్పు, పులుసు, చప్పన అను నారు విధములుగ రసము గ్రాహ్యమగుచున్నది. ఈ రసము జిహ్వేంద్రియము ద్వారా తెలియఁబడుచున్నది. కావున జలభూత దళమగు స్వాధిష్ఠానమునకు నారు దళంబులని తెలియవలయును. మఱియు బ, భ, మ, య, ర, ల అను బీజంబులీ జలభూతోపాధికి స్థానములుగా నున్నవని తెలియవలయును.

౩. మణిపూరకచక్ర, మగ్నిభూత సంబంధము. ఇది చక్షురింద్రియమని చెప్పఁబడును. అగ్నిభూత సంబంధమగు నీ చక్షురింద్రియముచేఁ దెలియఁబడు రూపములు; [1]తెలుపు,[2] నలుపు,[3] పసుపు,[4] ఎరుపు,[5] ఆకుపచ్చ,[6] మిశ్రమము,[7] పొట్టి,[8] పొడుగు,[9] లావు,[10] సన్నము అనునిట్టివిగా నున్నవి. మఱియుఁ జచ్చుట,[2] పుట్టుట,[3] వృద్ధి పొందుట,[4] క్షీణించుట, క్షేమము జెందుట, కీడు బొందుట,[7] బాల్యము,[8] యౌవనము,[1] కౌమారము,[1] వృద్ధాప్యము అను నీ పది విధములను రూపములుగాఁ దెలియనగునని మతాంతర సిద్ధాంతము. కావున నగ్నిభూత దళమగు మణిపూరక చక్రమునకుఁ బది దళములవి.

నిర్ణయమగు చున్నది. డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, అను బీజ ములు దీని యుపాధి స్థానములుగ నున్నవని తెలిసి కొనవలయును.

౪. అనాహత చక్రము, వాయుభూత, సంబంధము. త్వగింద్రియము వాయుభూత సంబంధమని చెప్పఁబడును. ఈ త్వగింద్రియముచేఁ దెలియఁబడు స్పర్శములు; తల్లి, తండ్రి, భార్య, తనయులు, మిత్రులు, ధనము, సోదరులు, శరీరము, వాతము, పైత్యము, శ్లేష్మము, మరణములను పండ్రెండువిధములుగా నున్నవి. వాతమనఁగా నుష్ణమనియు, పైత్యమనఁగా ననుష్ణ శీతల మనియు, శ్లేష్మ మనఁగా గేవల శీతలమనియు, నెఱుఁగనగును. కావున ననాహత చక్రమునకు పండ్రెండు దళములని నిర్ణయమైనది. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, అను బీజములు దీని యుపాధి స్థానములుగా నున్న వని తెలిసికొన వలయును.

౫. విశుద్ధచక్ర మాకాశభూత సంబంధము. ఇది శ్రోత్రేంద్రియము. ఇది యాకాశ భూత సంబంధముతోఁ గూడుకొని యున్నది. శ్రోత్రేంద్రియ ముచేఁ దెలియఁబడు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఒ, ఔ, అం, అః. అను షోడశ స్వరములు, షోడశ విధావస్థలకునివి స్థానములుగా నున్నవి. అందువలన దీనియుపాధికి స్థానములుగా నున్నవని తెలుసుకొన వలయును.

౬. ఆజ్ఞాచక్ర మంతఃకరణ సంబంధము. ఈ యంతఃకరణ సంబంధ మైనది మనస్సు. మనస్సుచేఁ దెలియఁబడు సంకల్ప వికల్పము లీచక్ర మునకు రెండు దళములుగా నున్నవి. "హం, క్షం," అను రెండక్షరములు నుపాధి స్థానములుగా నున్నవని తెలియవలెను.

మనో పరిణామమగు జ్ఞానేంద్రియములచేఁ దెలియఁబడు తన్మాత్ర విషయ పంచక విషయంబులు చక్రములయొక్క దళములుగానువిషయాదులను దెలియఁజేయు బీజంబులు నుపాధికి స్థానములుగాను, షడ్భూతాకారంబులు వాని నివాస శక్తులు వానియధి దేవతలుగాను, నిర్ణయించబడినది. ప్రాణ ధర్మ

ములు కామ సంబంధములు గనుక సూర్య చంద్రనాడులయొక్క యేకైక రూపమగు సుషుమ్న నాళమందుఁ జక్ర రూపమున నుండును. చక్రమనగాఁ దిరుగలి.

చక్రములయందు నిర్ణయించిన దళ బీజములు ప్రాణ ధర్మములగు నాకలి దప్పిక యనునవి, కామ సంబంధములు. ఆకాశ శక్త్యాధి దేవతా నిర్ణయంబులును భూత సముదాయ విశ్వ నిర్ణయ పద్ధతియును దెలియకయే వానియందు బర బ్రహ్మను నిర్ణయమొనర్చు మనస్సు, మలినత్వము పొందుచున్నది. అవి విషయ వాసనా విశ్వ మయములని దెలిసిన యెడల మనస్సు సంకల్ప రహితమగు శుద్ధత్వము నొందుచున్నది. కావున తారక యోగము వలన నింద్రియ సిద్ధి గల్గునని నిర్ణయ మగుచున్నది. ఈ పద్ధతి బ్రహ్మత్వము నొందు వానికి బ్రథమ సోపానము వంటిదని దెలియనగును. చక్రముల నిర్మితము విషయ వాసనా మయమని దెలిసిన, మనస్సు సుషుమ్న నాళమునందు నైక్యము పొందును. అందువలన నవస్థాత్రయ సాక్షియగు తుర్యాత్ముఁడని యతనిని జెప్పబడును. ఇట్టి యవస్థయందు సంకల్ప రూపమైన మనస్సు జ్ఞానేంద్రియములతో సమ్మిళితమై ప్రాణవాయువులోఁ జేరి స్వప్రకాశమై బ్రహ్మత్వము నొందుచున్నది. కనుక నీ ప్రదిపాదకము దెలిసిన మనస్సు బ్రహ్మ ప్రతిపాదకమనియు శుద్ధ మనస్సనియుఁ, జెప్పఁబడుచున్నది. ఈ పద్ధతి బాహ్యాంతర తారకములకు నంతరాంతర తారకమని చెప్పఁబడుచున్నది.

౧. బాహ్యాంతర తారకమనగా, సూర్య చంద్రనాడుల బాహ్య సంచారము గమనించి శూన్య స్వరమునందు మనోలయ మొనర్చుట. శూన్య స్వరమనగాఁ జంద్రనాడి నుండి సూర్యనాడి, సూర్య నాడినుండి చంద్రనాడియు, మాఱునపుడు రెండు నాడులు సమానముగ నొక్కలిప్తకాలము నడుచును. అట్టి నడకయందు సూర్య చంద్ర నిర్ణయములేక కేవల మాత్మ నిర్ణయముండును. అట్టిది యాత్మ స్థానమని తెలిసి యాస్థానమునందు మనస్సు లయముచేయుట బాహ్య తారకమని పెద్దలు చెప్పిరి.

౨. అంతర తారకమనఁగా, నాధార స్వాధిష్ఠాన మణిపూరక, అనాహత విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారముల యందు సంచరించు హంసయొక్క నియమము

కనిపెట్టి చక్ర భేదనమొనర్చి హంసను సహస్రారమందుఁ జేర్చి వ్రయ మొనర్చక యాయుస్సును బెంపుఁ జేయుట, యంతర తారకమని చెప్పఁబడును.

## చక్రములకు నామ నిర్ణయము

౧. జీవునకు జగద్వ్యాపార ప్రవృత్తి కలిగినపుడు నిలువ నాధారమై యున్నది మూలాధారామని చెప్పబడును.

౨. ప్రభావము చూచుటకుఁదనచే నధిష్ఠింపఁబడుటవలన స్వాధిష్ఠానమనఁబడును.

౩. జీవుఁడు పరమాత్మ నారాధించునపుడు నవరత్న ఖచిత కిరీట కేయూరమంజీర కింకిణ్యాదులు ధ్వనించు చున్నవి. అట్టి ధ్వనికి స్థానభూతమై యున్నది గావున దీనికి మణిపూరక చక్రమని పేరు గలిగినది.

౪. జీవుఁడు సాధన కాలమునఁ దపో భంగము గల్గించునట్టి భూతప్రేత పిశాచాదులను నుచ్చాటనకు సాధ్యములగు పదిరకంబులనగా దశవిధ నాదంబులొనర్చు స్థానమనాహత మనఁబడును.

౫. జీవుఁడు భయోత్పాదమైన భ్రాంతులను వదలి యాత్మ స్వరూపమైన శుద్ధత్వము బొందును. మఱియు శుద్ధత్వము బొందుదునను నిర్ణయము తనకుఁ గల్గుచున్నది కావున విశుద్ధ మనబడును.

౬. జీవుఁడు తనయాజ్ఞనుఁ చెల్లించుకొను స్థానమునకు నాజ్ఞాచక్రమని పేరు.

౭. జీవన్ముక్తి బొందు ప్రతి మానవుడానందించునది గావున సహస్రారమని చెప్పఁబడుచున్నది.

## జీవ శుద్ధి

సాంఖ్య యోగమున నిదికల్గుచున్నది. అంతరేంద్రియము లైదు. ప్రాణేంద్రియము లైదు. జ్ఞానేంద్రియము లైదు. విషయేంద్రియము లైదు. కర్మేంద్రియము లైదు. ఈ మొత్త మిరువదియైదు ఇంద్రియముల సముదాయ వ్యవహారమునకు జాగ్రదావస్థయని పేరు. దీని స్థానము భ్రూమధ్యము.

## జాగ్రతయొక్క వ్యవహారము

౧. జ్ఞాత కూటస్థుఁడగు నధి దేవత ప్రేరేపణచే సమాన వాయువుతోఁ జేరి శ్రోత్రము ద్వారా శబ్దము నెఱిఁగి వాక్కుచే వచించుచుండును. ఇది యాకాశ తత్వ స్థలకము.

౨. జ్ఞాత చంద్రాదిదేవత ప్రేరేపణచే మనో రూపుఁడై వ్యాన వాయువుతోఁగూడి త్వగింద్రియము ద్వారా స్పర్శను గ్రహించి ప్రాణేంద్రియముచే నిచ్చి పుచ్చుకొనును. ఇది వాయు తత్వ స్థబకము.

౩. జ్ఞాత బృహస్పత్యధి దేవతచేఁ బ్రేరేపింపఁబడి బుద్ధి రూపుఁడై యుదాన వాయువుతోఁగూడి చక్షురింద్రియము ద్వారా రూపము గ్రహించి పాదేంద్రియముచే గమనము చేయుచుండును. ఇది అగ్ని తత్వస్థబకము.

౪. జ్ఞాత క్షేత్రజ్ఞాధి దేవత ప్రేరేపణచేఁ జిత్తరూపుఁడై ప్రాణవాయువుతోఁగూడి, జిహ్వేంద్రియముద్వారా రసము గ్రహించి గుహ్యేంద్రియముచే నానందించు చున్నాఁడు. జలస్థబకము

౫. జ్ఞాత రుద్రాదిదేవత ప్రేరేపణచే నహంకార స్వరూపుఁడై యపాన వాయువుతోఁగూడి ఘ్రాణేంద్రియము ద్వారాగంధము గ్రహించి పాయ్వేంద్రియముచేత మలమూత్ర శుక్ల శోణితములను విసర్జించును. ఇది పృథ్వీ తత్వ స్థబకము.

ఈ మొత్తముకలసి జాగ్రతావస్థయని చెప్పఁబడును. ఈ యవస్థాభిమానియగు ప్రత్యగాత్మ విశ్వుఁడని వ్యవహరింపఁబడుచున్నాడు. అతనికి చిదాభాసుఁడనియుఁ బేరు గలదు. ఈ యవస్థ కర్మ నిర్మితమై స్థూల పద్ధతితోఁ బిండాండ లక్షణమగుచున్నది.

## స్వప్నావస్థ లింగ శరీర నిర్ణయము

ప్రాణేంద్రియము లైదు. జ్ఞానేంద్రియము లైదు. కర్మేంద్రియము లైదు. మనో బుద్ధులు రెండు. మొత్తము పదిహేడు తత్వములుచేరి లింగ శరీరమగును. దీనిని సూక్ష్మ శరీరమనియుఁ జెప్పుదురు. ఈ లింగ శరీరము కేవల ప్రాణమనంబుల సమ్మేళనముచే సూక్ష్మ రూపముగ నేర్పడుచున్నది. గావున దీనిని సూక్ష్మ శరీరమని వ్యవహరింతురు. బ్రహ్మాండ నిర్ణయ మనియుఁ దీనిని జెప్పబడును.

సూక్ష్మమగు లింగ శరీరమునందుఁ బ్రాణ ధర్మములగు కామపద్ధతులు మనో ధర్మంబులగు సంకల్ప వికల్పంబులు యదేచ్ఛగా జీవుఁడు నెరవేర్చుకొన గల్గుచున్నాడు. కావున నీ యవస్థాభిమానియగు జీవుఁడు ప్రత్యగాత్మ

యని పిలువఁబడుచున్నాఁడు. తైజసుఁడని, స్వప్న కల్పితుఁడని, ప్రాతి భాసికుఁడని యితనికిఁ బర్యాయ నామములు గలవు.

జాగ్రదావస్థ కర్మానుభవము పొందునట్లు స్వప్నావస్థకూడ కర్మానుభవము పొందుచున్నది. జాగ్రతావస్థయందు ధనధాన్యవస్తు వాహన దానంబులును, గూపతటాక ధర్మశాల దేవాలయ నిర్మాణంబులును, నాసన ముద్ర లక్ష్యాభ్యాసంబులును, బూజాజపతపంబులను వీనిచేఁగల్గు పుణ్య ఫలంబులును సూక్ష్మ శరీరమునందు బ్రవేశింపఁబడు చున్నవి. సూక్ష్మ శరీర నిర్మితేంద్రియములే స్థూల శరీర మొనర్చు సకల కార్యంబుల నిర్వహించు చున్నవి. కావున సూక్ష్మ స్థూల శరీరములు స్వరూపములందు బేధములుగా నున్నను స్వభావ రూప కర్మానుభవమునందు నేకమేయని తెలియవలయును. దీని స్థానము కంఠము.

మన + బుద్ధి సుషుప్త్యావస్థ కారణ శరీర నిర్ణయము

మనో బుద్ధులయొక్క యేకైక రూపమగు నజ్ఞానము కారణ శరీరమని చెప్పఁబడును. ప్రత్యగాత్మ, అధోరూప పరిణామము వలన నజ్ఞానత్వము నొందుచున్నాఁడు. అప్పుడు ఈ యజ్ఞానత్వము పొందిన ప్రత్యగాత్మ ప్రాజ్ఞుఁడని, పారమార్థికుఁడని చెప్పఁబడు చున్నాడు. ఈ యవస్థయందు నానందానుభవమగుస్థాయి యున్నది. కావున జాగ్రత్స్వప్నంబులే సుషుప్త్యావస్థ కర్మానుభవములని తెలియవలయును. దీని స్థానము హృదయము.

## తుర్యావస్థ కారణ శరీర నిర్ణయము

జీవుఁడ జ్ఞానావరణ రూపమగు నధోముఖ వ్యాపకేంద్రియ పరిణామము నందక యూర్ధ్వ పరిణామమందు మూర్ధస్థానమున పై భాగమున విలిచి యున్నను దుర్యావస్థ రూప ప్రత్యగాత్మయనియే చెప్పఁబడును.

ఈ అవస్థయందు కర్మానుభవము తెలిసికొను విధానము గలదు. కావున నవస్థాత్రయముల కన్నిటికి నిదికారణమని చెప్పబడు చున్నది. మరణావస్థయందుఁ బ్రత్యగాత్మను జీవుఁడని చెప్పఁబడును. కారణమునందున్న గుణపద్ధతి కార్యమునందు గలదు. కావున గర్మకుఁగారణము ప్రత్యగాత్మయని తెలియవలయును.

## కారణమునందున్న గుణపద్ధతి కార్యమునందు సుండుననుటకు దృష్టాంతము

కందార్థము: "మఱుపు, సుషుప్తియు, మూర్ఛయు,
మరణంబు, సమాధియనుచు మానవు లెఱుకఁ
దొరగిన నెవఁడు శరీరం
బెఱుఁగునో యా నరుఁడు మేను నెఱుఁగాదో యన్నా!
తననైన తా నెఱుఁగదో యన్నా!
యెఱుఁగ కుండిననేమి తిరిగి పుట్టుచునుండు
తిరిగి పుట్టడు వాడీ గురుబోధ నెఱిఁగిన."

అనగా మఱుపునుండి జ్ఞప్తియు, సుషుప్తినుండి మెలఁకువయు, మూర్ఛనుండి స్పృహయు, మరణమునుండి పుట్టుకయు, సమాధినుండి తెలివియు, గల్గించుట ప్రత్యగాత్మయొక్క విధియై యున్నది. అవస్థా నిర్మితములును, గాల నిర్మితములును రాత్రింబవలులును నేర్పడు పద్ధతులుగ నీ ప్రత్యగాత్మ విధియని తెలియఁదగును. ఆత్మ రూపమగు స్వప్రకాశము రాత్రింబవలులును నైన పద్ధతిఁగా నుండునుగాని ఆయనంబున కేనిర్ణయము లేదు. కావున మఱుపు పద్ధతియందు నెఱుక గల్గించును. అందుచే "సాంఖ్య మాత్మ స్వరూప విచారకంబు" అని నిర్ణయింప బడినది.

## మఱుపునుండి జాగ్రత్తనుబొందు విధానము

భూత సముదాయమువలన స్థూలసృష్టియుఁ; దన్మాత్ర సముదాయము వలన నింద్రియ సృష్టియు, నాకాశ కర్మ పద్ధతియగు నవకాశములోఁజేరి యుండుటచే నధిదైవిక, అధిభౌతిక; అధ్యాత్మక వ్యవహారంబులైన వచన, దాన, గమన, విసర్జనా నందములు కల్గుచున్నవి. ఆకాశధర్మ పద్ధతి యగు బయలుయొక్క యంశములోఁ జేరినపుడు సుషుప్త్యావస్థఁ బొందుచున్నది.

సాంఖ్య యోగ పద్ధతివలన ప్రత్యగాత్మ రూపమైన పరమాత్మను నేనను నిర్ణయము మీఁద నధ్యాత్మ రూపములగు నింద్రియంబులు తన్మాత్రలలోఁజేరిపోవుచున్నవి.

అధి భౌతిక రూపములగు విషయాదులు స్థూల శరీర రూపమగుభూత సముదాయములోఁ జేరిపోవుచున్నవి. అధి దైవికములు తమ నిజాంశ రూపములగు దైవముల నొందుచున్నవి. అందువలన జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయ మరణంబులయొక్క యభిమానులగు విశ్వతైజస ప్రాజ్ఞప్రత్యగాత్మ జీవాత్మలయొక్క వ్యవహారంబులకు నాత్మయేకారణమని తెలిసి, కారణమగు నా యాత్మయే తానని నిర్ణయమగు నప్పుడు, మఱువు రూపము నొందిన జీవునకు శుద్ధిగలిగి ఆత్మత్వము కల్గుచున్నది. ఈ పద్ధతియందు నుండుటయే సాంఖ్య యోగమని చెప్పఁబడును, మఱియు నాత్మ విచారమనియు జెప్పఁబడును.

## ప్రాణశుద్ధి

ఇది యమనస్క యోగమువలన గల్గును. మనస్సు గాఢ నిద్రలో నున్నప్పుడు మనకుఁ బ్రపంచ వ్యవహారము తెలియకుండును. మనస్సు మేల్కాంచి నపుడు సకల వ్యవహారములు తెలియుచుండును.

సర్వవాసనా మయమునకును, బంధ మోక్షములకును, వీవి రెంటికి మనస్సే కారణమగు చున్నది. కావున మనస్సునకు వీటికిని భేదములేదు. ఇట్టి మనస్సులేక పోవుటయే అమనస్క మనఁబడును. ప్రాణమెంత వఱకుండునో మనస్సంత వఱకుండును. ప్రాణము పోయినయెడల మనస్సు నిలువదు. అందువలన ప్రాణమే మనస్సనియు, మనస్సే ప్రాణమనియు, నిర్ణయమగు చున్నది. ప్రాణమనంబుల యేకైక రూపమే ప్రపంచమని చెప్పఁడును. అది యెట్లనగా:

శ్లో॥ "పూర్వదళే పుణ్యమతిః
ఆగ్నేయే నిద్రాలస్యం, దక్షిణే క్రూరం,
నైఋతి పాపం, పశ్చిమే క్రీడా సక్తిః
వాయువ్యే గమనం, ఉత్తరేరతి ప్రీతిః
ఈశాన్యే ద్రవ్యదానం, మధ్యే వైరాగ్యం
కేసరే జాగ్రత్తః, కర్ణికాయాం స్వప్నం
లింగే సుషుప్తిః, పద్మ త్యాగేతురీయం."

(పూర్వ దళమందుఁ బుణ్య చిత్తముండును. ఆగ్నేయమునందు నిద్రాలస్యముండును. దక్షిణమందుఁ గ్రూరచింత యుండును. నైఋతియందుఁ బాపచింత యుండును. పశ్చిమమందుఁ గ్రీడాసక్తి యుండును. వాయువ్యమందు గమన చింత యుండును; ఉత్తరమందు రతి ప్రీతియుండును. ఈశాన్యమందు ద్రవ్యదాన చింతయుండును. కమలముయొక్క మధ్యమందు వైరాగ్య చింతయుండును. కేసరమందు జాగ్రత్తయుండును. అనగా జాగ్రత్తలో జాగ్రత్త యుండును, కర్ణికయందు స్వప్న ముండును. అనఁగా జాగ్రత్తలో స్వప్నమని యర్థము, లింగమునందు సుషుప్తి యుండును. అనఁగా జాగ్రత్తలో సుషుప్తియని అర్థము. పద్మ త్యాగమునందుఁ దురీయముండును. అనఁగా జాగ్రత్తలోఁ దురీయమని భావము.)

ప్రాణమనంబుల యేకైక రూపమగు ప్రత్యగాత్మను జ్ఞానమందురు. ఈ జ్ఞానమువలన మూర్ధ్ని స్థానమందలి యష్టదళ పద్మమునందు నష్టవిధ వ్యవహారములు జరుగును. విషయవాసనా స్వరూపమునందుఁ బ్రాణమనంబులధోముఖముగా సంచరించి స్వప్న, సుషుప్తి, మరణము లొందును. ప్రత్యగాత్మయగు జ్ఞానమున కల్గు నష్టవిధ వ్యవహారములయందు వైరాగ్య దీక్షను బొందినచోఁ బ్రాణ మనంబులు నశించి చేతన బ్రహ్మత్వ స్వప్రకాశము నిల్చి యుండును. అందువలన స్థూలావయవ రహిత జాగ్రదావస్థయు సూక్ష్మావయవరహిత స్వప్నావస్థయు నజ్ఞానావరణ రహిత సుషుప్త్యావస్థయు వస్తురూపబిందు ప్రకాశ రహిత తుర్యావస్థయుఁ దెలియఁబడుచుండును. అధిష్ఠాన ప్రత్యగాత్మ నిర్ణయమందుఁ బ్రాణ మనంబులు నశించుచున్నవి. కావున ప్రాణశుద్ధి యమనస్క యోగమువలనఁ గల్గునని దెలియవలయును.

మఱియుఁ దారక యోగమువలన మనో శుద్ధియు, సాంఖ్య యోగము వలన నాత్మ నిశ్చయ జీవ శుద్ధియు, మనో ఆత్మల యేకత్వము వలన నమనస్క యోగమును గల్గుచున్నవి. మఱియు నీ యమనస్క యోగము నున్మని యనియు, మనోన్మని యనియుఁ జెప్పఁబడును.

## ౧౬. ప్రత్యగాత్మ శుద్ధి

మహా వాక్య నిర్ణయ పద్ధతి వలన బ్రత్యగాత్మ శుద్ధి కల్గును.

౧. పరమాత్మ ప్రత్యగాత్మలస్థాన మేకముగా నున్నది. అయినను స్వరూప స్వభావములయందు మార్పుగ గోచరించుచున్నది. పిపీలికాది బ్రహ్మ పర్యంతము జీవేశ్వర జగదోపాధులందు సకల ద్రవ్యంబుల, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ్వ భావములఁ దెలియఁజేయుట పరమాత్మ లక్షణమై యున్నది.

౨. శ్రోత్రమునకు శ్రోత్రముగాను, నేత్రమునకు నేత్రముగాను ద్వక్కునకుఁద్వగింద్రియముగాను, జిహ్వకు జిహ్వేంద్రియముగాను, ఘ్రాణమునకు ఘ్రాణేంద్రియముగాను దెలియబఁడు విషయేంద్రియంబుల విషయ రూపంబుల నెఱింగి కర్మేంద్రియ కర్మానుభవము వలన. నవస్థాత్రయంబుల యందు విశ్వ, తైజస, ప్రాజ్ఞులను నామంబులొంది మరణావస్థయందు జీవ స్వరూపంబున నెనుబదినాల్గు లక్షల యుపాధులయందు ప్రవేశించుట ప్రత్యగాత్మ లక్షణమని తెలియవలసియున్నది.

౩. విషయ పంచకమువలన గల్గిన ప్రత్యగాత్మ స్వరూప స్వభావములకు గలుగు మార్పు మహావాక్య పద్ధతివలన నేర్పడుచున్నది. కావున మహావాక్య పద్ధతిచేఁ బ్రత్యగాత్మకు సిద్ధి గల్గునని తెలియఁదగి యున్నది.

౧. "ప్రజ్ఞానం బ్రహ్మ" :- ఇది ఋగ్వేదమునందు ననుభవ వాక్యము గను విధి వాక్యముగను నున్నది.

౨. "అహం బ్రహ్మాస్మి" :- ఇది యజుర్వేదమునందు ననుభవ వాక్యము. మఱియు నీ వాక్యము శిష్య సంబంధమైనది.

౩. "తత్వమసి బ్రహ్మ" :- ఇది సామవేదమునందు నుపదేశ వాక్యముగా నున్నది. దీనిని గురువాక్యమనియుఁ జెప్పుదురు.

౪. "అయమాత్మ బ్రహ్మ":- ఇది యదర్వణవేదమునందలి పమాప్త వాక్యము. దీనిని సాక్షాత్కార వాక్యమనియుఁ జెప్పుదురు.

దాని వివరణ :

## "ప్రజ్ఞానం బ్రహ్మ" అను వాక్యార్థ నిర్ణయము

జ్ఞానేంద్రియములద్వారా విషయ పంచకము నెఱిఁగి కర్మేంద్రియముల ద్వారా వచన, దాన, గమన, విసర్గ నానందంబులగు బాహ్యాంతర విష

యంబులు దేనిచేత దెలియఁబడుచున్నవో, అది జ్ఞానమని చెప్పఁబడును. జాగ్రదావస్థయందలి జ్ఞానము విషయ పంచకమునందలి విషయముల నెఱిఁగి విషయాదులకు దాసుఁడై యుండు వానికిఁ గల్గుచున్నది. ఇది సామాన్య జ్ఞానమని చెప్పఁబడును. అవస్థాత్రయ బాహ్యాంతర విషయంబులగు సకల వ్యవహారంబుల నెఱిఁగి వాని సధిష్ఠాన పద్ధతి తనదియని యే జ్ఞానము వలనఁ దెలియఁబడుచున్నరో ఆ జ్ఞానము ప్రజ్ఞానమని చెప్పబడును. యిట్టి జ్ఞాన స్థావర జంగమాత్మకములగు జీవోపాధులయందును నియమిత దైవము లందును నుండి సకలము తెలియునట్లు జేయుచున్నది. కావునఁ దెలియఁజేయు నట్టిదియు తెలియునట్టిదియు నేకముగా నున్నది. అందుచేఁ "ప్రజ్ఞానం బ్రహ్మ" యని చెప్పఁబడుచున్నది.

## ౨. అహం బ్రహ్మాస్మియొక్క నిర్ణయము

బ్రహ్మ విద్యకు యోగ్యమైన మానవోపాధియందు బుద్ధికి సాక్షిగా నున్న ప్రత్యగాత్మకు బ్రహ్మ ప్రకాశమువల్లనే నాది, నేనను నహంవృత్తి కల్గుచున్నది. అందువలన నహంబ్రహ్మత్వ నిర్ణయము సిద్ధించుచున్నది. 'అస్మి' "అనఁగా నైతిని" అని యర్థము. ప్రత్యగాత్మ లధో పరిణామము పొందుటచే జీవోపాధులయందు జేరుచున్నది. బ్రహ్మ నిర్ణయము తెలిసి యూర్ధ్వ పరిణామము పొందునపుడు తానే బ్రహ్మమగుచున్నది. కావున "నహం బ్రహ్మాస్మి" అనఁగా "నేనే బ్రహ్మనైతిని" అను నిట్టి నిర్ణయము సార్థక మగుచున్నది.

## ౩. తత్వమసి బ్రహ్మ నిర్ణయము

తత్పద లక్ష్యార్థమగు పరమాత్మ త్వంపద లక్ష్యార్థమగు ప్రత్యగాత్మ ఈ రెంటియొక్క యైక్యముచేయునది "అసి" పదము. పరమాత్మ ప్రకాశము నందు దెలియునట్టి విరాట్టు, హిరణ్య గర్భుఁడు, అవ్యాకృతుఁడు, అను వీరియొక్క అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములను కోశముల తీసివేయగా స్వయం ప్రకాశ బ్రహ్మము నిలిచి యుండును. త్వంపద లక్ష్యార్థమునందు దెలియబడు ప్రత్యగాత్మయందలి విశ్వ తైజస, ప్రాజ్ఞులయొక్క; అన్నమయ, ప్రాణమయ, మనోమయ,

విజ్ఞానమయ ఆనందమయములను కోశపంచకమును దీసివేయగా, లేక ఐక్యము చేయగా స్వప్రకాశ ప్రత్యగాత్మ నిలుచుచున్నది.

దీప ప్రకాశము దివిటీ ప్రకాశమైనట్లు ప్రత్యగాత్మ పరమాత్మలో నేకత్వము పొందును. దీనికి దృష్టాంతము : అదిష్టాన రూపమగు సూర్యుని యందు జల కిరణంబులును, ఉష్ణ కిరణంబులును, శీతల కిరణంబులును గలవు. జలకిరణంబుల ప్రసరింపజేసి భూమిపై నున్న గుంటల, కూప, తటాక, సముద్రములగ నతరు చేయును. వానిలో తన బింబమును ప్రతిబింబింపజేయును. శీతల కిరణంబుల నట్లే ప్రసరింపజేసి జల చరంబుల నుపాధుల నిర్మించును. ఉష్ణ కిరణంబుల ప్రసరింపజేసి జలమును, దాని యందలి ప్రతి బింబమును తనయందు లీనము జేసుకొనును. ఈ రీతిగ ప్రత్యగాత్మ పరమాత్మల కోశముల తమయందు నైక్యము జేసికొని యేకత్వము నొందుటయే "తత్వమసి బ్రహ్మ" నిర్ణయము.

## ౪. అయమాత్మ బ్రహ్మ నిర్ణయము

ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ అను నీ వాక్యత్రయము వలన నే యాత్మ తెలిసి నిర్ణయింపఁబడినదో ఆ యాత్మ బ్రహ్మమని నిర్ణయమగుచున్నది. కావున నయమాత్మా బ్రహ్మ నిర్ణయ మీ విధముగాఁ దెలియఁ దగియున్నది.

## ౧౩. మహావాక్య ఫల నిర్ణయము

౧. విషయావరణము వలన విశ్వుని రూపము నొందిన ప్రత్యగాత్మ ప్రజ్ఞానం బ్రహ్మయను మహా వాక్య శ్రవణ, మనన, నిదిధ్యాసలవలన విషయావరణ విశ్వుని రూపము విడిచి యవస్థాత్రయ సాక్షీ రూపమైన ప్రత్యగాత్మ తానే యగుచున్నది. ఇట్లు విజ్ఞాన వేత్తలు నిర్ణయించియున్నారు.

౨. అభిమానా వరణము వలనఁ దైజస రూపము పొందిన ప్రత్యగాత్మ "అహం బ్రహ్మాస్మి" అను మహా వాక్య శ్రవణ, మనన, నిదిధ్యాసలచే నభిమానావరణ రూపమైన తైజస రూపము నశించి "నేనే బ్రహ్మను" అను నిట్టి నిర్ణయము కల్గుచున్నది.

౩. అజ్ఞానా వరణరూపమునఁ బ్రాజ్ఞడను రూపము నొందిన ప్రత్యగాత్మ "తత్వమసి బ్రహ్మ" యను మహా వాక్య శ్రవణాదులవలనఁ బ్రాజ్ఞత్వము వదలి బ్రహ్మైక్యము నొందుచున్నది.

౪. వ్యష్ట్యాళిమానా వరణముగానున్న ప్రత్యగాత్మ "అయ మాత్మా బ్రహ్మ" యను మహా వాక్య, శ్రవణ, మనన, నిధిధ్యాసలవలన వ్యష్టాళి మానము విడిచి సమష్టిరూప స్వప్రకాశ చేతన స్వరూపుఁడనని నిర్ణయించు కొనును. కావునఁ బ్రత్యగాత్మ సిద్ధి మహా వాక్య పద్ధతిచేఁ గలుగునని సిద్ధాంత మగుచున్నది.

## ౧౮. అద్వైత నిర్ణయము

ఆసనము వలన శరీర శుద్ధి, తారక యోగమువలన నింద్రియ శుద్ధి, సాంఖ్య యోగమువలన జీవశుద్ధి, అమనస్క యోగమువలన ప్రాణశుద్ధి, మహావాక్య శ్రవణాదులవలనఁ బ్రత్యగాత్మ శుద్ధి తెలియఁబడుచున్నవి. వీనిని నెఱిఁగినవారలక్షర పురుషత్వము జెందుటకును నిశ్చయ రూప బ్రహ్మను భవమునకును, తైల ధారవలె నెడ తెరిపి లేక బ్రహ్మ స్వరూపమునందు నుండెదరు. ఇదియే యద్వైత సిద్ధి.

## ౧౯. పురుషోత్తమ రూపవార్తిక నిర్ణయము

భూమియొక్క అంతరమందు జలధారలుగనున్నను, భూమి పై భాగమునఁ గూప తటాక నదీ నదంబులుగానున్నను, మేఘమునందు మేఘ జలంబులుగానున్నను, మొత్తము మీద నన్నిచోట్ల గలది యుదకమని యెట్లు నిర్ణయమగుచున్నదో: అట్లే చూచునది, చూపించునది, చేయునది, చేయించునది, వినునది, వినిపించునది, యేకమే కాని, యెన్నిటికిని ననేకముగాదు. అట్టి లేకమైన యాత్మ దేనికొఱకు శ్రవణ మననాదులు చేయవలయును? తైలధారవలె దేనిని ధ్యానించ వలయును? ఏకత్వమునందు శ్రవణాదుల నిర్ణయములేదు. ఉన్నదనినచో ద్వైతము సిద్ధించును; కాని యద్వైత సిద్ధి లేదుగదా?. అని యిట్లు వార్తికము నిర్ణయించుచున్నది. ఇట్లు నిర్ణయింపఁబడిన యీ వార్తిక సిద్ధాంతమునందుఁగల బ్రహ్మ పరిణామావస్థ కలిగినది. ఎట్లనగా వార్తిక నిర్ణయమగు నుత్తమ పురుషుఁడు నిష్కామ స్వస్వరూపుఁడు.

అనఁగా నపేక్ష రహిత చేతనుఁడు. అందువలన నచల పరిపూర్ణ ప్రబోధకు-
లీపురుష రహితమునకే ప్రయత్న మొనర్చుచున్నారు.

దీనికి నుదాహరణము :

కం : ఎఱుఁగననేటిది యెఱుకే । ఎఱుఁగుదునని తనను బరుల నెఱిగే-
దెఱుకే । ఎఱుగనెఱుఁగుదుననుదా । నెఱుఁగుచు నుండేటిదెరుకే । నిరు
పామబుద్ధి । నీ వెరుగిది । నిగమప్రసిద్ధీ । గురుమంత్ర మనియేటి గృద్దాలి
తోటి యీ । యెరుకాకూకుడువేరు । నెరిగి త్రవ్వితెచాలు । నిరుపామబుద్ధీ ।
నీ వెరుగిది । నిగమ ప్రసిద్ధీ ॥

కం : పింఢ బ్రహ్మాండంబులు । రెండునుయా రెంటిలోని రెండహము-
లుయీ । ఖండములు నాల్గుగూడి య । ఖండంబగు యెరుక రూపు గనరా
మా తండ్రీ । యిది దెల్పిన । ఘనుడే తలిదండ్రి । ఖండా ఖండములుగ గని
పించె యెరుకానె । దండీదనేటి యుద్దండూలకలనైన । గనరా మా తండ్రీ ।
యిది దెల్పిన । ఘనుడె తలిదండ్రి ॥

కం : శతపత్రాప్రుని పొడగని । యతిరయమునతిమిర మణగి యగు
పడదెట్లు । ట్లతులితగురుకృపగలిగిన । మతిమంతుల జూచియెరుక । మరి
నిల్వబోదూ । సంశయము నీ । మదినిల్పరాదూ । శృతులందు స్మృతులందు-
ఇతిహాసములయందు । సతతాము శ్రమపడి వెతకీన యీ । యెరుక । మరి-
నిల్వబోదూ । సంశయము నీ మదినిల్పరాదూ ॥

కం : నేననని బ్రహ్మలోపల । లేనిదె సంభవమునొంది లీలతనకుదా ।
మేను జగములై వెలసెను । నేనదిమృగజలమురీతి । నిజముగాదనుచూ ।
లోకుల నేటి । గజిబిజి వినుచూ । మానాసమునవారి మాటకామోదించి ।
దానికీ బోధకు తగునంచు వినజేస్తి । నిజము గాదనుచూ । లోకులనేటి ।
గజిబిజి వినుచూ ॥

కం : ఎరుకేకోశము లై దెరు । గెరుకెభూతముల నెరుగు నెరుగును-
సర్వం । బెరుకేయెరుక నెరుంగును । యెరుకను గుత్తెరుగవేరే । యెరుకా
వున్నాదా । వున్నదంటె । నరకామెకాదా నిరతాము గురుసేవ పరతంత్రు-
లగుచు త । త్కరుణాకు పాత్రులై । యెరుకామాలినవారి । కెరుకావున్నాదా ॥
వున్నదంటె । నరకామెకాదా ॥

# చతుర్థ సోపానము

## యోగ నిర్మిత పద్ధతి

మంత్ర యోగము :— రూప నామాత్మకమగు ప్రపంచము ఏ పరమాత్మ వలన నిర్ణయించఁ గల్గినదో యట్టి పరమాత్మ రూప నామములు మాటలచేత ననుష్ఠించుటయే మంత్రయోగ మనఁబడును. మఱియు నేభూమిపై మానవుఁడు శయనించుచున్నాఁడో యా భూమియొక్క యాశ్రయము చేతనే లేచుచున్నాడు. అట్లు నామమునందు నామమును, రూపమునందు రూపము లయముచేయునట్టి ధ్యానము, మంత్రయోగమని చెప్పబడును.

ఈ మంత్రయోగ సాధనకు షోడశాంగములు గలవు. భక్తి, శుద్ధి, ఆసనము, పంచాంగసేవ, ఆచారము, ధారణ, దివ్యదేశ నిర్ణయము, ప్రాణక్రియ, ముద్ర, తర్పణము, యజ్ఞము, బలి, యాగము, జపము, ధ్యానము, సమాధి, అనువీనిని మంత్ర షోడశాంగములుగాఁ జెప్పుదురు.

భక్తి నిర్ణయము :— భయముచేతఁ గూడిన ప్రేమ భక్తియని చెప్పఁబడును. పరమాత్మయందలి ప్రేమ యన్ని ప్రేమలలో నధికమైనది. త్రికరణ శుద్ధి రహిత ప్రవర్తనమువలన నాత్మ మలినత్వ మొందుచున్నది. ఆత్మ మలినత్వము, నొందకుండఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రవర్తించుటకు భక్తియని చెప్పఁబడును.

శుద్ధి :- స్నానము వలన శరీర శుద్ధియుఁ బ్రాణాయామము వలన మనోశుద్ధియు, నాసనయోగ్యమువలన స్థలశుద్ధియు, నష్ట దిక్కుల యందున దిక్శుద్ధియుఁ గలుగుచున్నది.

ఆసనము :- దర్భ కృష్ణాజిన దవలాసనములును, స్వస్థికాసనము, పద్మాస నాదులు నాసనములు.

పంచాంగముల పారాయణము :- గీత, సహస్ర నామములు, స్థవము, కవచము, హృదయము.

ఆచారము :- సృష్టి నిర్ణయమునకు వ్యతిరిక్తముగాని పద్ధతియొక్క యనుకూలత ననుసరించి ప్రవర్తించుట. మఱియు స్వార్థరహితమగు వాక్కు స్వార్థరహిత పరోపకారము, ప్రేమతోఁగూడిన యంతఃకరణవృత్తి యీ త్రివిధరూప ప్రవర్తన సత్యమగు నాచారమని చెప్పఁబడును.

ధారణ :- ఇష్టదైవముయొక్క యాకారమందు మనస్సును వ్యాపక మొనర్చుటయుఁ, దనయొక్క యంతర్బాహ్య విషయంబులయందు నిస్పృహఁ జెంది యుండుటయు ధారణ మనఁబడును.

దివ్యదేశ నిర్ణయము :- భ్రూమధ్యము, హృదయము, నాభి, సహస్రారము, జీవేశ్వర జగత్తునకు మధ్యప్రదేశము. అష్టదిక్కుల యందేది యైన నొక దిక్కు. వీనిని దివ్యప్రదేశము లనఁబడును. పీఠస్థాపన క్షేప్రదేశములే యోగ్యములు.

ప్రాణక్రియ :- ప్రాణక్రియ యనఁగాఁ బ్రాణాయామమని తెలియవలెను.

ముద్ర :- బ్రహ్మముద్ర, యోనిముద్ర, దశావతార ముద్రలు మొదలైనవి ముద్రలనంబడును.

అర్ఘ్యము :- బ్రహ్మముద్రద్వారా నర్ఘ్యమిచ్చుట యర్ఘ్యమనఁబడును. అనఁగా బొటనవ్రేలి కొనతో నీళ్ళను విడుచుట.

యజ్ఞము :- మనుష్యాదుల కన్నాదులిడుట యజ్ఞ మనఁబడును.

బలి :- అహంకారబలి, కామబలి, జీవబలి, ఆత్మబలి, అనునవి బలులనబడును.

యాగము :- అగ్నియందు సుగంధాది పదార్థములఁ గాల్చుట బాహ్య యాగమనబడును. ఇంద్రియ నిగ్రహము కలిగియుండుట యంతర్యాగ మనఁబడును.

జపము :- వాచక మానసికములతో జపించుట జపము. అనగా నోటితో, జపమొనర్చుట వాచకమనియు, మనస్సుతో జపించుట మానసికమనియుఁ జెప్పఁబడును.

ధ్యానము :- చాంచల్యములేక భగవంతుని మనస్సునందు దలంచుటయే ధ్యానమనఁబడును.

సమాధి :- ధ్యానానంతరమందలి నిశ్చలత సమాధి యనఁబడును.

ఈ షోడశ పద్ధతుల నాచరనీయుండై యనుష్ఠాన దేవతారూప నామ క్రియలు-అంతః కరణమందు ధ్యానించుట, యనఁగా మననము చేయుట మంత్రయోగమనఁబడును ఇట్టి మంత్రయోగ సాధనల వలన జీవన్ముక్తి కలుగును. ఇందుకు సందేహములేదు.

హఠయోగ నిర్ణయము :- రూపనామ క్రియాత్మకమగు సకల ప్రపంచము పరమాత్మయని నిర్ణయించి మంత్రయోగము వలనఁ దనస్వరూపమునుఁ బరమాత్మయందు నైక్యమొనర్చిన రూపముగా స్థూలశరీరమందలి సూక్ష్మశరీరమును జిత్తవృత్తియందు నిరోధించుట హఠయోగమని చెప్పఁబడును.

కర్మ నిర్మితముగానున్నది సూక్ష్మశరీరము. దీని కర్మానుసారముగాఁ బుట్టునది స్థూలశరీరము. ఈ రెండును నేకముగా నుండును. కావున స్థూల శరీరముచే సకల పద్ధతుల సాధించి యట్టి సాధనసత్తా సూక్ష్మశరీరమునందుఁ బ్రయోగింపఁజేసి సూక్ష్మశరీరమును జలించక యుండఁజేయుట హఠ యోగము. చిత్తవృత్తి నిరోధమే హఠయోగమని దీని ఫలితార్థము. దీనికి నష్టాంగములు గలవు.

అష్టాంగ నిర్ణయము :- యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి-అనువివి యష్టాంగములు.

1. యమమనఁగా బాహ్యేంద్రియనిగ్రహము.
2. నియమమనఁగా నంతరేంద్రియ నిగ్రహము.
3. ఆసనమనఁగా యోగసాధనకుఁదగినట్లుగా శరీరమును జక్కగానుంచుట.
4. ప్రాణాయామమనగా పాణాపానములపైఁ దనసత్తానుంచి యేకముగాఁ జేసియోగసాధనకుఁ దగినదానిగా నాసత్తను జేయుట.
5. ప్రత్యాహారమనఁగా మనస్సును బాహ్యాంతరములయందుఁ బోనీయక మధ్యపరిమితియందు వ్యాపకమొనర్చుట.
6. ధారన యనఁగా నవసరానుసారముగ మనస్సును బాహ్యాంతరముల యందుఁ బ్రవర్తింపఁజేయుచు మిగత కాలమునందు నాత్మయందు వ్యాపక మొనర్చుట.
7. ధ్యానమనఁగా నాత్మ సర్వస్వరూప నిర్ణయము.
8. సమాధియనఁగా నాత్మ నిశ్చయమందు నెంతదనుక మానవుఁడు తన మనస్సును నిల్పునో యంతవరకా స్థితి సమాధి యనఁబడును.

ఈ యష్టాంగములలో నాల్గు బాహ్యసాధనములు. తక్కిన నాల్గు - అంతర సాధనములు. కావున యమ నియ మాసన ప్రాణాయామములగు బాహ్యసాధనముల యందలి సత్తా నంతర సాధనంబులగు ప్రత్యాహారధారణ ధ్యానసమాధులందుఁ బ్రవేశపెట్టి యంతర సాధన సత్తామాత్రమున సూక్ష్మ శరీరమును జితమున లయింపఁజేయుట హఠయోగమని చెప్పఁబడును. ఈ పద్ధతిచే సూక్ష్మశరీరము చలించక యుండును.

లయయోగము :- ప్రకృతి పురుష సంయోగమువలన సృష్టి గలుగు చున్నది. నక్షత్రాది సకలపదార్థంబులు ప్రకృతి పురుషునియందుఁ గలవు. ఆధార మందుండు కుండలీశక్తి సుషుప్తియందు నున్నంతవరకు బాహ్య సృష్టి జరుగుచుండును. కుండలీశక్తిని మేలుకొలిపి పురుషునియందు లయముచేయు వారికి సృష్టిలేదు. కావునః బ్రకృతిని బురుషునియందు లయముచేయుటకు లయయోగమని చెప్పఁబడును.

పురుషస్థానము సహస్రారమునందు నున్నది. కుండలీశక్తి యాధా రమందున్నది. ఇది తమః ప్రధానమగు సుషుప్త్యావస్థ యందున్నది. కావున నీ కుండలిని మేలుకొలిపి బ్రహ్మదండినుండి యూర్ధ్వముఖముగాఁ బరిణ మింపఁజేసి పురుషునియందు లయింపఁ జేయవలయును. లయయోగాంగ ములు తొమ్మండ్రు గలవు.

నవాంగములు :- యమము, నియమము, స్థూలక్రియ, సూక్ష్మక్రియ, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, లయక్రియ, సమాధి, యనునవి నవాంగ ములు. బాహ్యేంద్రియ విగ్రహము యమము, అంతరేంద్రియ విగ్రహము నియమము. శరీరముచే నొనర్పఁబడు నానస ముద్రలు స్థూలక్రియ, ప్రాణ వాయువుచే నొనర్పఁబడు రేచక పూరకంబులు సూక్ష్మక్రియ, మనస్సు నూర్ధ్వ భాగమున నుంచుట ప్రత్యాహారము. అవసరానుసారముగా మనస్సును బాహ్యమునందుఁ బోనిచ్చినను నచటఁగూడఁ బరమాత్మ విశ్చయముంచుట ధారణ. బిందువునందుఁ బ్రకృతీ పురుషుల ధ్యానించుట యనఁగా నంతఃకరణ ప్రకాశమునందు నాత్మ ప్రకృతుల వ్యవహారము తెలియుట ధ్యానము. ఈ పద్ధతులు లయయోగమునకు బ్రధానాంశమని తెలియవలెను.

ఈ లయక్రియ, బిందులయమని మహాలయమని రెండు భేదము లొందును. అందు బిందులయమనునది మఱల రెండుభేదములు పొందును.

1. దశవిధ నాదంబులు శ్రోత్రేంద్రియములచేఁ దెలియుచుఁ దుది నాదమగు మేఘనాదమందు మనస్సు లయమొనర్చుట మొదటి భేదము.

2. ప్రత్యగాత్మగా భ్రూమధ్యస్థానము నందుఁ దెలియు నాహోజ్యోతి యగు బిందువునందుఁ బ్రాణరూప ప్రకృతిని లయముచేయుట రెండవ భేదము.

3. మహాలయమనఁగా స్వయంప్రకాశ పరబ్రహ్మమందు జీవేశ్వర జగత్తుల లయచింతనచేయుట. ఇట్లు భేదములొందిన నీ లయయోగమే లయ క్రియ యనఁబడును.

లయచింతన యెంతవరకుండునో యంతవరకు సమాధియని చెప్పఁ బడును. లయయోగము వలన నజ్ఞానావరణము నశించి పరమాత్మయగు బ్రహ్మత్వము నేను బొందగలనను నిశ్చయము గలుగును.

రాజయోగనిర్ణయము :- అంతఃకరణము సృష్టిస్థితిలయ కారణమగు నది. దీని పరిణామము మనస్సు బుద్ధి చిత్తము—అహంకారము. అంతః కరణాధిష్టానముగా స్వప్రకాశ బ్రహ్మముండును. అంతఃకరణ పరిణామ మగు నంతఃకరణ చతుష్టయమును నశింపఁజేసి యంతఃకరణమగు జ్ఞానము దాని యధిష్టానమగు బ్రహ్మమునందు నైక్యము చేయుట రాజయోగమనఁ బడును. దీనికి షోడశాంగములు గలవు.

రాజయోగ షోడశాంగములు :- భూమిక లేదు. ధారణాంగములు రెండు. ధ్యానాంగములు మూఁడు. సమాధ్యంగములు నాలుగు. మొత్తము గలిసి షోడశాంగములగును.

అందు సప్తభూమికలలో నజ్ఞానభూమిక లేదు; జ్ఞానభూమికలేదు, వీనిలో నజ్ఞానభూమిక లేవియనఁగా బీజజాగృతి, జాగృతి, మహాజాగృతి, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగృతి, సుషుప్తి యనునవి సప్తవిధా జ్ఞాన భూమికలు.

1 బీజ జాగృతి :- వృక్షమునకు ముందు నంకురమేర్పడినట్లు సుషుప్తి నుండి జీవుఁడు మేలుకొనిన ప్రథమదశ. ఇదియే బీజజాగృతి.

2 జాగృతి :- అంకురార్పణానంతరము వృక్షమునకు రెండాకులు గల్గినట్లు మెలకువ నొందిన జీవుఁడు దేహాభిమానము గలిగి ధనధాన్య గృహారామ క్షేత్రాదులు నావియని యభిమానపడునది; జాగృతి.

3 మహాజాగృతి :- ద్విదళ మధ్యనుండి కొమ్మలేర్పడి వృక్షాకారము గల్గునట్లు తెలియఁజేయ విధముగాఁ, దనపూర్వజన్మ సంస్కారజ్ఞానము వలనఁ దాను గొప్పవాఁడ నగుచున్నానను జ్ఞానము-అనఁగా నూహగలుగుట మహాజాగ్రత్త.

4 జాగ్రత్స్వప్నము :- వృక్షము పెంపగును; దాని ఫలంబు ననుభవించి కృతార్థుఁడఁ గాగలనని మనంబునఁ దలంచినట్లు దాను జాగ్రతయందుఁ జేయు కార్యములవలనఁ గల్గిన ఫలంబులు మనస్సునందుఁ దలంచి యానందము నొందును. కావున దీనిని జాగ్రత్స్వప్నమని చెప్పఁబడును.

5 స్వప్నము :- స్వప్నావస్థయందు శుభాశుభంబులఁ గాంచి మేలుకొని యానంద భయముల నొంది కొంతకాలమునకు వానిని మరచియుండుట. ఇదియే స్వప్నము.

6 స్వప్న జాగృతి :- స్వప్నమునఁ దానుగాంచిన విషయములు జాలకాల మంతఃకరణమందుంచి వాని ఫలంబులకు వేచియుండుట. దీనినే స్వప్న జాగృతి యందురు.

7 సుషుప్తి :- విక్షేప రూపంబగు నవస్థను విడిచిన తరువాత జీవునికిఁ గల్గు జడరూప స్థితి. ఇదియే సుషుప్తి.

### జ్ఞాన భూమికలు

శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్వాపత్తి-అసంశక్తి, పదార్థ భావన, తుర్యగ యనునవి జ్ఞానభూమికలు.

1. శుభేచ్ఛ :- బ్రహ్మ సాక్షాత్కారమునకు బ్రయత్నించుట శుభేచ్ఛ యనఁబడును.

1 విచారణ :- ఆధ్యాత్మిక విచారణతప్ప యితర విచారణ లేకుండుట విచారణ.

3 తనుమానస :- శుభేచ్ఛ విచారణలను నీ రెండు పద్ధతులలో దేని యందు వైరాగ్యము పొందమునో దానియందు విరక్తిగలిగియుండుట, తను మానస.

ఈ మూఁడును జాగ్రదావస్థ ననుసరించినప్పుడు శ్రవణ మనన నిధి ధ్యాసలని చెప్పఁబడును.

4 సత్వాపత్తి :- పై మూఁడు భూమికలయొక్క యధికాభ్యాసము వలనఁ గలిగిన బ్రహ్మనిష్ఠ.

5 యసంశక్తి :- బ్రహ్మనిష్ఠ మినహా ఇతరనిష్ఠలు లేకయుండుట.

6 పదార్థ భావన :- ఇతర పదార్థములయందు ననురాగములేక బ్రహ్మ పదార్థమునందే భావనయుండుట. పై రెండు పద్ధతులు సుషుప్తి పద్ధతు లగును.

7 తుర్యగ :- ఇతర స్వరూపలక్షణములు విడిచి స్వస్వరూపమునందు నుండుట, తుర్యము.

## ధారణాంగములు

ధారణాంగములు రెండు విధంబులు
ఒకటి ప్రకృతిధారణ, - రెండవది బ్రహ్మధారణ.

ప్రకృతి ధారణ :- అంతఃకరణ పరిణామమగు మనోయింద్రియము జ్ఞానేంద్రియముల ద్వారా విషయపంచకము తెలిసి, కర్మేంద్రియముల ద్వారా కర్మనొనర్చి, వానినుండి వచ్చిన విషయ స్వరూపముల నంతఃకర ణము నందుంచి వాని యనుభవమునకుఁ బ్రయత్నించుట; ప్రకృతి ధారణ యనఁబడును.

బ్రహ్మధారణ :- అంతఃకరణాధిష్ఠాన పరబ్రహ్మత్వము తానను నిశ్చయమందు నుండుట; బ్రహ్మధారణము.

ఈ రెండు పద్ధతులఁ దెలిసి వీని పట్టువిడుపుల నెఱిఁగినవారు రాజ యోగులని చెప్పఁబడుదురు.

### ధ్యానాంగములు

విరూడ్రూపము, ఈశ్వరరూపము, బ్రహ్మరూపము అని మూఁడు విధములు.

విరూడ్రూప ధ్యానము :- ఎనుఁబదినాల్గు లక్షల జీవోపాధులు పర బ్రహ్మయొక్క యేకావతారమను నిర్ణయమున ధ్యానించుట విరూడ్రూప ధ్యాన మనఁబడును.

ఈశ్వరరూప ధ్యానము :- ఎనుఁబదినాల్గు లక్షల జీవోపాధులయొక్క యంతరమునఁగా నంతఃకరణాధిష్ఠానముగా నుండి జీవకర్మానుభవ ఫలంబులు తెలిసి తగిన ఫలంబుల నొసఁగుచున్న నిర్ణయము తెలిసి ధ్యానించుట యీశ్వర ధ్యానమనఁబడును.

బ్రహ్మరూప ధ్యానము :- బ్రహ్మాండముయొక్క బాహ్యాంతరముల యందు, స్వయం ప్రకాశముగానుండి సూర్యాధిష్ఠానముచేత లోకంబులు ప్రకాశింపఁజేయుచు నంతఃకరణాధిష్ఠానముగా నుండుసను నిర్ణయము బ్రహ్మ రూపధ్యాన మనఁబడును.

### సమాధ్యంగములు

సవిచార సమాధులు రెండు, నిర్విచార సమాధులు రెండు.

1. సాంఖ్యయోగ పద్ధతివలనఁ దెలిసిన యాత్మ తానను నిర్ణయము.
2. మహావాక్య పద్ధతివలన ఘటమఠాకాశంబులు మహాకాశమైనట్లు తాను బ్రహ్మమను నిర్ణయము.

ఈ రెండు పద్ధతులు, సవిచార సమాధుల నిర్ణయమని తెలియవలయు.

### నిర్విచార సమాధుల నిర్ణయము

1. సూర్య చంద్ర నాడుల నేకత్వమొనర్చి బ్రహ్మదండినుండి భ్రూమధ్య మునకుఁ దెచ్చి బ్రహ్మమునం దైక్యమగుట.
2. అర్యాదర్పణరీతిగా బ్రహ్మనాళమునందు బ్రవేశించి బ్రహ్మమునం దైక్యమగుట.

ఈ రెండు పద్ధతులు, నిర్వికార సమాధుల నిర్ణయమని తెలియవలయును.

సప్తవిధ జ్ఞానాజ్ఞాన భూమికలపద్ధతి, ద్వివిధ ధారణాంగముల పద్ధతి, త్రివిధ ధ్యానముల పద్ధతి, చతుర్విధ సమాధుల పద్ధతిఁ దెలిసి యభ్యసించినది రాజయోగమని చెప్పఁబడును.

### యోగచతుష్టయ ఫలరూప నిర్ణయము

1. మంత్రయోగమువలన బ్రహ్మమునందు రూపనామ క్రియలు లయమగుచున్నవి. కావున స్థూల లయక్రియ మంత్రయోగమని చెప్పఁబడును.

2. హఠయోగమువలన బ్రహ్మమునందు సూక్ష్మశరీరము లయమగుచున్నది. కావున సూక్ష్మశరీర లయక్రియ హఠయోగమని చెప్పఁబడును.

3. లయయోగమువలన బ్రహ్మమునందు నజ్ఞానరూపమగు ప్రకృతి కారణ శరీర రూపమై లయమగుచున్నది. కావున కారణ శరీర లయక్రియ లయయోగమని చెప్పఁబడును.

4. రాజయోగమువలన బ్రహ్మమునందు అంతఃకరణ మాయా ప్రతిబింబములు లయమగుచున్నవి గావున అంతఃకరణ ప్రతిబింబ రహితక్రియ రాజయోగమని చెప్పఁబడును.

### రాజయోగమునందు త్రివిధ భేద నిర్ణయము

1. నిద్రించిన తదుపరి నుండునట్టి చైతన్యము ప్రజ్ఞానమగు అహమ్ శబ్దమనఁబడును. నిద్రనుండి లేవంగనే శరీరముపై నగపడు జ్ఞప్తి కిఁగూడ నహమని పేరు. కావున వీని రెంటి మధ్యనుండునట్టి అవస్థాత్రయంబు లాత్మకే కలిగియుండును. అందుచే సర్వ మాత్మయని నిశ్చయము. ఇదే పద్ధతి మహావాక్య నిర్ణ యమునందు విపులముగ చెప్పఁబడియున్నది.

2. మూడవస్థలయందుండు పరమాత్మ యవస్థలులేనిది; కావున దానిఁ పరిపూర్ణ మని నిర్ణయము.

3. సర్వేంద్రియములకుఁ దానురాజై వానిచేతఁ దాను సేవచేయించు కొనుచున్నాను. అను నిశ్చయము తెలిసి తాను పూర్ణంబను సిద్ధినొందుట. అనఁగా, లక్ష్యసిద్ధి నొందుట.

## అధిష్ఠాన చేతనబ్రహ్మమే ఎఱుకయని దృష్టాంతరూపముగ నిర్ణయించుట

కళంకరహితమైన నిలువుటద్దము లొకటిలో నొకటి చేర్చినచో రెండింటికాంతి యేకమై యితర విషయములు వానియందుఁ దెలియని విధముగ ప్రత్యగాత్మ పరమాత్మల ఏకైక నిర్ణయము గలవానికి ప్రపంచ లక్షణమగు మనస్సు తెలియకయున్నను, దెలియఁజేయునది, తెలిసికొనునది, పరమాత్మయని నిశ్చయము.

అద్దమునందు నితరవస్తు సముదాయ మగపడుచున్నది. అగపడలేదు. అని తెలియుటకు నద్దమెట్లు కారణమగుచున్నదో అట్లే తెలియఁజేయుటకుఁ తెలిసికొనుటకు నధిష్టాన చేతనబ్రహ్మము, కారణముగానుండి సర్వము దానేయై, సర్వము తనయందు లయము చేసికొనుచున్నది.

### ఇందుకు దృష్టాంతము

దీపప్రకాశమునందు బయలుదేరు కాంతి; ఘటపటాదులను, దీపమును, జూపి దానియందే యది లయమువొందినట్లు సత్తునందున్న చిత్తుఅనఁగా, పరమాత్మయందలి ప్రత్యగాత్మ తన స్వరూపావరణములఁ జూపి పరమాత్మయందే లయము జెందును. అందువలన ప్రత్యగాత్మ పరమాత్మలు వేరుగానున్నప్పుడు ప్రత్యగాత్మ ప్రపంచము; ప్రత్యగాత్మకు పరమాత్మ ప్రపంచము. ఇయ్యది పరమాత్మ యెఱుంగుచుండును. అప్పుడు సమిష్టి మనస్సు, పరమాత్మయందును, వ్యష్టిమనస్సు ప్రత్యగాత్మయందును గోచరమగును. ఈ రెండింటి నేకమొనర్చినచోఁ గేవల ప్రకాశము యేర్పడును. కావున నందు మనోప్రపంచము తెలియదు; అందుచేత తెలియఁజేయు, తెలికొను, పద్ధతి నశించినదను లక్షణము భ్రాంతియగును. గనుకఁ దెలియఁజేయు తెలిసికొను నట్టిది స్వప్రకాశ చేతన బ్రహ్మమగు ఎఱుకయని నిర్ణయింపఁబడినది.

## ఎఱుక నిర్ణయ పద్ధతి

ఎఱుక స్థూల సూక్ష్మ భాగములుగా నాల్గువిధముల విభజింపవచ్చును.

1. అఖండమైన ఎఱుక 2. కేవలమైన ఎఱుక 3. మిశ్రమ మగు నెఱుక 4. మలినమగు నెఱుక.

1. అఖండమగు ఎఱుక స్వప్రకాశము, బ్రహ్మము, చేతనము ఉత్తమ పురుషుఁడని నాల్గు విధములుగా చెప్పఁబడును.
2. కేవలమైన ఎఱుక, పరమేశ్వరుఁడు, సమిష్టి ప్రాణము, అక్షర పురుషుఁడు అని మూఁడు విధములుగా చెప్పఁబడును.
3. మిశ్రమమగు నెఱుక. ప్రత్యగాత్మ. వ్యష్టిప్రాణము. క్షరపురుషుఁడని మూఁడు విధములుగా చెప్పఁబడును.
4. మలినమగు నెఱుక. తన్మాత్రసహితశక్తి సముదాయము, మఱియు భూత సముదాయము అని రెండు విధములుగా చెప్పఁబడును.

అఖండమగు నెరుక ఊర్ధ్వభాగమందున్నది. మలినమైన యెరుక అధోభాగమందున్నది. కేవలమైన యెరుకయగు సమష్టి ప్రాణమనంబుల ప్రవర్తనకు, తనవంక నాకర్షించుటకు శక్తిగా సర్వదిశలందు నీవఖండమగు నెరుకను, కనుఁగొనఁగలవు. జగస్సృష్టికి నఖండమగు నెరుక మూలకారణ మగుచున్నది. మఱియు నయ్యది ఆధారమగుచున్నది.

అఖండమైన యెరుకయొక్క నిజమైనయునికి నీ శరీరోర్ధ్వభాగమునందున్నది. మలినమగు నెరుకయొక్క యునికి నీ శరీర యధోభాగమందున్నది. మిశ్రమమగు నెరుకయగు వ్యష్టి ప్రాణమనంబుల భౌతిక ప్రవర్తనకు, వాని అభ్యాసములగు కామసంకల్పములు తనవంక నాకర్షించుటకు శక్తిగా సర్వ విషయములందు మనము దానివి కనుఁగొనసగును. నీ సృష్టికి మిశ్రమమగు నెరుకఁ కారణముగానున్నది. అఖండమైన యెరుక యాధారముగా నున్నది.

మలినమగు నెరుక వ్యక్తిగతముగాను, విశ్వగతముగాను, నున్నట్లు నఖండమైన యెరుక వ్యష్టిగతముగాను విశ్వగతముగాను నున్నది. ఐనను మలినపు చెరుక అన్నమయాదికోశ భూతమును మారురూపములు ధరించు చున్నది. పరమగు నెరుక, అఖండమగు నెరుక, ఏకరూపముగానున్నది.

మలినపు చెఱుక సంబంధమగు పృధివ్యాది స్థావరజంగమములు జడ ములని యొక సామాన్య నియమముగలదు. అది నిజాభిప్రాయముగాదు. ఎట్లులనఁగా : నవి మలినమగు నెఱుక అణఁగియున్న పరిణామంబులుగా నున్నది. కావున నఖండమైన యెఱుక వానియందు సంపూర్ణముగా నిండు కొనియున్నది; మఱియు వాని యంతఃకరణమందే నిండియున్నది. కావున,

కం॥ ఎఱుకకు తన్మాత్రలుగలవా మఱపుకు తన్మాత్రలుండు మఱి రొండొకచే : అని నిర్ణయమున్నది, అయినను మలినపుచెఱుక తమః ప్రధానమైనందున దానిలో నేదికూడ రూపనామక్రియలను బొందలేదు. కావున భూతసముదాయమగు దాని పరిణామ స్థావర జంగమాదులను మలి నపుచెఱుక యని చెప్పఁబడును.

ధాన్యాదుల యంకురమునందు జీవోత్పత్తియు, వృక్షోత్పత్తి శక్తియు యిమిడియున్నట్లు; మలినపు చెఱుకయగు స్థూలసముదాయమునకు మిశ్రమపు చెఱుకయగు ప్రాణ మనంబులకు మధ్యగా నఖండపుచెఱుక యుండును. ఇందులో నేదికూడ మన యధీనములో నుండవు.

మలినపుచెఱుకయగు బాహ్యశక్తిమనము దాసులమైయుండి మనను రంచిచునట్టి ఆప్త పరికరములు, ధనధాన్య వస్తువాహనాదులు అని నిర్ణయిం చుకొని యున్నాముగనుక ప్రతివ్యక్తిలో మలినపు చెఱుకయగు విశ్వప్రకృతి సృష్టికరించుచున్నది. ఈ విశ్వప్రకృతి మనలో నలవాటు ప్రపత్తులను ప్రవ ర్తనలను, శక్తులను, నభిరుచులను మూర్తిస్వరూపములను నెలకొలుపుచున్నది. జన్మకు పూర్వమునఁగానీ, జన్మకు పిమ్మటఁగానీ, మనలో రూపమొందినయిట్టి నియమములనే నేను, నాది; యని పేర్కొనుచున్నాము.

ఈలక్షణము లఖండపుచెఱుక, కేవలపుచెఱుక మిశ్రపుచెఱుకలలోనొక దానియందు దాగియుండి మనబాహ్యజీవితమున సంబంధముగలిగి ప్రయోగ పడుచున్నది. మలినపుచెఱుకయగు విశ్వప్రకృతి యలలు అపరోక్షముగనో (లేక) ఇతరమూలముగనో, రాకపోకలమూలముగనో మనబాహ్యపు చెఱుక యగు కేవలపుచెఱుక ననుసరించి క్రియోన్ముఖమొనర్చుచు నభివృద్ధి చేయు

చున్నది. ప్రవర్తన అధిభౌతికమగు మనస్సును విడువఁజాలక మలినపు పెరుకయగు విశ్వప్రకృతి విషయమే స్వకీయమని, శాశ్వతమని భావించి మిశ్రమపు పెరుకలోనికిఁ బ్రవహించుచు లాగుచున్నది. అందులోనే మునుఁగుచున్నది.

ఈ పద్ధతులవలన కర్మానుభవము నొకప్పుడు బహిర్గతము కావచ్చును. కాకపోవచ్చును. సర్వకర్మానుభవ స్వరూపము విశ్వసముద్రమగు నఖండపుపెరుక లోనికే త్రోయఁబడుచున్నది. అందువలన యోగికైన, త్యాగికైన, భోగికైన, విరాగికైన పునరావృత్తి గలుఁగు చున్నది.

మనమాచరింపఁబడు కర్మలయొక్క కార్యకలాపమే మనయాచరణీయమగు స్వభావముగా నేర్పడుచున్నది. అందువలన మనకుఁ గలుఁగునట్టి జన్మలు ఏకముగాక ననేకజన్మలు సిద్ధించు చున్నవి.

ఆధ్యాత్మికమగు మనస్సు ప్రజ్ఞానయుక్తమైన కేవలపుపెరుక లోనికిఁ బ్రవహించు తరుణముకొఱకు వేచియుండును దాని మఱలుబాటు విశేషభాగ మఖండపుపెరుక లోనికిఁ బ్రవహించును; కాని విశ్వప్రకృతి విషయ వాసనల వలన బాహ్యసత్తావైపుకే మఱలుచుండును.

అఖండపుపెరుక మార్పులేని నిర్దుష్టరూపముగా నగపడుచున్నది. అందువలన నది మారనట్టిదిగా నిశ్చయము దృఢపడుచున్నది. మఱియు నఖండపుపెరుక, మలినపుపెరుకయగు భౌతికముద్వారా కేవలపుపెరుకయగు విశ్వశక్తులద్వారా క్రీడగానున్నదికాని స్థిరముగాలేదు. పిండోత్పాదుల యుత్పత్తులఁనగా; నండజ. స్వేదజ, ఉద్భిజ; జరాయుజంబులను నుపాదులెడతెగక చర్విత చర్వణముగా కలుఁగు చున్నది అందువలనఁ బలుమారు ప్రవాహరూపముగా నివి సంభవించు చున్నవి. కావున నఖండపు పెరుక యొక్క యునికి స్థిరమైనదిగా మనమూహించు చున్నాము. కాని అది శాశ్వతముగా నుండదు.

అఖండపుపెరుక, కేవలపుపెరుక, మిశ్రమపుపెరుక మలీనపుపెరుక యని అఖండపుపెరుక యొక్క పరిణామంబులు చతుర్విధంబులుగా నున్నవి. అయినను సత్యమున వస్తునిర్దేశ్యమొక్క యఖండపుపెరుకయే; దానియొక్క

స్వప్రకాశ చేతనబ్రహ్మ మధిష్ఠానమని సిద్ధాంతము. అందువలన చేతన బ్రహ్మ మగు విశేషాధిష్ఠాన మశాశ్వతము, సామాన్య మనశ్వరముగా యున్నను.

పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవేశ్వర జగత్సృష్టి యఖండపు టెరుక వలననే గలుగుచున్నది. అందువలన సర్వమునకు మూల మఖండపు టెరుకయని నిర్ణయము. దీనికి మూల మెచ్చటనులేదు. కావున మూలములేని గుర్తెరుగు శరీర మేమియు లేదని నిర్ణయము.

కం॥ ఎరుకయిన భూతపంచక మెరుకకు చరణములు కటియు హృద యము గళముఖ శిరమును నయ్యెను క్రమమున ధరణి మొదల్ జేసియిట్లు తనయా గుర్తెరుగూ గగనము బయలంచన రాదిమరుగూ। యెరుగాకా కాశామె పరిపూర్ణ మనుచు కొందరు బల్కిరిది విని। గురిదప్పి యుండేవు। తనయా గుర్తెరుగూ గగనము బయలంచన రాదిమరుగూ॥

కం॥ ఎరుకయిన భూతముల నీ। వెరుగుము ఆకసము గాద్పు యింగిల మును నీ। శ్శిరవందనేలయని నే। నెరిగిన పద్ధతిని నీకు। నెరిగించినానూ। ముజ్జగమూలయ్యెనూ వీట్లతోనూ। పరిపూర్ణమందు। కన్పడుచు తమకు దామె। మరికాన। రావిట్టి మాగాణము కలవీటి నెరిగించినానూ। ముజ్జగ మూలయ్యెను వీట్లతోనూ॥

కం॥ అంతటగలదీ యెరుకని। ఎంతో వాదింపుచుందు రెరుగనివారల్। అంతట ఇంతట గనుపడు। నంతటిదేగాని యెరుక అంతటగలదా। అదినిజ మైతే యగుపడవలదా। అంతటగల దొక్కయచలమే కా। నెరుక అంతట గలదని యనరాదు వినరాదు। అంతటగలదా అదివిజమైతే యగుపడవలదా॥

# పంచమ సోపానము

## జననమరణ భ్రాంతిరహిత మెందుకు ?

1. పృధ్విపై నున్న స్థావరజంగములు మలినపుటెరుకపై నాధారపడి యున్నది; కాని యవి కేవలమెరుకకాదు. అధోరూపమగు మిశ్రమపుటెరుక యవియు సర్వ మంతర్భూతమై యున్నది. ఐనను దానిలో నేదికూడ రూపనామక్రియలు బొందఁజాలదు. ఎందుకనఁగా మలినపుటెరుకకు జ్ఞానోదయము పొందిన మనః ప్రాణములగు మిశ్రమపుటెరుకకు మధ్యగ కేవల మెరుక రూపనామక్రియలు పొందుచున్నది.

2. కేవలపుటెరుకయందు నుండుశక్తి యెట్టిదనగా : ప్రాణవాయువుల సంచారమగు స్వప్నమునందు శబ్దరహితమైన వాక్కు, దానరహితమైన పాణి, గమనరహితమైన పాదము, ఆనందరహితమైన వాయువు, విసర్జన రహితమైన యుపస్థ ఇవియుండి క్రియోన్ముఖమగు జాగృతియందు సకలము సృష్టించి సకలకార్యములు చేయునట్లు పరారూపమగు నెరుక అఖండమై ద్రవరూపముగా నుండి అధోరూప పరిణామమువలన రూపనామాత్మకమగు కేవలత్వమునొంది మిశ్రమపుటెరుక రూపమున క్రియోన్ముఖమగు మలినపు టెరుకగా పరిణమించును. అనఁగా సకలము సృష్టించును.

3. అఖండపుటెరుక అధోరూపగమనమువలన మలినపుటెరుకయగు భౌతికముగాఁ బరిణమించును. ఇట్లు పరిణామము బొందుటకు నఖండపు టెరుక యొక్క యదేచ్ఛయేకాని యచలపరిపూర్ణ పరబ్రహ్మముయొక్క యిచ్ఛగాదు. అఖండపుటెరుక యొక్క యదేచ్ఛా పరిణామమువలన కేవలపు టెరుక దైవరూపముగాను, మిశ్రమపుటెరుక జీవరూపముగాను, మలినపు టెరుక స్థూలరూపముగాను, పరిణమించి నానాబాధలు పొందుచున్నది. అందువలన నీవు బాధలనుండి తప్పుకొనుటకు పరారూపమగు నెరుక ప్రయత్నించు చున్నది.

4. జ్ఞానరూపమగు ప్రతిక్రియలు విషయరూపంబులఁ దాల్చిన మనోసంకల్పంబులు పరారూపమగు నెరుక యందులేవు. అయినను జాగ్రదావస్థ యందు ననుభవించిన సకల విషయంబులు సంపూర్ణాకృతిఁ జెందిన విశ్వ

రూపంబున నుండక స్మరణరూపంబుగనో, వాసనారూపకముగనో, పరా రూప మగు నెరుకయందు జొచ్చి ద్రవరూపకమగు చున్నవి. అందువలన సంకల్ప ములు, సంఘటనలు నానా విధస్వప్నములు తలవని తలంపుగా వచ్చుచున్నవి. కావున నఖండపుటెరుక సర్వమునకు మూలకారణమని సిద్ధాంతము.

5. అఖండపుటెరుకను రహితమొనర్పలేక మలినపుటెరుక రహితమే విషయవాసనా రహితమని నమ్మికొన్న వారలకు తిరిగి విషయవాసనలు సంభ వించు చుండును. కావున నిజరహితము అనఁగా సర్వమునకు మూల కారణ మగు నఖండపుటెరుక అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు రహిత మొనర్ప వలయును. మఱియు నెంతటి జ్ఞానికైన పూర్వస్వభావము విడువదను లోకోక్తి గలదు. ఇందుకు కారణము అఖండపుటెరుక యందుఁ దాగియున్న విషయవాసనలు నేకాలమందైన వీలు కలిగినప్పుడు దలయెత్తుచుండును. పూర్వస్వభావము మారక స్థిరముగా నుండును కావున నఖండపుటెరుక రహిత మునకు సాధకుఁడు నిరంతరము ప్రయత్నించ వలయును.

6. మనము పుట్టుటకు పరారూపమగు నెరుక జన్మస్థానముకాదు దాని నుండి విషయము లుద్భవించి మలినపు టెరుకయందు రూపములు దాల్చుటకు గుణగణముల ప్రవర్తనకు పరారూపమగు నెరుకయగు నఖండపుటెరుకయే జన్మస్థానమగు చున్నది. అయినను మిశ్రమపుటెరుక అజ్ఞానములోను, మూర్ఖత్వములోను, అంధకారములోను, మాంద్యమగు తమః ప్రభావము గలిగియున్నది. మలినపుటెరుకలోనికి యోగయుక్తముగా నఖండపుటెరుక నవతరింపఁజేసి మిశ్రమపుటెరుక యొక్క రహితమునకుఁ బ్రయత్నించ వలయును. అట్లుగాక యితర యేపద్ధతుల నవలంబించినను నెంతటి మహాను భావులమని యనుకొన్నను వారిని మిశ్రమపుటెరుక విషయవాసనలలోనికి లాగుచునే యుండును. వారిని తబ్బిబ్బు చేయును.

7. మిశ్రమపుటెరుక రూపమైన మనస్సు తమఃప్రధానమైనది. అందు వలన విషయవాసనలయందు పదేపదే పరుగిడుచుండును. పరా రూపమగు నెరుకయొక్క నిశ్చయమునందుః దీని రహితమునకు శ్రద్ధఁగలిగి పట్టుగా

ప్రయత్నించవలయును. చక్రాతివలె నిన్ననుసరించుకొనియున్న మలినపు పెరుకను నఖండపుపెరుకయందు రహితస్థితిని బొందిన నీవు రాకపోకలు గలిగిన రాజమార్గముగా దారి జేర్చరుప వలయును. ఇట్లు చేయుటలో మిశ్రమపుపెరుకనుండి యేర్పడిన వాంఛలలో నెట్టి యాటంకము లుండబోవు. అయినను మిశ్రమపుపెరుక రూపమైన మనస్సు నఖండపుపెరుక రూపము బొందినను, దాని స్వభావరహితమునకుఁ గొంతకాలము పట్టును అట్టి యాలస్యమునకు నీవు నిస్పృహఁజెందవలదు. సర్వావస్థలయందు సచలస్థితిలో నుండవలయును.

8. మిశ్రమపుపెరుకయొక్క విషయములగు మనః ప్రాణంబు లఖండపు పెరుకత్వము జెందినవెంటనే బాహ్య విషయములు వీడిపోవును. అందు వలన మనః ప్రాణంబులు చలించక జీవరహితమై యుండును. ఎట్టులనఁగా, జీవము గలిగియు లేనివిధముగా నుండును.

9. మిశ్రమపుపెరుకయొక్క విషయంబులగు మనః ప్రాణంబులనుండి తరుమఁబడిన ప్రతివిషయము నఖండపుపెరుక మరుగుఁ జొచ్చి యుండును. ఎట్లనగా:- భూమిలో పాతిపెట్టిన విత్తనములు కాలానుగుణ్యముగ పైకి మొలకలెత్తినట్లు నఖండపుపెరుక మరుగుఁజొచ్చిన కామసంకల్పంబులు సమ యానుకూలముగ పైకి తలెత్తుచుండును. కావున నెంతటివానికైనా పూర్వా భ్యాసములు వారి ప్రవర్తనలు మార్పుఁ జెందకయుండి వీలుగా పైకివచ్చును.

10. శాశ్వతముగా విషయవాసనలనుండి ముక్తి జెందితినని నమ్మికఁ గలవానికిఁగూడ తిరిగి విషయవాసనలు సంభవించు చున్నవి. ఇట్లు సంభ వించుటకు కారణమేమనఁగా, సంచితాగామి బీజములు, మనః ప్రాణభౌతిక విషయవాసనలు, అఖండపుపెరుక యందున్నవి. అందువలన వ్యాధులకు, మృత్యువునకు, నఖండపుపెరుక కారణముగా నున్నది. జ్ఞానాజ్ఞానముల యొక్క కట్టకడపటి శరణాలయ మఖండపుపెరుక యనునట్టి చూపునకు నాశ్చర్యము మఱియు నభేద్యమును నై యున్నది. ఇందుకు నీక్రింది కందార్థ మిట్లు చెప్పుచున్నది.

కం॥ నిక్కముగ బీరపీచుల చిక్కనుమీ ; విచ్చరాదు ఛీ యీ యెరుక ఁ, మక్కువనేబోధించిన చక్కనిబోధాగ్ని చేత సాధించుకోరా ; విచ్చే చింత చాలించుకోరా ; చక్కని యీబోధ నెక్కడ యీడౌను తక్కిన బోధాల దిక్కుచూడక దీని సాధించుకోరా ; విచ్చేచింత చాలించుకోరా ॥

11. అఖండపునెరుకయొక్క గర్భగోళమునందు భద్రముగ పోషింపఁ బడుచున్న మనయొక్క కోరికలు కామనావృత్తులు నీవెంతగా నణఁగఁ ద్రొక్కినను వానిని వితరపద్ధతులచేత ఖండించినను నశించక మఱిమఱి పైకి మెదలుచు నీ జ్ఞానసిద్ధికి నవి పెడచెవి పెట్టుచుండును. అఖండపునెరుక మహా మూర్ఖమైనది. యందువలన అఖండపునెరుకయందు నచలపరిపూర్ణ పర బాహ్యమును ప్రవేశపెట్టి దాని రహితమునకుఁ బ్రయత్నించినపుడు నిర్జీవమై యది నశించును. ఇతర యేపద్ధతులచేత పరారూపమగు నెరుక (లేక) అఖండ రూపమగు నెరుక నశించదు. కావున జనన మరణభ్రాంతి రహితముగోరు స్త్రీ పురుషులు పాపరూపమైన అఖండపునెరుక నశించుటకు అనఁగా తన నాశనమునకుఁ బ్రయత్నము చేయవలయును. మఱియు జనన మరణభ్రాంతి రహితపద్ధతి ప్రతి మానవుడును తెలిసికొనవలయును. ఈ పద్ధతిగాక జీవ బ్రహ్మైక్య రూపము, అయమాత్మా బ్రహ్మరూపము తెలిసికొని నందున, జననమరణ భ్రాంతిరహితము కాజాలదు. ఎందుకనగా ; సర్వ భ్రాంతిరూప ములు గలుగఁజేయుటకు నఖండపునెరుకయే కారణము.

కం॥ ఓపాపరూప యీబయ । లే పరమాత్మయని నమ్మి లేనట్టినినుఁ॥
నాపోజ్యోతినని తెలిసి యీ పట్టున లేనటంచునెఱుఁగుముళక్తిఁ।

అచల పరిపూర్ణ ప్రబోధ, రాజయోగ నిర్మిత పద్ధతి
సన్యాసాశ్రమ నిరసనము

1. జీవితములో నున్న కష్ట పరంపరల నెదుర్కొన నట్టిమనుజుఁడు యోగమునందున్న కష్టముల నెట్లు నెదుర్కొనగలడు. యిట్టి లక్షణము గల వారే ఫలంబులను అనఁగా ప్రపంచ పారమార్థిక ఫలంబులను ననుభవింపఁ జాలరు.

2. గృహస్థాశ్రమము కష్టమని దానియందురోసి సన్యాసాశ్రమమున శాంతము చేకూరునని కొందఱు సన్యసించు చున్నారు ఇట్టివారు ప్రయోజన హీనమైన మూర్ఖులు. ఎందుచేతననఁగా : వారలాచరించు విధానము వలన నాత్మహత్యయగును ఇట్టి ఆత్మహంతకులు తమకర్మను మూటఁగట్టుకొని నీచలోకంబులకేఁగి యామూటతోనే పునర్జన్మమెత్తి నీచకర్మ లనుభవించు చున్నారు. కావున నిట్టి పిచ్చితలంపుల నణఁచి కర్మనిర్మిత చరమావధిని దృఢనిశ్చయముతో ధైర్యసాహసంబుల నవలంబించి జీవయాత్ర గడుప వలెను.

3. జీవుఁడు స్థూలశరీరము విడిచి పరలోకములలో సంచరించి తిరుగ దేహముధరించి యిహమున జన్మించి పూర్వకర్మానుభవములను ననుభవించు చుండును మఱియు వాని ననుష్ఠించు చుండును. ఇట్టి శరీరకర్మ పరిత్యాగ ముల వలన నేమిప్రయోజనము ? అవి త్యజించినందువలన వానికిఁ గలిగిన ఫలమేమి ?

4. బుద్ధిపూర్వకముగా శరీరకర్మల పరిత్యజించినవాఁడు పరలోకంబున యమయాతనలఁబడును. ఇహలోకంబున నీచయోనులయందు జన్మించును. కావున కర్మలయొక్క కష్టసుఖంబుల నెదుర్కొని పరిపూర్ణ రాజయోగ పద్ధతి వలన జననమరణభ్రాంతిని జయించుట చక్కని రాజమార్గము.

5. అన్ని యోగములకన్న అనఁగా, మంత్ర, లయ, హఠ, రాజయోగ, సాంఖ్య, తారక, అమనస్క మహావాక్య, అహంగ్రహోపాసన, విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృతోపాసనలు మొదలగు వాక్యార్థ, లక్ష్యార్థములలో నచల పరిపూర్ణ రాజయోగమార్గము గొప్పది. కర్మ పరంపరల ప్రవాహమును నెదుర్కొనుటకు నెవ్వనికి నుత్సాహపూర్వకమగు శక్తిసామర్థ్యములు గలవో ? అహంకార, మమకారముల నిశ్శేషముగా త్యజించిన వారలెవరో ? అట్టివారికే అచల పరిపూర్ణ రాజయోగ సిద్ధికలుఁగగలదు. వారలే యోగాధి కారులు. లక్షణయుతులు.

6. అచలపరిపూర్ణ రాజయోగ పద్ధతియందు కోరికలను బలాత్కార ముగా నణఁచుకొనుపద్ధతిలేదు. కానినియమానుసారముగా ప్రవర్తన విషయము నందు సమత్వ, సమరస, ఉదాసీనత్వముల పెంపొందించు పద్ధతి కలదు.

7. విర్బంధనిరోధమును, యథేచ్ఛావిహారమును, ఈ రెండు పద్ధతుల యందు కోరిక హెచ్చగుచుండును. కావున క్రమపద్ధతియొక్క నియమమే శాంతినిగలిగించును. అందువలన నియమానుసార ప్రవర్తనలకు నితర నియమము లవసరములేదు.

8. సన్యాసులు శరీరమునకు విశ్రాంతినీయక నిద్రాహారములు చూను టయే మంచిదియని తలంచు చున్నారు. అదిగొప్ప పొరపాటు. దీనివలన భౌతికాకారము శిధిలమై తనగతి అధోగతియగును కావున తగిననిద్ర, తగినయాహారము, మానవున కుండవలయును, అతినిద్ర, అమితాహారము, లుండకూడదు. ఇవి సృష్టికి వ్యతిరిక్తములు. కావున మితాహారము, మిత నిద్ర లావశ్యకములు.

9. సకల పద్ధతులకు శరీర మాధారమై యున్నది. దానికి వలసినంత నిద్ర, తగు నాహారము, తగిన విశ్రాంతి, అనగా సుషుప్త్యావస్థయందు కలుగు విశ్రాంతి తమఃప్రధానమైనది కావున నచలపరిపూర్ణ రాజయోగ విశ్రాంతి యావశ్యకమైనది. ఈ పద్ధతియొక్క నియమానుసారముగా నున్న వారు సకల పద్ధతులయందు సహాయకారులుగానుండి విశ్వప్రాణశక్తిని స్వీక రింపఁ గలుగుదురు. మితిమీరి ప్రవర్తించువారిని భ్రాంతిలోనికిఁ ద్రోసి అధో గతిఁ గలుగఁజేయును. అందువలన క్రమపద్ధతియొక్క నిర్ణయమే లక్షణ యుతమని తెలియవలయును. ఇదియే సకలమానవ కల్యాణము. సన్యా సాశ్రమము సృష్టికి వ్యతిరిక్తము. నీచకర్మప్రాప్తికి కారణము. అని సన్యా సాశ్రమమును ఎట్టి పండితునకైనఁ గూడదని శ్రీ శివరామ దీక్షితులవారు విరచించియున్నారు.

## ఆహార నియమ పద్ధతి

1. ఆహారముయొక్క సూక్ష్మాంశము ప్రాణము. ఆహారము లేక ప్రాణ సత్తానిలువదు. ఆహారము లేక యోగపద్ధతులవలన నాత్మసత్తా పెం పొందదు. ఒకవేళ పెంపొందినను, ప్రాణసత్తా స్థిమితపడదు. అందువలన,

మానవుఁ డాత్మానందముయొక్క పూర్ణానందము నొందజాలఁడు. ఆహారము పూర్తిగా విసర్జించినను (లేక) ఒక్క ప్రొద్దుల చేయుచుండినను ప్రాణసత్తా తారుమారగును. కాన, ఆత్మానందము మానవుఁ డెంతమాత్రము పొందఁ జాలఁడు. మఱియు నాహారము పూర్తిగా విసర్జించినను నమితముగా భుజించినను ప్రాణసత్తా తారుమారగును కావున నాహారము మితముగా భుజింపవలయును.

2. భుజించు యాహారము ప్రాణసత్తా నొసంగును అందుచేఁ బర మాత్మ ప్రీతిగా భుజించుచు నందు కామరసమును గ్రహింపక ప్రాణరసమును గ్రహింపవలయును. (అనఁగా) నధోగమనముగా నుండకూడదు. నూర్ధ్వగమనముతో నిరంతరము ప్రవర్తింపవలయును. అధోగమనము నొనర్చు వారలకు ప్రపంచభ్రాంతి, లోకవ్యవహారము అధికమైన యోనిప్రాప్తిఁ గలుఁగఁజేయును. కావున ప్రయత్నపూర్వకముగా శ్రద్ధవహించి యూర్ధ్వగమనము గావింపవలయును.

3. బ్రహ్మచర్యమనఁగా రేతస్సును నోజస్సుగాఁ బరిణమింపఁజేయుట. అనఁగా, రేతస్సులోని ధాతువును అనఁగా రసమును ఓజస్సుగా మార్చుట. ఓజస్సనఁగా తేజస్సని యర్థము. మనఃప్రాణ భౌతిక శరీరములు పోషించుచు నూర్ధ్వమువరకుఁ బ్రకోపింపఁ జేసిన నద్యాత్మశక్తి పెంపొందును. అనఁగా రేతస్సును నూర్ధ్వగమనము నొనర్చుట. రేతస్సు రేతస్సుగానే యున్న యెడల కామోద్రేకము గలిఁగించి అధోగమనము గలిఁగించును. అందు వలన మన ప్రాణ శరీరంబులను బలహీనము లొనర్చి శక్తిహీనము గావించును.

## రేతస్సును నోజస్సుగా మార్చు విధానము

4. సప్త ధాతువులలో రేతస్సు శ్రేష్ఠమైనది. అది బాహ్యముఖముగా వెదఁజల్లి విఫలమొనర్చక మూలవిద్యవలన నూర్ధ్వభాగమునకుఁ బరిణమింపఁ జేసినయెడల నది ఓజస్సుగా మాఱి ఆధ్యాత్మికము పొందును. ఆధ్యాత్మికము క్రమేణ నాధిదైవికముగా నగును. అధిదైవికముయొక్క నిర్ణయము సురపద్ధతి. మఱియు దైవాంశము. కావున అధోగమనము నియమితముగా త్యజించి ఊర్ధ్వగమనమునందు శ్రద్ధగా నుండవలె.

## వ్యాధులు జనక నిర్ణయము

5. అన్నపానాదుల వలన శరీరమునకు జబ్బులు గలుగునని అన్న పానాదుల మానుకొందురు. అది సరియైన పద్ధతికాదు.

1. వాతపిత్తశ్లేష్మముల భౌతిక వ్యాధులు.
2. కామ, క్రోధ, మోహ, లోభములును, ఈర్ష్యాసూయాదులును, ప్రాణవ్యాధులు.
3. అనృతము, పశ్చాత్తాపము, పొరబాటు మొదలగునవి మనో వ్యాధులు కావున;
   స్థూలవ్యాధులు భౌతికమునుండి రక్తనాళములోనికిఁ బ్రవేశించును.
   సూక్ష్మవ్యాధులు జ్ఞానేంద్రియములద్వారా సూక్ష్మశరీరము లోనికిఁ బ్రవేశించును.
   ఇట్టి పద్ధతిఁ దెలిసికొని ఆచరించు విధానముకలదు. అది యెట్ల నగా :

దనకు శరీరముపై నున్న యధికారము ననుసరించి సర్వ వ్యాధులను బాఱఁదోలి సౌఖ్యముఁ జెందవలెను. ఈ పద్ధతి ఋషిపుంగవు లాచరించు విధానమునై యున్నది. అచలపరిపూర్ణ స్థితి అలవడుకొద్ది అట్టిలక్షణములు మార్పుఁజెందుచుండును. ఆహారము దోషయుక్తమని యెంచక మితాహారము భుజించుచు దానిరసమునుండి యోజస్సును గ్రహించి దానిరహితమునకు నచలపరిపూర్ణ స్థితినిగూర్చి ప్రయత్నించవలెను. ఇదియే రాజమార్గము.

## అఖండ యోగనిర్ణయములు

1. యోగమునకుఁ బ్రథమమున మనఃప్రశాంతి నొనర్పుకొన నలయును. ఎందుకనఁగా : ప్రాణధర్మములను నాకలిదప్పులు వీనిభౌతిక శరీరపోషణార్థంబు మనంబునకు ననేకవిధంబుల సంకల్పములుండును. కావున వానినుండి మనస్సును మరల్చి పూర్వరూపమగు నఖండ పై తన్మయమునందు వ్యాపక మొనర్పవలయును.

2. మనోవృత్తులగు సంకల్ప, వికల్పములు లేకుండచేయుట మనః ప్రశాంతమని కొందఱి నిర్ణయము. కాని అదిసరియైన పద్ధతికాదు. ఎందు చేతననఁగా : మనోసంకల్పములు సుషుప్త్యవస్థయందు సహజముగనే లేక

పోవుచున్నది. అందుచేత అదిఅవస్థపద్ధతికాని యోగలక్షణముగాదు. మఱియు మనస్సునందుఁ తోచు సంకల్ప వికల్పములు సముద్రమునందుఁ తోచు నలల వంటివి. అట్టి యలలు లేనంతమాత్రమున సముద్రము లేదనుటకు వీలులేదు. సంకల్ప వికల్పంబులులేక సుషుప్త్యవస్థ యందున్నను జ్ఞానేంద్రియంబులు లాగి బాహ్యవృత్తులగు విషయేంద్రియంబులలో ప్రవేశింపచేయునట్లు మనః ప్రశాంతములేక యోగనిర్మితమునందున్న మనస్సును విషయవాంఛలగు మనోవృత్తులను లాగి బాహ్యవృత్తులందు ప్రవేశపెట్టును. ఇదియునుగాక మనఃప్రశాంతము లేక యోగానందము గలిగినఁ గలుఁగవచ్చును. కాని, అది శాశ్వతముగా నుండక వీచికలచందమున తారుమారగుచుండును.

మనఃప్రశాంతమనఁగా ; మనస్సు లేక యుండునట్లు చేయవలయునని కొందఱియభిప్రాయము. అది సరిగాదు. ఎందుకనగా ; మనస్సులేకయుండు నట్లు చేసికొనుట యెవరితరముగాదు. అది శవమనఁబడును. అదియును మనస్సు నాంతరమున శూన్యమగునెడల జడత్వము వహించి అధోగతినిఁ గలుగఁజేయును. మనస్సు బాహ్యముఖము చెందినయెడల విషయ పంచకము నందుఁ జేరును. కావున మనస్సును బాహ్యాంతరముల హొందనీయక యఖండ చేతనమందు వ్యాపకత్వము చేయవలయును. ఈ పద్ధతి మనఃప్రశాంతమని చెప్పఁబడును. ఇట్టిపద్ధతిఁగలవారు యోగమొనర్చినఁ దానిఫలంబుఁ జెందఁ గలరు. ఇట్టి ప్రశాంతచిత్తులకు నణిమాద్యష్టసిద్ధులు సకలవిధ ఫలంబులు గలుఁగును. ఇట్టి మనస్సు మహత్తుఁగలదిగా నుండును.

4. ప్రశాంతమనస్సుఁ గలవారి బాహ్యవిషయ పంచకము అంతర విషయ పంచకముగల నజ్ఞానరూప సుషుప్తియొక్క బాధలుండవు. ఎందు కనఁగా ; నఖండరూపమగు పరాచేతనమునందు వ్యాపకము బొందిన మనస్సు పరాశక్తి వంతమై యుండును. బాహ్యవిషయ పంచకములు తండోపతండ ములుగా సుఖదుఃఖరూపమున వచ్చి అంతఃకరణమునందుఁ బ్రవేశించును. బాటసారులువచ్చి వెళ్ళినట్లు వెళ్ళిపోవును. అదియునుగాక,

ఆకాశమునందు మేఘాడంబరములు గలిగి తదనంతరమున వాని గుఱుతు లాకాశమునందు లేనట్లు విషయపంచకమువలన కలిగిన కష్టసుఖముల

యొక్క గుఱుతు లంతఃకరణమందు నుండఁబోవు. కావున యోగపురుషుఁ డఖండ చేతనమందు మనస్సు వ్యాపకమొనర్చి మనఃప్రశాంతపరుఁడు కావలయును మరియు,

యోగపురుషునియొక్క అంతఃకరణము విషయపంచకమునకు దాసత్వముగాక అఖండచేతనముయొక్క ఆనందానుభవమునందు నుండవలయును. ఇందువలన దానెల్లప్పుడు ప్రశాంతుఁడై యుండును. అఖండ ఎఱుకయందు నున్మీలనమొనర్చిన మనస్సు స్వయముగా శక్తివంతమగును. కనుక అంతర శక్తులు నితరమహత్తులయందు నాధారపడవలసిన యవసరములేదు. వాని యాశ్రయముకూడ వీరి కవసరములేదు.

5. మనఃప్రశాంతి వస్తునిర్ణయ స్థిరత్వములేక యోగము సాధించు వారికి యోగానందము గలిగినఁ గలుఁగవచ్చును ; కాని అది మలినజలము నందుఁ బ్రతిఫలించిన సూర్యబింబమువంటిదగును. అందుచేతఁ దానివలనఁ బ్రయోజనముండబోదు. మనఃప్రశాంతి వస్తునిశ్చయాచల పరిపూర్ణస్థిరత కలుఁగుటకు సాధకుఁడు ప్రయత్నించవలయును.

6. అచలపరిపూర్ణస్థితి తొందరగా సిద్ధించదు. ఎందుకనగా ; నింత వరకు నాచరించిన సాధనంబు లవస్థాపద్ధతులగు భ్రాంతి జన్యములు. కావున నచలపరిపూర్ణ రాజయోగనిర్మితములగు నన్నమయ పురుషయోగమగు త్రికరణశుద్ధి, ప్రాణమయ పురుషయోగమగు సూత్రాత్మస్థితి, మనోమయ పురుష యోగమగు మూలవిద్యాస్థితి, విజ్ఞానమయ పురుషయోగమగు నఖండచేతనస్థితి ఇవియన్నియు, గలిఁగిన తదనంతరము పరిపూర్ణ రాజయోగమగు నచల పరిపూర్ణస్థితి నీయందు స్తిమితముగా నుండును. ఇట్లు గాక నితర పద్ధతులవల్ల నీయందుఁగలిగిన స్థిరత శాశ్వతముగా నుండక దివారాత్రములు మాఱినట్లు, వచ్చిపోవుచుండును.

7 సకల విషయములు జరుగుటకు నీయందు నేశక్తి పనిఁజేయు చున్నదో దానిని సదా గుర్తెరుంగుచుండవలయును. దాని రహితముకొఱకు నచల పరిపూర్ణ స్థితియందు ప్రయత్నించవలయును. ఇట్టి యత్నము హెచ్చు కొలఁది శాంతి, యచలస్థితి నెలకొనుచుండును.

8. జననమరణ భ్రాంతిరహితమునకుఁ బ్రయత్నించు సాధకుఁడు మనస్సు నందేఁగాక రక్తనాళములందును, స్థూలశరీరమునందును, సంపూర్ణముగా నుదాసీనతఁ గలిగియుండవలయును. ఇతరుల మనోవాక్శరీర స్పర్శాదులకుఁ జిక్కుపడకూడదు. ఇట్టి లక్షణయుతులే ప్రపంచశక్తులను జయింతురు. వానిలక్షణములఁ దెలిసి వానిని దూరముగాఁ బాఱదోలుదురు.

9. అన్నమయ పురుషయోగమువలనఁ త్రికరశుద్ధి ; ప్రాణమయ పురుషయోగమువలన సూత్రాత్మసత్త ; మనోమయ పురుషయోగమువలన సమష్టిమనోనిశ్చలత;విజ్ఞానమయపురుషయోగమువలన నఖండచేతనముయొక్క నిశ్చలత ; అనునట్టి విషయముల సమగ్రముగా నెఱుఁగకయే అచలపరిపూర్ణ రాజయోగమునందుఁ బ్రవేశించెదరు. అట్లు ప్రవేశించిన కసుగాయను యొత్తి పండుగాఁజేయుటకుఁ బ్రయత్నించినట్లగును ; కావున నచలపరిపూర్ణస్థితిఁ గ్రమక్రమముగా నిజగురువులచెంతఁ జేరి తత్కృపా ప్రసాదమున నభ్యసింపవలయును.

10. అచలపరిపూర్ణస్థితి ప్రౌఢ్ధుదిరుగుడు బుప్పవలెఁ గాక నచలత్వముగా నుండును. అంతరంగ పరిశోధనవలన నచలస్థితి కలుఁగును. బాహ్యవృత్తులవలన నయ్యది కలుఁగఁజాలదు.

11. మనస్సునందు నచంచలత, ప్రశాంతి, పవిత్రత, అఖండచేతనము యొక్క జ్ఞానము, బాహ్యాంతరముల కష్టసుఖంబుల నెదుర్కొను నప్రమేయ శక్తి, జననమరణభ్రాంతి రహితస్థితి ; అనునవి కలుఁగునట్లు ననుగ్రహము బ్రసాదింపుమని గురుమూర్తిని సర్వదా ధ్యానింపవలయును. అర్థింపవలయును.

12. మానవజీవితము భాగవతజీవితముగాఁ బ్రవర్తనజేయుటకు యోగసాధనకాదు ; జీవితముయొక్క విముఖత్వమే దానిజన్మస్థానము. ఇట్టి లక్షణ సిద్ధికి శరీరము కృశింపఁజేయుటయు ఆసన, లక్ష్య, ముద్రాభ్యాసాదులొనర్చుటయు ననవసరము. మానసిక, నైతిక, వివానాదుల సరితూగు కేవల విజ్ఞానమయ రహితనిర్మితము శ్రేష్ఠదాయకము. ఈ పద్ధతు లచలపరిపూర్ణ ప్రబోధవలన కలుఁగును ; ఇతర పద్ధతులవలన విజ్ఞానమయాత్మ అనఁగా నఖండ చైతన్యరహితము కాజాలదు.

## అచలపరిపూర్ణ రాజయోగ సాధకుని పద్ధతి

1. అఖండ చైతన్యపద్ధతియందు నేనున్నానసెడు నిర్ణయముకంటె నేనఖండ చైతన్యమే యనునిశ్చయమే యుత్తమము. ఇట్టి నిశ్చయము గలవాఁడు జననమరణ భ్రాంతిని సులభముగా దాటఁగలఁడు.

2. తాను కూటస్థుఁడుగా నుండి బాహ్యాభ్యంతరములయందు చలించు జ్ఞానకర్మేంద్రియంబులు, త్రికరణంబులు, అవస్థాత్రయంబులు, తమవల్లనే చలించుచున్నవనియు, సర్వము తానేననియు దనకన్న నితరమేమియులేద నియు ననునిట్టి నిశ్చయముగలిగి యుండవలయును.

3. కోశనిర్ణయమగు క్రమమైన దృష్టిఁగలిఁగి పట్టుదలతో నిలిచి యుండుట సాధకుని కర్తవ్యము. ఇట్టి పద్ధతివలన సాధకుఁడు కోశాతీత స్థితినిఁ బొందఁగలఁడు.

## యోగమునందు గమనింపఁదగిన ముఖ్యవిషయములు

1. సహజముగ నవస్థాత్రయంబులయందు సంభవించు లక్షణములు అచలపరిపూర్ణ రాజయోగమునందు నుండకూడదు. ఎట్లనఁగా నుత్తమ పురుషుఁడగు కేవలాత్మయందు విజ్ఞానమయాత్మనుండి జ్ఞానేంద్రియములచే విషయేంద్రియముల గ్రహించి, కర్మేంద్రియములచేత కర్మల నొనర్చునప్పుడు దానిని జాగ్రదావస్థయని చెప్పఁబడును. కావున విషయరూపమగు చిత్కళలు "జ్యోతిస్వరూపమగు పూర్ణబ్రహ్మమును నేను దర్శించుచున్నాను" అను విషయనిర్ణయ ముండకూడదు.

2. స్వప్నావస్థయందు మనోప్రపంచము దిలకించునట్లు నచల పరిపూర్ణ రాజయోగమునందు సంకల్పరూప ముండకూడదు. ఎట్లులనఁగా; రాజు తనసేవకులను వశపరచుకొని తనగృహమగు నంతఃపుర మునందు విచ్చలవిడిగా నెట్లు సంచరించుచున్నాఁడో యట్లు విజ్ఞానాత్మేంద్రియ సముదాయము చేత గ్రహించిన విషయములు దనస్వాధీనమునందుంచుకొని తన స్వగృహమగు నంతఃపురము అనఁగా సూక్ష్మశరీరమునందు విచ్చలవిడిగా నుండఁగలఁడు ఇదియె స్వప్నావస్థయని చెప్పఁబడును. స్వప్నావస్థ యనఁగా; నఖండచేతనమందున్న విజ్ఞానమయాత్మ (దర్శనలక్షణము) అనఁగా;

నే[త్రేం[దియము చేత రూపముమాత్రము తెలియఁబడునది స్వప్నావస్థయని చెప్పఁబడెను. స్వప్నావస్థయందు విజ్ఞానమయాత్మకు కర్మఫలంబులు లోకములగుచున్నవి. అనఁగా నిం[దలోకము, చం[ద్రలోకము, [బహ్మ లోకము, వీనిఫలములగుచున్నవి. కావున లోకఫలంబులు అంతఃకరణముచే ననుభవింపఁబడుచున్నవి. అందుచేత జా[గదావస్థరీత్యా స్వప్నావస్థగూడా కర్మకు కారణమగుచున్నది. అచలపరిపూర్ణ రాజయోగమునందు రూప రహిత పద్ధతి యుండవలయును ; కాని రూపనిర్మిత పద్ధతి యుండకూడదు. రూపనిర్మితము కర్మహేతువు. కావున నది [పయోజనహీనమని చెప్పఁ బడుచున్నది.

3. సుషుప్త్యావస్థయందలి యజ్ఞానము రీతి నచలపరిపూర్ణ రాజ యోగము నందుండకూడదు. అదియెట్లనఁ మి[శమ చేతనమగు విజ్ఞానమ యాత్మ విషయవాసనయందు మగ్నతఁజెందుట; అనఁగా హృదయము నందున్న డెబ్బదిరెండువేల నాడులలో నధోముఖముగానున్న నాడులయందు విషయ వాసనలతో నంతఃకరణ మధోగమనము పొందును. అందుచేత జ్ఞాన శూన్యమయి శబ్దాది విషయము ల[గాహ్యములగును. కావున దీనిని సుషుప్త్యా వస్థయని చెప్పఁబడును. (ఈ యవస్థ కలఁగుటకు కారణము దాని విధానము.) బుద్ధి నిశ్చయాత్మకముగా నున్నప్పుడు సర్వేం[దియములు బుద్ధికి స్వాధీనము లగును. దీనికి [శుతి[పమాణము. (బుద్ధిఃకర్మానుసారిణీ) అనఁగా బుద్ధి కర్మాధీనము. బుద్ధి స్వల్పమగునప్పుడు విజ్ఞానమయాత్మ స్వల్పమగుచున్నది. అందుచేత నీ విజ్ఞానమయాత్మయగు మి[శమ చేతనమునకు ని[దయని చెప్పఁ బడును. షోడశకళలచే సంపూర్ణముగానున్న చం[దుఁడు సమష్టి [పాణా వరణమువలన హెచ్చుతగ్గులఁ బొందునట్లు, విజ్ఞానమయ పురుషుఁడు హెచ్చుగా నున్నపుడు జా[గదావస్థయు, తగ్గుగా నున్నప్పుడు సుషుప్త్య వస్థయనియు, మధ్యగానున్నప్పుడు స్వప్నావస్థయనియు, పూర్ణముగా నున్నప్పుడు తురీయావస్థయనియుఁ జెప్పఁబడును. సుషుప్త్యావస్థయందు శరీరసంబంధము లేకపోవుటవలన విజ్ఞానమయాత్మ ఆనందదాయకమని చెప్పఁ బడినది. మఱియు [బహ్మానందమైనను, విషయానందమైనను, కర్మహేతు

వేయగును ; కావున కర్మానుభవ రూపమగు నానంద మచల పరిపూర్ణ రాజ యోగమునందు నుండకూడదు.

4. తుర్యావస్థయందు గుఱుతెఱుఁగు సాక్షీచేతనమురీతి నచలపరిపూర్ణ రాజయోగమునందు నుండకూడదు. అది యెట్లుననగా గాల్చిన లోహపిండము నందు నగ్ని యెట్లావరించుకొని యున్నదో అట్లు లఖండచైతన్య మిశ్రమ రూపమగు నెఱుకయను నంతఃకరణము నావరించుకొని యున్నది. అదియే సర్వమెఱుఁగుచున్నది. మహావాక్య వాక్యార్థ లక్ష్యార్థములను ననుసరించి బ్రహ్మము నేనుగాని అంతఃకరణము నేనుగాను ; అనునిట్టి నిర్ణయము మీఁద తుర్యావస్థ, యోగనిద్ర, శాంభవీముద్ర మొదలగు పద్ధతులు దెలియుచున్నవి. కావున నీ పద్ధతులు నంతఃకరణవృత్తులు కర్మసహితములని నిశ్చయింపఁ బడినవి. అందువలన నచలపరిపూర్ణ రాజయోగమునందు నీ పద్ధతులుండ కూడదు.

5. సహజావస్థ వార్తిక నిర్ణయము అచలపరిపూర్ణ రాజయోగము నందు నుండకూడదు. అదియెట్లుననఁగా క్షరాక్షర పురుషులకు నతీతమైన వాఁడు పురుషోత్తముఁడు., పురుషోత్తముడు తానుగానున్నప్పుడు శ్రవణ, మనన, నిధి, ధ్యాసలెవ్వటికొఱకుఁ జేయవలయును ? మహావాక్యనిర్ణయ మెందు కొఱకు నాచరింపవలయును ? అను పద్ధతి అంతఃకరణోర్ధ్వ పరిణా మమునందుఁ గలుగుచున్నది. దీని సంకుచితమునందు నంతఃకరణ మేర్పడు చున్నది. సర్వారంభమునకు ననఁగా సృష్టిసముదాయమునకు నఖండ చైతన్య మగు నుత్తమ పురుషుఁడు కారణముగా నున్నాడు. మఱియు నఖండ చేతన మగు నుత్తమ పురుషుఁడు కేవల చైతన్య రూపమగు దైవతముగాను, మిశ్రమ రూపమగు జీవునిగాను, మలినరూపమగు తన్మాత్రసముచ్చయ భూతములుగాను, పిండబ్రహ్మాండములుగాను, క్షరాక్షర పురుషులుగాను నుండుటచే నీపద్ధతి ద్వంద్వరూపముగను నేకైకముగను నిర్ణయించి కర్మకు మూలముగా, నుండుటచే నచలపరిపూర్ణ రాజయోగమునందు నీక్రమము ప్రయోజన హీనమని నిశ్చయమగుచున్నది. అచలపరిపూర్ణ రాజయోగము

విర్వాసనా మౌనముగా నుండవలయును. అభ్యాసపరునికి అంతఃకరణము సాధన యందు రెండు విధములుగానుండును.

అంతఃకరణ సహజావస్థ

6. ప్రకృతి స్వరూపము గలిగి సంకల్ప రూపమగు సహజావస్థ గలిగి దాని సహజావస్థలగు జాగ్రత్స్వప్న సుషుప్తి మరణంబులలోనికి పునరావృత్తికి లాగుచుండును. ఇది అంతఃకరణ సహజ పద్ధతి,

(౧) అంతఃకరణ సహజపద్ధతి నిరోధించి విజ్ఞానమయస్వరూప జ్ఞానావస్థయగు పరబ్రహ్మత్వము జెందవలయునని నిర్ణయించినది. అంతఃకరణము యొక్క మొదటిపద్ధతి - ఈ పద్ధతి కోశనిర్ణయముగల సాధకునికే సాధ్యమగును గాని అష్టాంగయోగములవలన మంత్ర, లయ, హఠ, రాజయోగ సాంఖ్య, తారక, అమనస్క మహావాక్య విచారణాదులవలనను వాక్యార్థ, లక్ష్యార్థ, అహంగ్రహోపాసనాదుల వలనను సాధ్యముకాదు. కోశనిర్ణయ పద్ధతిఁ దప్ప నితర పద్ధతులలోఁ గలిగిన ఫలంబులు బురదనీటిలో ప్రతిఫలించిన సూర్యబింబమువలె నుండును.

(౨) చలనరహితమైన ఉత్తమ పురుషత్వ మాత్రముగా నుండి జనన మరణ భ్రాంతి రహితస్థితిని కలుగఁజేయు గమ్యస్థానమగు నచల పరిపూర్ణ పరబ్రహ్మమును వీక్షించుచుండుట రెండవ పద్ధతి.

సాధకుఁడు తన అంతఃకరణ శక్తిపైన నాధారపడినయెడల నితర శక్తులనఁగా విషయేంద్రియములగు తన్మాత్రలును, మలవిక్షేప ఆవరణంబులగు శక్తులును అంతఃకరణమునందుఁ బ్రవేశించి తబ్బిబ్బు నేయుచుండును. అందు వలన నచల పరిపూర్ణ పరస్వరూపుడగు సద్గురునియొక్క శక్తిపైన నాధారపడినయెడల శీఘ్రముగా ఫలము నొందగలఁడు. సూర్యరశ్మికి చీకటి నశించునట్లు సర్వశక్తులు సద్గురుని శక్తిచేత నశింపఁబడును.

సాధనయందుఁ దెలియఁబడిన యానందము సాధన విరమింపఁగనే అంతర్ధానమగును. అట్లగుటకుఁ గారణమేమన నచల పరిపూర్ణ పరబ్రహ్మము బాహ్యాభ్యంతరముల యందున్నదను నిర్ణయములేక అంతఃకరణాధిష్ఠానము

గను, మాయాధిష్ఠానముగను, ఖండాఖండములుగను నిర్ణయింపఁ బడుటచే నెచ్చటిలక్ష్య మచ్చటనే యుండును. కాని సర్వత్రయుండదు. అందువలన యోగానంతర మింద్రియములు స్వేచ్ఛగా తమతమ కార్యముల జరుపుకొనును.

7. సంకల్పంబులకు కేంద్రస్థానమగు నఖండచేతనారహితమునకు నొనర్చు నచల పరిపూర్ణ రాజయోగసిద్ధి దుస్సాధ్యమగును. ఎందుకననఁగా : నింతవరకు నభ్యాసమున నుండునట్లు మిశ్రమ చైతన్యముయొక్కయు, నఖండ చైతన్యముయొక్కయు నైక్యము సుఖపుగా సాధించసాధ్యమగును.

కేంద్రసంకల్ప రహితమే యచలపరిపూర్ణస్థితి. కావున సాధ్యపడుట దుస్తరము వస్తునిశ్చయము గలవానికి నియ్యది సుసాధ్యము.

స్వయంప్రకాశమగు నఖండ చైతన్యాచల పరిపూర్ణ పరబాహ్యమని నిర్ణయముగలదు. ఇది నిజమైన పద్ధతిగాదు. ఎందుచేతననఁగా : జలమువలెఁ దోచు సర్వపదార్థములు త్రాగ నశక్యమైనట్లు నగ్నివలెఁ దెలియు సర్వపదార్థములు దహించుటకు యోగ్యములుగానట్లు; గాజుకుప్పెయందు, స్ఫటికమునందు, మణులయందుఁ, బ్రకాశము గలదు. అది అచల పరిపూర్ణ పరబాహ్యము కాగలదా ! ఇదియునుగాక ప్రకాశవంతమగు ఎఱుక శిరోహృదయమువరకును, ఆపాద మస్తకము వరకును, మితము గలిగియుండును.

అచల పరిపూర్ణ పరబాహ్యము అమితము, సర్వాతీతము, తేజోంధకార రహితము, సనాతనము, అపరిమితము, అనుభవాతీతము, జ్ఞానాజ్ఞాన రహితము.

ఇతర సాధనాంతరములవల్లఁ దెలియు స్వభావమగు ప్రకాశము మనః ప్రాణములనుండి సాధారణ మనస్సునకును, అతీత మనస్సునకును, మధ్య యున్న అఖండ చైతన్య ప్రకాశమైయున్నది. దానిని అచలపరిపూర్ణ పరబాహ్యమనుటకు వీలులేదు.

అఖండచేతనా రహితపద్ధతియందు నచలపరిపూర్ణ పరబాహ్యము దెలియఁబడుచున్నది. ప్రాణమనంబులమధ్య క్షరాక్షర పురుషులమధ్య, నచలపరిపూర్ణ పరబాహ్యము దెలియఁబడదు. అందు తెలియునది **అఖండ**

ఏఱుకయని తెలియనగును. జాగ్రదావస్థయందు యోగసత్తాచేత నణఁగఁ ద్రొక్కఁబడ్డ సంకల్పములు, ప్రాణమనంబులలోఁ జేరి, స్వప్నావస్థయందు విచ్చలవిడిగా సంచరించుచు భౌతిక సంకల్పములు యదేచ్ఛగా నెఱవేర్చుటకుఁ బ్రయత్నించును. కావున స్వప్నావస్థను పూర్తిగా నిరోధింప వలయును.

యోగసిద్ధిఁబడయుటకు ప్రాణమనంబుల చేతన మచల పరిపూర్ణ స్థితియందు సశింపఁజేయవలెను. భౌతిక సాధనములవలన నిరాకాశ పరిపూర్ణ స్థితిఁ బొందజాలము.

సాధకుని స్వభావమునుండి బహిష్కరింపఁబడిన విషయములు దిరిగి దన్ను నావరించకుండ మరలిరాని పద్ధతిగా బాఱఁదోలవలయును. అట్లు నేయుటకు భౌతికము దాని భౌతికవాంఛలను బాఱఁదోలవలయును. ప్రాణము దాని కామవాంఛలను బహిష్కరింపవలయును. మనస్సు దాని సంకల్ప వాంఛలను బహిష్కరింప వలయును. ఇట్లు బహిష్కరింపఁబడ్డ వాంఛలు వానివాని మూలస్థానములలోనికి ననఁగా : సమిష్టి అధిదైవికములో చేరును. తదుపరి నఖండచేతనములోనికిఁ బ్రసరించును. పొగచే నావరింపఁబడ్డ యింటి విధమున అఖండచేతన మావరింపఁ బడుటచే సకల విషయ వాసనలు ద్రవరూపమున నఖండ చేతనము లోనికిఁ బ్రవహించును. నఖండ చేతనా ముఖమున బాహ్య వ్యవహార వృత్తిఁ గలిఁగి మలినచేతనమగు ప్రకృతి సంబంధముగా మనపైకిఁ బ్రసరించును. మఱియు నది కర్మానుభవము గలిగించును.

అందువలన నచల పరిపూర్ణ రాజయోగ పద్ధతివలన వానిని నిర్జీవముగాఁజేసి బహిష్కరించునపుడు ప్రాణము వానికి ఆధారమియ్యకూడదు. అధవా వానికి చోటొసంగిన యెడల కామములోనికి దూకును. తదుపరి మనస్సును స్వాధీనము జేసికొనుటకుఁ బ్రయత్నించును.

మనఃప్రాణంబుల భౌతికవాంఛల విశేషాచల శక్తిచే నిరాధారముగాఁ జేసినయెడల నవి మిశ్రమచేతనమగు సూక్ష్మశరీరమును జొచ్చును. అచట

నుండి తరుమఁబడినయెడల తమఃప్రకాశమగు సుషుప్తిలోనికి మఱియు మరణములోనికి వాసనారూపముగాఁ బరిణమించును. ఇదియొక యావరణము విడిచి మఱియొక యావరణములోనికిఁ బ్రవేశించుటకు కారణమేమనఁగా :

విశ్వప్రకృతిలోనున్న విషయవాసనాచర్యలు వ్యక్తిస్వరూపములో నిరంతరము నివసించులాగునఁ బ్రయత్నము సేయుచుండును. వానిని నీవు శిథిలమొనర్చు పద్ధతినెఱిఁగి నీకుఁ దెలియని మఱుగుననుండి సమయానుకూలముగా, నధికశక్తితో మనపై కివచ్చును. అదిఎట్లనగాఁ : వ్యాధికలవానికి పథ్యము నియమించినయెడలఁ దినుపదార్థముపై నధికవాంఛలు గలుఁగునట్లు అవి అధికశక్తితోఁబై కొనును. అందుచే కటికలంఘణము-పథ్యము-మున్నగునవి నియమించినట్లు మనకు సూక్ష్మరూపముగనున్న యఖండచేతనమును నచల పరిపూర్ణ రాజయోగపద్ధతితో శుద్ధమొనర్చిన నది చాలకాలముండబోక వానియందలి వాసనలతో సమూలముగా నిర్జీవమై నశించును. కావున మనఃప్రాణంబుల మూలమగు పరాచైతన్యమును నిశ్శేషముగా బహిష్కరింపం బడి నిర్జీవమొనర్పవలయును. అట్లుగాక ప్రాణమనంబుల సత్తాచే విషయ వాసనల బహిష్కరింప బడినయెడల నవి పరాచేతనముయొక్క మఱుఁగుజొచ్చి, గొప్ప మహానుభావుడనని యనుకొన్నవారలను భ్రాంతిలోనికి లాగును, భ్రాంతి గలవానిగా జేయును.

నీకు బాహ్యాంతరములయందున్న యచల పరిపూర్ణ పరబాహ్యము అనఁగా : పంచకోశములకు నధిష్ఠానమగు నఖండచేతనముయొక్క బాహ్యాంతరములయందు ముల్లుమోప సందులేక యచల పరిపూర్ణమున్నదని తెలిసినయెడల నఖండచేతనముతోఁబాటు సర్వవర్ణంబులు నిర్జీవములై భ్రాంతియొక్క కూకటివేరుతో కూడా నశించును.

అచల పరిపూర్ణ పరబాహ్యముయొక్క నిర్ణయము. అఖండచేతనా పరిణామమగు మనఃప్రాణంబులపైఁ బ్రయోగించవలయును. ఇట్టి ప్రయోగమువలన నఖండ చేతనముయొక్క అహంవృత్తియగు పశుస్వభావము తక్షణము దెలియఁబడి ప్రాణమనంబుల భ్రాంతివీడి సర్వప్రపంచము తనతో

కూడ యెండమావుల జలమువంటిదని తెలిసికొని అచలపరిపూర్ణ పరబాహ్యా మున్నదనిగాని తాను లేననిగాని నిర్ణయము లేకయుండును.

యోగాభ్యాసులు కొందఱు ప్రాణభౌతిక పద్ధతులలో లీనమైయుండె దరు. వారికి నప్పుడప్పుడు విజ్ఞానమయ మనస్సునుండి అఖండచేతనము యొక్క పరిపూర్ణస్థితి పిచికల చందమువలెఁ దెలియుచుండును. అది స్థిరము గాదు. అన్నమయాది సాధనాంతరము విజ్ఞానమయాధిష్ఠానా ఖండచేతనము దాటినవారికే అచల పరిపూర్ణ పద్ధతి శాశ్వతముగా నుండును.

మంత్ర, లయ, హఠ, రాజయోగములును; వీని యంగములగు యమ నియమాదులగు సాంఖ్యతారకామనస్క అహంగ్రహోపాసన, మహా వాక్య వాక్యార్థ లక్ష్యార్థ శ్రవణ, మనన, నిధిధ్యాసాదులును; జననమరణ భ్రాంతి రహితమునకు సక్రమములైన పద్ధతులు కావు. మఱియు భ్రాంతి రహితమునకు బదులుగా చిక్కుపరిస్థితులలో ముంచుచున్నది. ఎట్లనగా : సాధనయందలి సర్వపద్ధతులు అఖండచేతనమగు అజ్ఞాన రూపమగు నావర ణతోఁ గూడుకొని అధోలోకమునకు తీసికొని పోవును. మఱియు ఆధుని కాత్మ పరిశోధన శాస్త్రపద్ధతి కేవల బాల్యావస్థలోనున్నది. అదెట్లన సర్వ జగత్తును నిర్వచనముచేయు మనస్సును సంకుచిత పఱచవలయునను నిర్ణ యము ఆధునిక పద్ధతులయందు నిర్ణయించియున్నారు. ఇందువలన మనస్సు మలినత్వము బొందును.

మానవ స్వభావములో నఖండచేతన మన్నిఁటికంటే నెక్కువభాగము నాక్రమించుకొని యున్నందున మానవుని బాహ్యచర్యలు ప్రాణమనంబుల సత్యాసత్యములు నఖండచేతనమునందు నున్నవి. కావున వాని నాధిక్యతకు ప్రయత్నించవలయునుగాని మనఃప్రాణముల సంకుచితములకు ప్రయత్నించ కూడదు. ఎందుకనగా : నీ అన్నమయకోశము వెనుక ప్రాణమయకోశ మున్నది. దానివెనుక మనోమయ కోశమున్నది. దానివెనుక విజ్ఞానమయ కోశమున్నది. దానివెనుక నానందమయ కోశమున్నది. దానివెనుక హిర ణ్మయ కోశమున్నది. ఇట్లు నీకు బాహ్యమున భౌతికమువెనుక మహా ప్రాణము, దానివెనుక మహామనస్సు, దానివెనుక కేవల చైతన్యము, దాని వెనుక నఖండ చైతన్యమున్నది. కావున నూర్ధ్వభాగముగా నున్న పరా

చేతనమునకు నీయందలి విజ్ఞానమయమునకు నేకత్వమువలన మనఃప్రాణంబు లఖండ చేతనమందు వ్యాపకత్వమునొంది వికాసవంతము లగును. దానివలన నీవు ముక్తిని బడయగలవు. ఇతర మార్గములవలన ముక్తి బడయుటకు బదులుగా బోనులోఁజిక్కిన యెలుకవలె యోగాభ్యాసకుడును, తేనెలో బడిన ఈగవలె నహం బ్రహ్మాస్మి యను బ్రహ్మవేత్తలును, గంభీరమగు నదుసులో బడిన మానవునివలె కర్మిష్ఠులును, అధోగతి బొందగలరు.

తెలిసియుఁ దెలియని విజ్ఞానము నిజమైన మోక్ష మార్గమునకు గొప్ప యాటంకముగా నుండును ఎట్లనగా ; నన్నింటికి నాధారముగానున్న అఖండ చేతనము, మఱియు నుత్తమ పురుషుడు కాని మలినచైతన్యము కాదు. కమలోద్భవమునను సరించి బురదమట్టి యందు విమర్శించిన యెడల దాని నిర్ణయము దెలియజాలదు. కమలోద్భవమునకు పూర్వమునందు మాతృప్రాయమైన వెలుఁగులోఁగూడి శాశ్వతముగా విరాజిల్లుచున్న ఊర్ధ్వ కమలముయొక్క రహస్యము దెలిసినవాఁడే యీ పృధ్వీకమలముయొక్క గురుతుఁ దెలియఁగలడు.

ఆరీతిగనే నఖంత చేతనముయొక్క రహస్యము దెలియక దాని పరిణామరూపమగు భౌతిక ప్రాణమనంబులందు భ్రాంతిచెంది వాని పద్ధతివలన మోక్షము గలుగ గలదని యాసన, ముద్ర, లక్ష్య అభ్యాసాదులను జేసిన యెడల భ్రాంతిలో జిక్కి భ్రాంతి రహిత పద్ధతికి దూరస్థుఁడగుచున్నాడు.

వస్తునిర్ణయము పూర్ణముగా విభజించి తెలిసికొననిదే ఆత్మ తత్త్వ విభాగము శాస్త్రజ్ఞులు తమ యిష్టానుసారము నిర్ణయము జేసికొనిన పద్ధతి అంధకారముగా నుండును. ఎందుకనఁగా !

శ్రుతి "బ్రహ్మసత్యమ్, జగన్మిథ్య" అనున్యాయమునందు సత్యబ్రహ్మమును దెలిసి తదనంతరము మిధ్యాజగత్తును దెలియవలెను. అట్లుగాక అసజ్జగమును ముందుగాఁ దెలిసి తదనంతరము సత్యబ్రహ్మమును తెలిసినవాఁడు అసత్యపు వర్తనుడే కాగలడు. సత్యబ్రహ్మమును ముందుఁగా దెలిసి అసత్యపు ప్రపంచమును దెలిసి విమర్శించి విడుచువాడు జననమరణ భ్రాంతిరహితమవలీలగా బొందగలఁడు.

నేను అన్నియోగములకంటే నతిశమగు నచలపరిపూర్ణ రాజయోగ మునందున్నవాడను, త్రికరణశుద్ధిః గలవాడను, నాకు ననుకూలమగు కొన్ని కార్యములు సంకల్పించితివి. అది నాకు యెందుకు సిద్ధించకూడదు : గొప్ప ప్రతిష్ఠలు నేనెందుకు బొందకూడదు : దానికి ననుకూలమగు సౌఖ్యము లెందుకు ననుభవింప కూడదు : అని యిట్లు తలంపరాదు. అట్లు తలంచినంత మాత్రమున నచల పరిపూర్ణ స్థితి భంగమై సాధకుని నధోగతిః బొందించును. కావున జననమరణ భ్రాంతి రహిత పరమ సంతోషమునందు నిరంతరము నివసింపవలయును.

## స్థూల దేహ నిర్ణయము

### భూతాకాశం - పృధ్వీభువనము

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశం | వాయువు | అగ్ని | ఉదకం | పృధ్వి |
| కామం | ప్రసరణం | నిద్ర | శ్లేష్మం | రోమాలు |
| క్రోధం | చాంచల్యం | సంగమం | శుక్లం | త్వక్కు |
| లోభం | అతిగమనం | క్షుధ | రక్తం | మాంసం |
| మోహం | భ్రమణం | తృష్ణ | మూత్రం | నాడి |
| భయం | ఆకుంచనం | ఆలస్యం | మేధస్సు | అస్తులు |

### స్థూల దేహ లక్షణము

స్థూలదేహము, నేత్రస్థానము, సార్ధత్రయహస్త ప్రమాణం, తామ్ర వర్ణం, విశ్వాభిమాని. జాగ్రదావస్థ, రజోగుణం, విపరీతజ్ఞానం, దృశ్య రూపం, స్థూలభోగం, అకారమాత్రుక, ఋగ్వేదం, వైకరి వాక్కు, పంచ భూతమయం, పంచవింశతి తత్వాత్మకం, భూమి తత్వంభూమియొక్క ప్రత్యేక కళలు. ౧. ఉత్పత్తి. ౨. జాగ్రత. ౩. బోధ. ౪. వ్యాపారము. యీ నాల్గు పృధ్వియొక్క కళలు.

## సూక్ష్మదేహ నిర్ణయము

భూతాకాశం - జలభువనము

| ఆకాశం | వాయువు | తేజస్సు | జలం | పృధ్వి |
|---|---|---|---|---|
| అంతఃకరణ | వ్యానం | శ్రోత్రం | శబ్దం | వాక్కు |
| మనస్సు | సమానం | త్వక్కు | స్పర్శ | పాణి |
| బుద్ధి | ఉదానం | చక్షువు | రూపం | పాద |
| చిత్తం | ప్రాణం | జిహ్వ | రసం | గుహ్యం |
| అహంకారం | అపానం | ఘ్రాణం | గంధం | పాయువు |

సూక్ష్మదేహ లక్షణం

సూక్ష్మదేహము. కంఠస్థానము, అంగుష్ఠమాత్ర ప్రమాణం, శుక్ల వర్ణం, తైజసుడభిమాని, స్వప్నావస్థ, సత్వగుణం, అన్యదాజ్ఞానం, దృష్ట రూపం, ప్రవివిక్తభోగం, ఉకారమాత్రక, యజుర్వేదం, మధ్యమవాక్కు, అపంచీకృతమయం, జలతత్వం, మనోవికారం, జలముయొక్క ప్రత్యేక కళలు. ౧. సాదృశం ౨. అసాదృశం, ౩. యాదృశం, ౪. తాదృశం, యీ నాల్గు జలకళలు.

## కారణ దేహ నిర్ణయము

### భూతాకాశం - తేజభువనము

| ఆకాశం | వాయువు | తేజస్సు | జలం | పృథ్వి |
|---|---|---|---|---|
| అవకాశం | భ్రాంతి | గూఢం | మృదుత్వం | మూర్తత్వం |
| విస్మృతి | శంక | రూఢం | పోషణత్వం | శబలత్వం |
| ఆవరణం | శోషణం | కృతజ్ఞత | విశదత్వం | లజ్జ |
| నిరావరణం | శిధిలీకరణం | అవిచారం | క్లేదనత్వం | పిండీకరణం |
| అప్రమాణం | ధీరత్వం | సంశ్లేష | ధారణత్వం | కాఠిన్యత |

### కారణ దేహలక్షణము

కారణదేహం, హృదయస్థానం, అంగుష్ఠార్ధ ప్రమాణం, కృష్ణవర్ణం, ప్రాజ్ఞుడభిమాని, సుషుప్త్యవస్థ, తమోగుణం, అజ్ఞానస్థానం, దృశ్యరూపం, ఆనందభోగం, మకారమాతృక, సామవేదం, పశ్యంతివాక్కు, తేజోమండలం, తేజస్తత్వం, అగ్నియొక్క ప్రత్యేకకళలు ౧. మరణం, ౨. విస్మృతి, ౩. మూర్ఛ, ౪. నిద్రా, యీనాల్గు అగ్నికళలు.

## మహాకారణ దేహ నిర్ణయము

### భూతాకాశం - వాయుభువనము

| ఆకాశం | వాయువు | తేజస్సు | జలం | పృథ్వి |
|---|---|---|---|---|
| పూర్ణత్వం | అఖండత్వం | అదాహ్యత్వం | అక్లేద్యత్వం | అశోషత్వం |
| అసంగత్వం | అభేదత్వం | ఊర్ధ్వపదత్వం | జగజ్జీవత్వం | కారణత్వం |
| వ్యాపకత్వం | పరాత్పరత్వం | ప్రకాశత్వం | పరంజ్యోతిత్వం | పావనత్వం |
| సర్వబీజకత్వం | నిర్మలత్వం | చైతన్యత్వం | అమృతత్వం | సమృధ్యత్వం |
| అఖండత్వం | అజరత్వం | అనర్ఘ్యత్వం | కారుణ్యత్వం | సర్వాధారత్వం |

### మహాకారణ దేహ లక్షణము

మహాకారణదేహము, మూర్ధ్నిస్థానము, వసుదామాత్ర ప్రమాణం, నీలవర్ణం, ప్రత్యగాత్మ అభిమాని, తుర్యావస్థ, సగుణం, వివేకజ్ఞానం, దృష్టరూపం, వైభోగిక భోగము, అర్ధమాతృక, అధర్వణ వేదం, పరావాక్కు, వాయుమండలం, వాయుస్తత్వం, వాయువుయొక్క ప్రత్యేక కళలు. ౧. వైరాగ్యం, ౨. ముముక్షుత్వం, ౩. ఆత్మత్వం పదదర్శనం, ౪. తుర్యావస్థ, యీనాలుగు వాయువు కళలు.

## కైవల్య దేహనిర్ణయము

### మహాకాశం - భూతాకాశ భువనము

| నిర్విషయ అంతఃకరణాలు | నిర్విషయ సమానాదులు | నిర్విషయ రూపాదులు | నిర్విషయ రసాదులు | నిర్విషయ గంధాదులు |
|---|---|---|---|---|
| మహాకాశం | ఆత్మారామత్వం | స్వయంజ్యోతిత్వం | పరామృతత్వం | భేదాభేదాతీతత్వం |
| దహరాకాశం | అనామృత చైతన్యత్వం | పరంజ్యోతిత్వం | సమరసత్వం | అభేదా భేదత్వం |
| నిరవయాకాశం | చిదీశ్వర భావ ముఖిం లీనత్వం | జ్యోతిర్మయత్వం | శతామృతత్వం | భేదాభేదత్వం |
| సూర్యాకాశం | సత్యజ్ఞానమనంత లక్షణపరత్వం | ఆపోజ్యోతిత్వం | అమృతత్వం | అఖండత్వం |
| ధూరాకాశం | అంతర్బాహ్య స్ఫూర్తిరహితత్వం | జగజ్యోతిత్వం | బోధామృతత్వం | ద్వయత్వం |

### కైవల్య దేహలక్షణము

ఆకాశ, వాయు, అగ్ని, జల, పృధ్వి లీలసూచనలు. కైవల్య దేహము, నిర్గుణము అద్వితీయమునందు కననగును. యిది అనుభవనీయము.

### స్వస్తికాసనము

సూక్ష్మ శరీరము నందలి ప్రాణవాయు ధర్మములు. చాచుట, దాటుట, నడుచుట, పరుగుట, తిరుగుట యనుస్థూల శరీర ధర్మములై శరీర పీడఁ గలిగించుచున్నవి. ఇవి కారణశరీరమందు జడలిక, మందము, నిద్ర, ఆయా

సము గలిగించుచున్నవి. ఇట్లు వ్యష్టిరూప శరీర ధర్మములు సమష్టి రూప మగు స్వప్రకాశ కేవలాత్మలోఁ జేర్చిన రూపరుచున్నవి. ఈ కేవలాత్మ నేనను నిశ్చయము సుఖాసనమగు స్వస్తికాసనముగా జెప్పఁబడును. కావుననే శ్రీ భాగవతుల కృష్ణదేశికులు "ఎఱుకే సర్వము నేనేఁజిగి చెప్పితి" నని యిట్లు వక్కాణించిరి.

## సిద్ధాసనము

పుట్టుట, పెఱుగుట, తఱుగుట, చచ్చుట యను పద్ధతిలేక సర్వకాల సర్వావస్థలయందు నేకరూపముగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమును దెలిసి కొని దానికన్న నితరమగు నేపదార్థము లేనేలేదను నిశ్చయము, పరిపూర్ణ మున్నదనే నిశ్చయము లేకయుండుట సిద్ధాసనమనఁబడును.

## మూలబంధము

అష్టవిధ ప్రకృతోపాధులకు మూలకారణమై సకలమునకు సాక్షిగా నున్న చైతన్యబ్రహ్మమును నచలపరిపూర్ణ పరబ్రహ్మముయొక్క పద్ధతిచే నుపాధిరహితము చేయుట మూలబంధమనఁబడును.

## ప్రాణాయామము

పిపీలికాదిబ్రహ్మ పర్యంతము తన స్వరూపమేయని సద్గురుమూర్తి బోధచే నెఱిఁగి వస్తునిశ్చయ జ్ఞానము కలిగియుండుట పూరకమనియు, నచల పరిపూర్ణ పరబ్రహ్మ నిర్ణయము, కుంభకమనియు, నచల పరిపూర్ణ పర బ్రహ్మము దప్ప నితర పదార్థమెద్దియు లేదనుభావము రేచకమనియు జెప్పఁ బడును.

## ధ్యానము

జీవేశ్వర జగదోపాధులకుఁ గారణమైన స్వప్రకాశచేతన బ్రహ్మ మచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు ద్రవరూపమగు నెండమావుల జలము వంటిదని గురుబోధచే నెఱిఁగి సర్వకాల సర్వావస్థలయందు వస్తునిశ్చయము గల్గి తన్నిశ్చయమందు స్థిరత్వమెల్లప్పుడు నుంచుట ధ్యానమని చెప్పబడును.

## ధారణ

హిరణ్మయ కోశమునందును, దాని యావరణమగు నానందమయ కోశమునందును, దాని యావరణమగు విజ్ఞానమయ కోశమునందును, దాని యావరణమగు మనోమయ కోశమునందును, దాని యావరణమగు ప్రాణమయ కోశమునందును, దాని యావరణమగు నన్నమయ కోశమునందును, వ్యష్ట్యన్నమయావరణమగు సమష్ట్యన్నమయ కోశమందును, సమష్ట్యన్నమయ కోశాంతరమగు సమష్టి ప్రాణమయ కోశమందును, సమష్టి ప్రాణమయ కోశాంతరమగు సమష్టి మనోమయ కోశమందును, సమష్టి మనోమయ కోశాంతరమగు సమష్టి విజ్ఞానమయ కోశమందును, సమష్టి విజ్ఞానమయ కోశాంతరమగు సమష్ట్యానందమయ కోశమందును, సమష్ట్యా నందమయ కోశాంతరమగు సమష్టి హిరణ్మయ కోశమునందును నీ సర్వమునకు మూల కారణమగు నధిష్ఠాన చేతనబ్రహ్మముయొక్క యంతర్బాహ్యములయందును బరిపూర్ణ మున్నదియను నిశ్చయము ధారణ యని చెప్పఁబడును. సద్గురు కృపాకటాక్షముచే వస్తునిశ్చయజ్ఞానము కలిగి ధారణ యొనర్చు మానవుని సర్వకోశములు మహావాయువుచే జలము శోషింపఁజేయబడిన మేఘసందోహంబుల మాడ్కి నిర్జీవంబులై యుండును. కాని కేవలభావనా మాత్రముచే నాకోశావరణ రహితత్వ మెంతమాత్రముగాఁజాలదు.

## సమాధి

ధారణ స్థితియందభ్యాసకున కెంతటి స్థిరత్వము గల్గునో యంతటి యచలస్థితి దృఢపడును. అట్టి నిశ్చలస్థితియే సమాధియనఁబడును.

## అభావత్రయ నిరూపణము

దేహాభావ, మనోఽభావాత్మాఽభావములని యభావములు మూఁడు విధములు.

## దేహాభావము

చరాచరరూప స్థావర జంగమాత్మక ప్రపంచ[illegible] పంచభూత సముదాయమని తెలియవలయును. అందువలన నంతఃకరణము బాహ్యరూప వ్యాప

కత్వము నొందును. ఇంద్రియంబులును నింద్రియాధిష్ఠాన దేవతలును మనో వృత్తితోఁ గూడినవారై ప్రత్యగాత్మయందు శుద్ధప్రధానులై పరిణమింతురు. అందుచేత బాహ్యప్రపంచమంతయు బయలై తానేయగును. కావున దేహ మప్పు డభావమగును.

### మనోఽభావము

ప్రత్యగాత్మయందు శుద్ధప్రధానముగాఁ బరిణమించిన యధిదేవతా స్వరూపములు పరమాత్మరూపమగు నఖండాకారము బొందుటచే మనోలయము గల్గును. దీనినే మనోఽభావమనియుఁ జెప్పఁబడును.

### ఆత్మాభావము

ఏకవృత్తియగు నధిష్ఠానచేతన స్వప్రకాశ బ్రహ్మమచలపూర్ణ పర బాహ్యమందు ద్రవరూప మృగతృష్ణ జలమువంటిది యని తెలియుట యాత్మా భావమని చెప్పఁబడును.

### కాలాతీతపద్ధతి

కాలమునకులోనై చిగుళ్ళు, మొగ్గలు, ఆకులు, పువ్వులు, కాయలు, పండ్లు, మొదలగునుపాధులు (వృక్షములకు) గల్గుచున్నవి. ఇట్లే జరాయు జాండజాది యుపాధులుగూడఁ గాలానుసరణములై యుత్పత్తిల్లుచున్నవి. వీనిని గాలనిర్మితముగాఁ బ్రవర్తింపఁజేయుటకుఁ బంచాది దేవతలు నిర్మింపఁ బడియున్నారు. వీరికి వీరికర్తృత్వము తెలియఁజేయుటకు సరిఁగా గురితింపఁ జేయుటకు నధిష్ఠానరూపమగు స్వప్రకాశబ్రహ్మము కారణముగా నున్నది. అధిష్ఠానబ్రహ్మము వల్లనే పిపీలికాదిబ్రహ్మ పర్యంతము బాహ్యాంతర వ్యవహారములు జరుగుచున్నవి. దీనికి నతీతముగా నున్న నచలపరిపూర్ణ పరబ్రహ్మమునందు నధిష్ఠానచేతనసత్తా నశింపఁజేసినవారు, కాలాతీతులు, కావున వీరికిఁ గాలరూపమైన యుత్పత్తి స్థితి లయరూప వ్యవహారము లుండవు.

### అశరీర నిర్ణయము

ప్రశ్న:- అచలపరిపూర్ణ పరబాహ్యమును మూలములేని గుర్తెఱుగు శరీరమును దెలిసి యీ రెండిటి నిర్ణయములేని పరిస్థితిగల పురుషునియొక్క లోకవ్యవ హారము హానిఁజెందవలయునా ? చెందఁగూడదా ?

ఉత్తరము:— అచలపరిపూర్ణ పరబ్రహ్మమునకును మూలములేని గుర్తు నెఱుఁగుశరీరమునకు నేలాటిసంబంధము లేదని తెలియుటమాత్రమే యశరీర స్థితి. కాని యెరుక యెండమావుల వంటిదని తెలియఁగనే ప్రపంచరూపమగు జీవేశ్వర జగత్తు స్వయముగ బొలియుచున్నది. దీనికై యెచ్చటికి బోనవసరము లేదు. తానేకొండగుహలయందుఁ బ్రవేశించియుండి దేనియందును లయము గానవసరములేదు.

శాశ్వతాశాశ్వత నిర్ణయములేక యెండమావుల రూపమున నున్న యీ గుర్తు నెఱుఁగు శరీరము స్వయముగా శూన్యమైనది. కావున లయముగాని, ధ్వంసముగాని దానికి నెచ్చటినుండి గలుగ గలదు? భ్రాంతి మాత్రముగా నున్నట్లు తోచుటయేగాని వాస్తవముగా లేదు. కాబట్టి లోక వ్యవహారమున కును, ప్రపంచస్వరూపమునకును హానిగలుగవలెనను నిర్ణయము సరికాదు.

ప్రశ్న:- మూలములేని గుర్తు నెఱుఁగు శరీరము మృగతృష్ణవలె భ్రాంతియని తెలిసికొనినపిమ్మట నెఱుక సామగ్రియగు గృహారామ క్షేత్రదారా పుత్ర ధనకనకవస్తువాహన వితానము నాది నీది యని దానియందు సత్యత్వ జ్ఞానము గల్గియుండుటవలననే లౌకిక వ్యవహారము జరుగుచున్నది. ఇది భ్రాంతి యెట్లగును?

ఉత్త:- పారమార్థిక పద్ధతియందు సత్యాసత్య వస్తునిర్ణయ మవసరము గాని లౌకిక వ్యవహారములందు వస్తువుయొక్క సత్యాసత్య నిర్ణయముతోఁ బనిలేదు.

అసత్యములని సర్వానుభవసిద్ధములై యున్న స్వప్న పదార్థంబులు నే బొందఁగంటిని యనియు, నింద్రజాలకుఁడొనర్చు కార్యములందు విత్తనము లందు వృక్షములేర్పడుటయు, వృక్షములనుండి ఫలములు ఫలించుటయు నేను జూచితిననియు స్వయముగా ననుభవించితిననియు నిట్టి వ్యవహారములు జరుగుచున్నవి. కావున స్వరూపనిర్ణయమే వ్యవహారమునకవసరముగాని వస్తువు యొక్క సత్యాసత్య నిర్ణయము వ్యవహారమునకు నవసరములేదు.

## వస్తువుయొక్క సత్యాసత్య నిర్ణయము :

ప్రశ్న :- అన్నమును నాకలికొఱకుఁ దినుచున్నాము. కావున అన్నము సత్యమా ? అసత్యమా ?

ఉత్త :- ఆకలి బాధతీర్చుచున్నది. గావున నన్నమసత్యపదార్థమని యనఁజాలము. తిరుగా నాకలి గలుగుచున్నది. కావున నన్నము సత్యపదార్థమని చెప్పుటకు వీలుకాదు. కాబట్టి వస్తువుయొక్క స్వరూప విన్ణయమేగాని వస్తువుయొక్క సత్యాసత్య నిర్ణయము లేదు. అట్లే నీరు దప్పిని నివర్తింపఁజేయుచున్నది. అది సత్యమా ? యసత్యమా ? యని ప్రశ్నింపఁగా మఱల దప్పిక కొంతసేపటికిఁ గల్గుచున్నది. కావున జలము సత్యపదార్థమని నిర్ణయించుటకు వీలులేదు. అదేవిధమున జ్ఞానేంద్రియము లచేఁ దెలియు విషయపంచకము కర్మేంద్రియములచేఁ దెలియు కర్మానుభవ మంతఃకరణమందలి సర్వవిషయంబులు స్వరూప నిశ్చయముద్వారా జరుగునే కాని వస్తువుయొక్క సత్యాసత్యంబు లశరీరునకుండవు. సశరీరికి వస్తు సత్యాసత్య నిర్ణయముండును.

ప్రశ్న :- చిత్తనిగ్రహములేక చిత్తవినాశనము కాబోదు. కావునఁ చిత్త నాశనము కానిది తత్వజ్ఞానము కలుగదు. అందుచేత వ్యవహార మూలమగు చిత్తవినాశము తత్వవేత్తయగు వాడవశ్యముగా జేయవలెనా ? లేదా ?

ఉత్త:- చిత్తము బాహ్యమందుఁ బ్రవేశింపఁ బెట్టినందున నది విషయ పంచకమందుఁ జేరును. అంతరమందు దానిని విగ్రహించిన జడత్వము నొందును. ఘటము నెదుటనుంచి చూపునపుడు ఘటము చూచుట కాపట నిశ్చయ జ్ఞానము కలుగుటకుఁ జిత్తనిగ్రహ మెట్లులవసరము లేదో యట్లే యచలపరిపూర్ణ పరబ్రహ్మమును రూపనామక్రియాత్మకమగు నెఱుకను వస్తునిశ్చయముగా [illegible] దెలిసికొన్న వారికిఁ జిత్తము తదధిష్ఠానమగు నెఱుక యగును అనఁగా [illegible]కగా నది పరిణమించును. కావునఁ జిత్తనిగ్రహము, చిత్తవిధ్వంసము నొనర్చుకొను ప్రయత్నమవసరములేదు. చిత్తవిధ్వంసాత్మిక

ముచే లౌకిక వ్యవహార హాని గలుగునని శంకింపవలసిన యవసరమప్పు డుండదుగదా ?

ప్రశ్న :- ఘటము చేతితోఁ జూపుటకు సాధ్యమగునట్లు నచలపరిపూర్ణ బాహ్యము చేతితోఁ జూపుటకు సాధ్యముగాదు. కావునఁ బై దృష్టాంతము దార్ష్టాంతికమందుఁ బనికిరాదు గదా ?

ఉత్త :- అచల పరిపూర్ణ బాహ్యమును దెలియుట యసాధ్యము. ఘట మఠాదులఁ దెలియుట సాధ్యము. అనునిట్టి నిశ్చయము భ్రాంతి మాత్రమే యగును. "సూర్య చంద్ర నక్షత్రాదులు కదులుచున్నవి. హిమా లయ పర్వతాదులు కదులుటలేదు." అని యెవరంతటవారే నిశ్చయించి చెప్పఁగలుగునట్లు జీవేశ్వర జగదోపాధికిఁగారణమగు నెఱుకను, నచల పరి పూర్ణ పరబాహ్యమును నెంతటి యమాయక ప్రజానీకమునకుఁ జూపించినను దక్షణమే "యెఱుక చలించునది. అచలము చలించనిదని తనంత తానే నిర్ణ యించిచెప్పును. కావున నీక్రమము తెలియుటకు నేయింద్రియ నిగ్రహ మవ సరములేదు. లౌకిక వ్యవహారము కేవల రూప నిర్మితముగా నొనర్పఁబడును. అందువలన వస్తువుయొక్క సత్యాసత్య నిర్ణయ మవసరములేదు.

ప్రశ్న :- భ్రాంతి రహితాచల పరిపూర్ణ స్థితికిఁ బూర్వమనఁగా భ్రాంతిరహిత పద్ధతి తెలియక పూర్వము లౌకిక వ్యవహారములెట్లు జరుగుచున్నవో భ్రాంతి రహిత పద్ధతి తెలిసికొనిన యనంతరంగూడ నెట్టి తరుగు విరుగులు లేక లోక వ్యవహారము జరుగుచునేయున్నది. కావున భ్రాంతి తొలఁగినట్టు లెట్లు నిశ్చయమగును ?

ఉత్త :- భ్రాంతి సహిత వ్యవహారమునఁ జేయఁబడు సర్వకర్మలు తానును బ్రకృతియు వేరువేరుగా నుండి చేయుచున్నామనియుఁ, దానును బ్రకృతియు నేకముగానుండి చేయుచున్నామనియుఁ, బ్రకృతి పురుష నిర్ణయ ములేక సర్వము బ్రహ్మవల్లనే జరుగుచున్నదనియు, నెన్ని భేదాభిప్రాయ ములున్నను జ్ఞానేంద్రియములచే విషయ పంచకము తెలిసి కర్మేంద్రియము లచేఁ గర్మ నాచరించి దానివలన సంభవించు ఫలము బీజ రూపమునను, వాసనా రూపమునను నంతఃకరణమునందుఁ బ్రవేశించి కాలాను గుణ్యము

బీజములు మొలకలెత్తినట్లు కర్మ ఫలములు కర్మాను గుణ్యముగా జన్మము లందు నెరుక పడుచుండును.

భ్రాంతి రహిత పద్ధతియందుఁజేయు సర్వకర్మములెట్లు జరుగుననఁగా నింద్రజాలికుఁడు చేయు సర్వకర్మ స్వరూపములు స్వప్నమునందుఁ దోఁచు సర్వ వ్యవహారములు రూప నిర్మితములగానుండి వస్తు సత్యత్వమెట్లులేదో యట్లు భ్రాంతి రహితుఁడుచేయు సకల వ్యవహారంబులు రూప నిర్మితములే కాని వస్తు సత్యత్వ రహితములగును. పిపీలికాది బ్రహ్మ పర్యంతరము సర్వోపాధులకు మూలమెఱుక. ఎఱుకలేనిది యేదికూడ నిర్ణయముండఁ బోదు. కావున నిర్ణయ రూపకమగు నెఱుక యెండమావుల వంటిదనియు, నిజముగా వస్తు సత్యత్వముగాదనియు నిర్ణయమైయున్నందున జ్ఞాన కర్మేం ద్రియములచే విషయ పంచకమున జరుగు కర్మములయందు నంతఃకరణ పరి ణామమగు విరాట్టు—హిరణ్యగర్భ—అవ్యాకృత—పరమాత్మ స్వరూపముల యందుఁ గేవల రూపమాత్ర నిర్మితములేకాని వస్తు సత్యత్వముండఁబోదు. కాఁబట్టి య శరీరపద్ధతి రూపమాత్ర నిర్మితమునందు లౌకిక వ్యవహారముం డును. వస్తువునందు సత్యాసత్య నిర్ణయముండదు. విషయ పంచకమందుఁ గలుగునట్టి పద్ధతికి వాని యునికికి నంతఃకరణమందు సాధకుడు స్థాన మియ్యఁడు. అతఁడస్త్ర శస్త్రములకు హతముగాఁడు; చలికి వణకఁడు; భయమున కులికిపడి మరణముచెందఁడు. పునర్భవ మొందఁడు. స శరీరిగా నున్న వాఁడు రూప నామ క్రియాత్మకమగు ప్రతి పదార్థమందును సత్యత్వ బుద్ధి యుంచి దానిని నంతఃకరణమందు శాశ్వత పద్ధతిగా నెలకొల్పును. దాని యశాశ్వతమునకుఁ జింతాక్రాంతుఁడై తిరుగా దాని సంపాదనకుఁ బ్రయ త్నించును. కావున భ్రాంతి రూప పునర్జన్మను బొందుచుండును.

## అన్నమయ పురుష యోగము

వృక్షాది, స్థావర శరీరంబులు, మనుష్యాది జంగమ ప్రాణులకు నన్న మగుచున్నది. మనుష్యాది జంగమ శరీరంబులు సింహశార్దూలాది ఘోర మృగంబులకు నన్నమగుచున్నది. అన్నమువలన శుక్ల శోణితంబులు గలుఁచున్నవి. వాని వలన స్థూలశరీరము లేర్పడుచున్నవి. అన్న పరిణామ

మగు పాలవలన శిశువులు పెరుగుచున్నారు. అన్నమువలన వృద్ధిఁ బొందు చున్నారు. మరణించిన పిదప అన్నరూపమగు పృథివ్యాది పంచభూతముల యందు శరీరోపాథ్యంశంబులు చేరుచున్నవి. అన్నమయకోశము అన్నము వలనఁబుట్టి అన్నమునందే పెఱిగి అన్నమునందే లయించుచున్నది. కావున దీనికి నన్నమయకోశమని పేరు కలిగినది.

అగ్నియొక్క సూక్ష్మభాగమగువాక్కు ధ్వన్యాత్మక వర్ణంబులచే ధర్మ రక్షణ జరుగు చున్నది. కావున వర్ణమూలమగు శబ్ద మన్నమయమని చెప్పఁ బడును.

జలముయొక్క సూక్ష్మభాగమగు ప్రాణధర్మము. ఆకలి దప్పి అను భేదములలో నున్నది. వాని రక్షణ మనోనిర్మితమగు సంకల్పముచేఁ జరుగు చున్నది. కావున మనస్సు అన్నమని చెప్పఁబడుచున్నది. అన్నరూపమగు మనస్సు నన్నరూపమగు వాక్కు నన్నరూపమగు శరీరము ఈ మూడింటి చేరికకు నన్నమయకోశమని వ్యవహారము.

సూర్యునియొక్క కిరణంబులచే తామరలు రక్షింపఁబడునట్లు జగచ్చ క్షువుయొక్క అధిష్ఠానరూపమగు నాదిత్యునిచే ననఁగా, సమష్ట్యంతఃకరణ ముచే సకల జీవోపాధుల యంతఃకరణంబులు రక్షింపబడుచున్నవి. స్థావర జంగమాత్మకమగు సర్వమునకు నాదిత్యుఁడు అన్నరూపుఁడు.

స్వర్గమునందలి తేజోమయమగు నాత్మ ఆదిత్యునిచే నాకర్షింపంబడి మేఘమండలముద్వారా వర్షరూపమున భూమియందు నోషధులుగాఁ బరిణ మించి అన్నరూపమున శుక్ల శోణితములద్వారా జీవపద్ధతులలో స్త్రీ పురుష రూపంబునఁ బరిణమింపజేసి జ్ఞానకర్మేంద్రియములద్వారాచేయు కర్మవ్యవస్థచే ఎనుబదినాలుగులక్షల జీవ యోనులయందు నుత్పత్తి స్థితిలయములు గలుగఁ జేయుచున్నవి. ఎనుబది నాలుగు లక్షలెవ్వియెవ్వియనఁగా శ్రుతి, ప్రమాణము.

శ్లోకము : స్థావరోలక్ష వింశత్యాత్, జలజానవలక్షకం । క్రిమీణాం రుద్రసంఖ్యాశ్చ, చాతుర్లక్షందమానుషాం । త్రింశల్లక్షగవానాంచ పక్షీణాం । దశలక్షనం॥ అను (ఉపశ్రుతి) స్థావరములు, 20 లక్షలు. వీటియందుఁ

బుట్టినవి 9 లక్షలు. క్రిములు 11 లక్షలు. మనుజులు 4 లక్షలు. 30 లక్షలు ఆవులు గేదెలు మొదలైన పశుగుణము. పక్షులు. 10 లక్షలు. వెరశి 84 లక్షలు.

కావున జ్ఞానకర్మేంద్రియములచే విషయపంచకమునందున్న జీవుని రక్షించి తన స్వరూపమునందుఁ జేర్చుకొనును. అందుచే నధిష్ఠాన రూపమగు స్వప్రకాశచేతన బ్రహ్మనిర్ణయమే అన్నమయ పురుషయోగమని జెప్పబడును.

## అన్నమయ పురుషయోగ సిద్ధి

అన్నరూపమగు స్థూలశరీరము, అన్నరూపమగువాక్కు, అన్నరూపమగు మనస్సు ఈ మూడింటిని త్రికరణములని చెప్పఁబడును. త్రికరణములయందు నసిద్ధ ప్రవర్తనము గలవారల జీవులు. మలినత్వము నొందును. అందువలన ఆత్మ ద్రోహమగును. అనఁగా: మానవోపాధినుండి భ్రాంతి రహిత స్థితినిఁ జెందునట్టి ఆత్మను 84 లక్షల నీచయోనులందు జన్మింపఁ జేసినవారల మగుచున్నాము. కావున దీని నాత్మ ద్రోహమని చెప్పఁబడును. త్రికరణశుద్ధిగాఁ బ్రవర్తించినవాని జీవుఁడు విషయపంచకమగు మలినాంశము విడిచి, ఆత్మ స్వయం స్వరూపమగు ప్రకాశత్వము నొందుచున్నాఁడు. ఈ పద్ధతి ఆత్మ ప్రియత్వమని చెప్పఁబడును.

## త్రికరణశుద్ధి నిర్ణయము

త్రికరణములనఁగా: శరీరము, వాక్కు, మనస్సులు, వీనిలో కాయ సిద్ధి. అన్నముయొక్క స్థూలభాగము మలము, మధ్యభాగము మాంసము యొక్క సప్తావరణములు అనఁగా: సప్తధాతువుల స్థూల శరీరము. దీనిని అన్నమని చెప్పఁబడును. స్థూలావరణమునకు మూలావరణమన్నమగును. అనఁగా: షడ్రసోపేతమగు భోజనపదార్థములు దోషరహితముగానున్న యెడలఁ దానిచే పోషింపబడు శరీరము రోగరహితముగానుండును. దోష రహితమగునన్న మనఁగా నితరులమోసగించి లంచములఁగొని అబద్ధ సాక్ష్యములిచ్చి శరీర పోషణ మొనర్చుకొని దాని బలముచేత నమాయకుల హింసించి, జారచోర ధీరశూరత్వములచే ధనధాన్యాది వస్తువాహనాదుల సంపాదించి బ్రదుకునట్టి బ్రదుకు దోష భూయిష్టము. ఇట్టి బ్రదుకు కొంత కాలము మాత్రమే సౌఖ్యము నొసఁగును. అట్లయ్యు తుదకుఁ తమ జీవిత

ములో నది యధిక కష్టముల ననుభవింపఁజేసి మరణానంతరమున నీచ యోనులయందు జనించునట్లు చేయును. కావున శరీరోపాధికి మూలమగు నన్నపానాదులు న్యాయమగు స్వకీయ క్రమార్జితములుగా నుండవలయును. దీనినే పరిశుద్ధాహారమని చెప్పఁబడును షడ్రసోపేతమగు నాహార పదార్థ ములలో తీపి యుత్తమ పదార్థమని నిర్ణయించి యున్నారు. అయినను, స్వకష్టార్జితమగు గంజితో సమముగాదు. స్వకష్టార్జిత మేపదార్థమైనను నమృతముతో సమానముగా నుండును. ఇతరత్ర యార్జించిన ధన కనక వస్తు వాహనాదులవలన హంసతూలికా తల్పంబులపై పవ్వళించి యాత్మను సౌఖ్య వంతముగాఁ జేయుచున్నానను నిర్ణయము గలదు. అది ఆత్మకు ద్రోహము గాని సౌఖ్యప్రదము గాదు నియమితము కన్న నధిక సంపదలఁగోరు మానవు డితరులకు ద్రోహమొనర్చి జీవించు వాఁడగుచున్నాడు. కావున నది ఆత్మ సౌఖ్యమెట్లగును ? ఆత్మ ద్రోహమే యనఁబడును. ఇట్టి విధానము వలనఁ బ్రకాశవంతమగు నాత్మ మలినత్వముచెంది నీచయోనులందు జన్మించు టకు హేతువగుచున్నది. కావున దీని నాత్మద్రోహమని చెప్పఁబడును. మానవోపాధియందుఁగల స్త్రీ పురుషాదులు స్వకష్టార్జితము మీఁద నాధారపడి జీవయాత్రఁ గడుపవలయును. ఇట్టి పద్ధతులు గలవారల శరీరములు పరి శుద్ధములై బ్రహ్మ తేజంబుతో నలరారుచుండును. వీరికి వాతపిత్త శ్లేష్మ వ్యాధి బాధలుండవు.

## వాక్శుద్ధి (లేక) వాక్సిద్ధి

పరమ స్వరూపమగు ప్రాణము, జాగ్రత్స్వప్న, సుషుప్త్యవస్థా త్రయము నొందునట్టి యింద్రియ సముదాయమునకు, రాత్రింబవళులను నిర్ణ యముగలదు. అయినను ప్రాణవాయువు రాత్రింబవళులను నిర్ణయములేకుండ సంచరించుచున్నది. కావున ప్రాణము పరమాత్మయని చెప్పఁబడుచున్నది. అన్నముయొక్క సూక్ష్మభాగమగు మనస్సు పరమాత్మ రూపమగు ప్రాణము ఈ రెంటియొక్క సంయోగమువలన వర్ణాత్మకమగు ప్రణవము గలుఁగు చున్నది. కావున నీ ప్రణవోచ్చారణకు నాధారమగు వాక్కు పరమాత్మయని నిర్ణయింపబడుచున్నది. స్థావర జంగమ రూపములైన ప్రాణులు వాని వ్యవ

హారంబులు, వాక్కుచేతఁ దెలిసికొని సకలములగు ధర్మాధర్మంబుల నిర్ణయించి దానిపై నానందానుభవము నొందుచున్నవి. రక్షింపఁబడుచున్నవి. కావున వాక్కు పరమాత్మయని నిర్ణయమైనది. పరమాత్మ రూపమగు వాక్కునందు స్వార్థత్వమున్న యెడల నాత్మ నిరూప్యమగు నంతఃకరణము మలినత్వ మొంది నీచయోని ప్రాప్తిఁజెందుచున్నది. కావున స్వార్థరహిత సంభాషణ యందే ప్రవర్తింపవలయును. ఇట్టి వారల యంతఃకరణమాత్మ స్వరూప ప్రకాశ వంతముగా నుండును.

## మనశ్శుద్ధి (లేక) మనస్సిద్ధి

అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు. కావున భుజించిన యన్నము పరిశుద్ధముగానున్న యెడల మనస్సు పరిశుద్ధముగానుండును. అన్నము మలినత్వమైయుండిన నది పంచ భక్ష్య పరమాన్నమైయుండినను దానినుండి మనస్సు మలినత్వము నొందియుండును. మఱియు, మనస్సు జ్ఞానేంద్రియములద్వారా విషయపంచకము తెలిసి విషయ స్వరూపమంతఃకరణమునందుఁ జేర్చినను బాటసారులు పయనించిన యటుల విషయ వాసన లంతఃకరణమునుండి వెడలిపోవును. కావున పరిశుద్ధమగు నాహారము, పరిశుద్ధమగు వాక్కు, పరిశుద్ధమగు నంతఃకరణ రూపమైన మనస్సులను త్రికరణములతోఁ బ్రవర్తించువారి యంతఃకరణము బాహ్యాభ్యంతరములయందుఁ బ్రకాశవంతముగా నుండును. వారిజీవితము దైవజీవితము, స్వర్గతుల్యము. కావున త్రికరణ శుద్ధిగలిఁగి ప్రవర్తించుట ప్రత్యగాత్మ పరమాత్మలయొక్క ఏకత్వము చేయుట యగును. కనుక నీ పద్ధతి అన్నమయ పురుష యోగమని చెప్పఁబడును.

కం॥ తనువున వాక్కున మనసున, పనియొక్కటి జరుపునట్టి, భక్తునికి దయతో వినుపించుము వినుమని యాఘనబోధను, వాని కతుకఁగలదు కుమారా॥

కం॥ మనసుననొకటి దలచి వాక్కున నొక్కటిఁ బలుకుచుండు గుటిలుండు మఱిఁదాఁ దనువున నొక్కటిచేయును. విను; వానికి బోధదెల్ప విహిత మటోయి॥ అను న్యాయమున్నది; కావునఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రవర్తించుట అన్నమయ పురుషయోగమని సిద్ధాంతము.

## ప్రాణమయ పురుష యోగము

సకలేంద్రియ సముదాయమును బాహ్యాంభ్యతరములయందుఁ బ్రవర్తింపఁ జేసి గతినిఁ బ్రసాదింపఁ జేయునది ప్రాణము. కావున ప్రాణశక్తి యితర విషయాదులందు వెచ్చింపక స్వవిషయమందుఁ బ్రవర్తింపఁ జేయుచు నధిక రక్షణఁ జేయవలయును. ప్రాణ రక్షణమే ప్రాణాయామనియమమని చెప్పఁ బడును. పిండాండమునందు సర్వము భరించుటయే ప్రాణ నిర్ణయము. సమా నమ్ము, నాభిస్థానమందుండి భుజింపఁబడు సన్న పానాదుల జీర్ణింపజేసిఁ స్థూలభాగమును క్రిందికినెట్టి వానిసారము సర్వనాడులకుఁ బంపుచుండును.

వ్యానము. సర్వనాడులయందుండి రక్తాదులఁ బ్రసరింపఁజేసి శీతోష్ణ స్పర్శలను దెలియఁజేయును.

ఉదానము: సుషుమ్న నాడియందుండి వైఖరీవాక్కున సర్వవాక్య ముల వచింపఁజేసి జీవుల పాప పుణ్యముల ననుసరించి మృత్యువును గలి గించును.

ప్రాణము: హృదయమందుండి యుచ్ఛ్వాస నిశ్వాసములఁ గలిగిం చుచు నేత్ర శ్రోత్రములఁ బ్రవేశించి వాని విషయములందుఁ బ్రేరేపింప జేయును.

అపానము: పాయూపస్థలయందుండి మలమూత్ర శుక్ల శోణితముల విసర్జింపఁజేయును ఈ విధముగా ప్రాణపంచకము దేహమును ధరించు చున్నది. కావున సర్వేంద్రియములు ప్రాణసత్తచే వాని కార్యములు జేయు చున్నవి. అంతఃకరణ చతుష్టయము, సంకల్పము, నిశ్చయము, చింతనము, అభిమానము అనువానిని బొందుచున్నవి. జ్ఞానకర్మేంద్రియములు తమ తమ పనులయందుఁ బ్రవర్తించుచున్నవి. అంతఃకరణము హృదయములోఁ జేరిన దేహము నిలిచియుండును. నిందుచే సర్వమునందు ప్రాణమే శ్రేష్ఠమని తెలియవలయును, నిజమునకు ప్రాణము యజమానివంటివాఁడు. ఇంద్రియ ములు సేవకుల వంటివారు. ఇట్లు నిర్ణయించుకొని ప్రాణనిశ్చయము చెందు వారు ప్రాణమయ పురుషులని చెప్పఁబడుదురు.

## బ్రహ్మాండమును ధరించు సమష్టి ప్రాణ నిర్ణయము

సమానము. అంతరిక్షమునందుండును. అనఁగా భూమ్యాకాశముల మధ్యభాగమని తెలియవలయును.

వ్యానము : సర్వమునందు వ్యాపించి సర్వజగత్తు ధరించి గతులు ప్రసాదించుచున్నది.

ఉదానము : తేజమందున్నది.

ప్రాణము : సూర్యుని యందున్నది.

అపానము : పృధ్వియందుండి బ్రహ్మాండమును ధరించుచున్నది. కావున లోకములన్నియు నిలిచియున్నవి. లోకేశుఁడు సమష్టి ప్రపంచము నకుఁ బ్రకాశము నొసగుచున్నాడు అగ్ని మండుచున్నది. మేఘములు వర్షించు చున్నవి. నక్షత్రమండలము రాలకయున్నది. భూమి క్రుంగక యున్నది. త్రికాలములు, అయనములు, ఋతువులు, నెలలు, పక్షములు, వారములు, దినములు, క్రమముగా జరుగుచున్నవి. సకలము సృష్టియగు చున్నది. ప్రపంచ ప్రళయమునందు సర్వము నీ ప్రాణమందే లయమగు చున్నది. అందుచే ప్రాణము, పరమాత్మ యనియు, మహత్తనియు, బల మనియుఁ జెప్ప బడుచున్నది. ఆత్మరూపమగు ప్రాణము, జ్ఞాన కర్మేంద్రియ ములద్వారా సూర్యచంద్ర నాడులమూలమున నహోరాత్ర రూపముతో నశించుచున్నది. అందువలన జీవోపాధులయందు ముఖ్యముగా మానవో పాధులాత్మ బలములేనివారలై యింద్రియంబులకును, దేహమునకును, లోకమునకును, ధన కనక వస్తువాహనాదులకును, దాసులై యధోగతినిఁ బొందుచున్నారు. కావున ప్రాణరక్షణ చేయుట, ప్రాణమయ పురుషయోగ మని చెప్పఁబడును.

## ప్రాణమయ పురుషయోగ పద్ధతి

పిండ, బ్రహ్మాండాధారమగు సమిష్టి ప్రాణంబును గెలిచి ప్రాణమనం బుల సంయోగమువలనఁ గలిఁగిన ప్రణవంబును అనఁగా : ప్రణవ మంత్రం బును మనస్సుచేత, మఱియుఁ మనస్సుయొక్క పరిణామమగు జ్ఞానేంద్రి యముచేత అనుష్ఠాన మొనర్చిన దోషయుక్తమని తెలిసి విషయపంచకమగు శబ్ద, స్పర్శ, రూప,రస, గంధరహితమగు, సమిష్టిప్రాణమును పరావాక్కుతోఁ జేర్చి, అజపముగా నుపాసనఁజేసినయెడల ప్రాణము రక్షింపఁబడును. గొప్ప మహత్తుఁగలవాఁడగును. ఈ యోగపద్ధతి యొండిన మొద్దుకుఁ బ్రబోధించిన చిగిరించి ఫలవంతమగును.

## మనోమయ పురుష యోగము

అన్నమయొక్క సూక్ష్మరూపమగు మనస్సు ప్రాణముతోచేరి యుండును. ప్రాణస్థానమగు హృదయమునకు నుపాధి నిర్మితములగు నైదు ద్వారములు గలవు. వీనిలో

1) తూర్పు దిశయందుండు ద్వారము :- ఇది నేత్రము వరకు నుండును. ఈ ద్వారమున మనస్సు నేత్రేంద్రియ రూపమునఁ బరిణమించి లోకవ్యవహారముల కొఱకు రూప నిర్మాణముల నొనర్చుచుండును.

పరలోక ప్రాప్తికొఱకు రూప రహితమగు నాదిత్యంతఃకరణమైన బ్రహ్మ ప్రకాశమును నిష్ఠతో నుపాసించుచుండును.

2) దక్షిణ దిశయందలి ద్వారము :- ఇది శ్రోత్రమువరకు నుండును. ఈ ద్వారమునుండి మనస్సు శ్రోత్రేంద్రియ రూపమునఁ బరిణమించి లోక వ్యవహారముల వినుచుండును.

పరలోక ప్రాప్తికొఱకు ధర్మాధర్మంబులచే, వినెడి శబ్దము, హృదయ తాపంబుల నడఁచుటచే, జంద్రునితో సమమనియు దారిద్ర దుఃఖంబుల నడంచుట లక్ష్మితో సమమనియు, శబ్దముయొక్క యాధిక్యతఁ దెలిసి లయ యోగ నిర్మితమగు దశవిధనాదంబులలో నంత్యనాదమైన మేఘనాదమువిని చంద్రునియొక్క కిరణ విస్రుతామృతముచే వేడిమియొక్క తాపమడంచుకొని సౌఖ్యమొందిన జీవుల రీతిగా ; మేఘనాదమునందు, శాంతచిత్తుఁడై సాధకుఁడు స్థాయినందుచున్నాడు. శబ్దనిష్ఠను బ్రహ్మనిష్ఠతో సమముగా నుపాసించు చున్నాఁడు.

3) పడమర దిశయందలి ద్వారము :- ఇది పాయూపస్థల వరకు నుండును. ఈ ద్వారమునుండి మనస్సు ప్రాణేంద్రియ రూపమునఁ బరిణమించి ప్రపంచ సౌఖ్యముకొరకు నూర్ధ్వాధోరూపములగు జిహ్వోపస్థలయందు భ్రాంతి గలిగి యుండును.

పరలోక సౌఖ్యముకొఱకు వైశ్వానర రూపమగు నగ్ని బ్రహ్మ స్వరూపముగా నుపాసనఁ గావించుచుండును.

1) ఉత్తర దిశయందలి ద్వారము :- ఇది రక్తనాళములయందుఁ జేరి యుండును. రక్తనాళములనుండి మనస్సు త్వగేంద్రియ రూపమునఁ బరిణమించి లోక స్వరూపమగు బాహ్య స్పర్శల యనఁగా శీతోష్ణములు, స్త్రీ పుత్రాదులు, జ్ఞాన కర్మేంద్రియముల నుండి స్పృశించుచూ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ వచన దాన గమన విసర్జనానందములఁ దెలియుచుండును.

పరలోక ప్రాప్తికొఱకు నంతఃస్పర్శములు అనఁగా జ్ఞానేంద్రియములు అంతఃకరణ చతుష్టయములగు మనో, బుద్ధి, చిత్త, అహంకారములు, అంతఃకరణమునందుఁ జేర్చి ప్రాణాపానముల నేకమొనర్చి, ఉదాన సమానంబులతో సమముగా వ్యాన ప్రాణములయందు లయమొనర్చి, కుండలీస్థానము నుండి, భ్రూమధ్యమునకు, సుషుమ్నద్వారా : తెచ్చి, త్రివేణీ సంగమము గావించి అగ్ని, సూర్య, చంద్ర, మండలములద్వారా : బహిర్గతి మొనర్చి ఉన్మనిగాఁ బరిణమింపఁజేసి ద్వాదశాంతమునొంది మనోన్మనిగా బ్రహ్మమునందు నైక్యమగుచుండును. ఈ పద్ధతి అంతఃస్పర్శ లక్షణము.

5) ఊర్ధ్వ దిశయందలి ద్వారము :- ఇది కపాల పర్యంతమునుండి. ఆదిత్య లోకాతీతమువరకు అనఁగా : బ్రహ్మలోకమువరకు నుండును. దీని నుండి మనస్సు జ్ఞానమందు అయం అను రూపమునఁ బరిణమించి లోక వ్యవహారము కొఱకు త్రికరణశుద్ధిగాఁ బ్రవర్తించుచుఁ బ్రాణపోషణకుగాను భుజించిన యన్నపానాదులనుండి యోజస్సును గ్రహించి యస్ఖలిత బ్రహ్మచారిగా నుండును.

పరలోక ప్రాప్తికొఱకు మహద్రూపమగు, ప్రజ్ఞాన తేజస్సుద్వారా అగ్ని, చంద్ర, సూర్యలోకములకు, అతీతముగానున్న బ్రహ్మలోకము పొందును. కావున మనోవ్యవహార రూపమగు, నీ పంచ లక్షణము లవస్థా పద్ధతులుగాని భ్రాంతి రహిత విధానములు కావు. ఇట్టి పద్ధతులవలన మానవులు, ఫలముల నొందఁబోరు. ఎందుకనఁగా : స్థూలావరణంబులగు, జాగ్రత్స్వప్న, సుషుప్తులందుఁ దెలియఁబడు వర్ణంబులే సూక్ష్మ వర్ణంబులందుఁ దెలియు లక్షణములుగా నున్నవి. అందుచేఁ బై యోగ నిర్మితములవలన నావరణ రహితముగాక, గొప్ప అడుసులోఁబడిన విధముగానగును. కావున మనోమయ పురుషయోగ పద్ధతి ఈ విధముగాఁ దెలియవలయును.

## మనోమయ పురుషయోగ పద్ధతి

సూర్య చంద్రాగ్ని తేజంబుల కన్నను, స్వర్గమర్త్య పాతాళంబుల కన్నను, శ్రేష్ఠముగానుండి తనకన్న శ్రేష్ఠమింకొక్కటిలేక యే బ్రహ్మము ప్రకాశించుచున్నదో ఆ ప్రకాశమే హృదయ ప్రకాశము. ఊర్ధ్వరూపమగు సుషుమ్నా నాళమూలమున బ్రహ్మ ప్రకాశము ప్రవేశించి హృదయమునందుఁ జేరును. అధోర్ధ్వభాగములయందు మనస్సును పోనీయక ఊర్ధ్వ రూపముగా, నధోరూపముగాఁ బరిణామము బొందనీయక నేకత్వమగు బ్రహ్మము నందే చేర్చవలయును. అధోభాగమునఁ బ్రసరించిన మనస్సు జడత్వము నొందును. ఊర్ధ్వభాగముగాఁ బ్రసరించిన మనస్సు లోకభ్రాంతిఁ జెందును. మఱియు బ్రహ్మ, ఊర్ధ్వభాగమునుండి బ్రహ్మ కపాలము ద్వారా సుషుమ్నా మూలము మున హృదయమునందుఁ బ్రవేశించుచున్నది. ఇది బ్రహ్మముయొక్క అఖండరూపము. ఈ అఖండ రూపమగు నేకత్వమందు మనస్సును, వ్యాపక మొనర్చిన యెడల బ్రహ్మమగుచున్నది.

శరీరమునందు, హస్తముంచి ఉష్ణపద్ధతి నిట్లు దెలియుచున్నాను, అది అగ్ని. మఱియు జ్యోతి రూప దర్శనము. ఇవియే బ్రహ్మయొక్క ప్రథమ దర్శనము. జ్ఞానేంద్రియములచే విషయ పంచకము దెలిసినట్టి తెలివి స్వప్నావస్థయందు నవస్థా పద్ధతిఁ తెలియఁజేయు స్వప్రకాశము. ప్రత్యగాత్మ యగు బ్రహ్మ :- ఇది బ్రహ్మముయొక్క ద్వితీయ దర్శనము.

జాగ్రదావస్థయందుఁ దురీయావస్థయందుఁ దెలియునట్టిది, పరమాత్మ ప్రకాశము. కావున పిపీలికాది బ్రహ్మ పర్యంతము బాహ్యాభ్యంతరముల యందుఁ బ్రకాశమగు బ్రహ్మముయొక్క నిర్ణయ మెఱిఁగి మనస్సును బ్రహ్మమునందు వ్యాపక మొనర్చిన బ్రహ్మత్వము పొందును. అనఁగా బ్రహ్మమునందు నైక్యమగును. ఇట్టివారు, బ్రహ్మవర్చస్సు గలిగి తేజో వంతులుగా నుందురు.

## బ్రహ్మ నిశ్చయమగు మనోమయ యోగుల సాధన పద్ధతి

సంకల్పములపైన, కామక్రోధ విషయ వాసనలపైనను, శరీర చేష్టలపైనను దన అధికార ముంచవలయును.

న్యాయాధిపతిచేయు తీర్పువలె విమర్శించి పరమేశ్వరునివలెఁ దనపై సర్వపద్ధతులుదాను శాసించుచుండవలయును. అట్లు అధికారము వహించనిచో నింద్రియవాంఛలు మితిమీరి గాలిలోఁ జిక్కిన యెండుటాకువలె, నీడ్చుకొని పోవును. మఱియు చుక్కానిలేని పడవ సుడిగాలిఁలోఁబడి కొట్టుకొను చందమున విషయ వాసనలలోఁ జిక్కించి ముంచివేయును. అన్నమయకోశ రూపమగు శరీరపోషణకు దాసునిఁజేయును. కావున మనోమయ పురుష యోగము సాధించు పురుషులు ప్రథమమున నింద్రియ జయము పొంద వలయును.

మనోమయ పురుషస్థితినిఁజెందినవారు మౌనముద్ర వహించి బ్రహ్మ ప్రకాశమగు నఖండచేతనమందు విశ్వాతీతమగు, విశాల ప్రశాంతములో మనోలీనము చేయుచుండవలయును. ఇట్టివారల మనఃప్రాణంబులు చంచల త్వములేక అపారస్థిరత్వము గలిగి ఎట్టి చలనత్వమునకుఁ గూడ నభేద్యమై యుండును.

మనోమయ పురుషయోగులకు నితర మహత్తులెన్నియో కలుఁగును. వానియందు నాశఁజెంది అచల పరిపూర్ణస్థితియొక్క ప్రయత్నము విడువ రాదు. మనోమయ పురుషయోగమునకుఁ బ్రయత్నించు కాలములో నితర జ్ఞానానందములు అనఁగా : దశవిధనాదములు.

బిందురూపమగు జ్యోతి దర్శనము. చిత్కళలు, అష్టదళ పద్మము, దానియందలి ఆత్మ సంచారము, పూర్ణచంద్ర ప్రకాశము, కోటి సూర్య ప్రకా శము, మున్నగునవి తెలియఁబడును. కాని వానియందు తుష్టిఁ జెందియుండ రాదు. అవి కొంతకాలమువఱకునుండి నశించిపోవునట్టివి. కావున శాశ్వత లక్షణమగు, నచల పరిపూర్ణ స్థితినిగూర్చియే ప్రయత్నింపవలయును.

## విజ్ఞానమయ పురుషయోగము

మనోమయ పురుషుని యచంచలమునందే విజ్ఞానమయ సత్యము. వాని నిజలక్షణము తెలియననువుపడును. సర్వకాల సర్వావస్థలయందుఁ బ్రశాంతముగా నుండుటకు నీ యంతరమందు నొక్కస్థానము గలదు. అదే హిరణ్మయకోశము అచ్చటినుండి నీ ప్రాణమనంబులవలనఁ గలుగు కామ

సంకల్పంబుల వృత్తులు, నిష్పక్షపాతముగా విమర్శించి చక్కపఱచుటకు శక్తి సామర్థ్యములు గలిగియుండేవునికి అంతఃకరణ సత్తాయొక్క ప్రకాంతితో నివసించునట్టి యునికియొక్క రహస్యము మీకు, దెలిసినయెడల నీవే స్వయం ప్రకాశ రూపుఁడవై ఇతర శక్తులచే నీవు చలింపక అచలస్థితిఁ గలిగి యుందువు.

స్థూల పదార్థమనఁగా మలినచేతనము (లేక) మిశ్రమ చైతన్యము

కేవలచేతనము అజ్ఞాన రూపమగు మఱపుగానున్నది. కావున వీని యందు నఖండచేతనమును బ్రవేశింపఁ జేయవలయును. ఈ పద్ధతి వలన మఱపు రూపమగు జడమువలన జీవుఁడు కేవలాఖండాకారమగు ఎఱుక అనఁగా చేతన లక్షణము పొందును.

మలిన చేతనమందలి ఆసనముద్ర లక్ష్యాభ్యాసములు, మిశ్రమ చేతనమునందలి కేవల యోగసాధనము, కేవల చేతన నిర్మితమగు మహావాక్య స్వరూప బ్రహ్మవిచారణ మెన్ని సన్యాయము లొనర్చినను భ్రాంతి రూప పశుప్రాయము వీడిపోదు. అజ్ఞానము నశించదు. కావున నఖండచేతనము యొక్క స్థితి ఇతర స్థూలభాగములందుఁ బ్రవేశపెట్టినయెడల ననఁగా : సకల స్థూలభాగములు దానికి కారణమగు సూక్ష్మభాగముగాఁజేసిన యెడల నన్నమ యాది యావరణంబులు లయించి తదాకార రూపమగు నజ్ఞానము పటా పంచలగును.

అఖండచేతనము దనచేతనా పరిణామమువలన స్థూలరూప మాంద్యము వహించినను వాని యంతరమునందు సర్వత్ర, బెల్లమునందుఁ దీపియున్నట్టు లది చుట్టుకొనియున్నది. వస్తు నిశ్చయ రూప విజ్ఞానయోగమువలన స్థూలము నందలి సూక్ష్మరూప శక్తిని హెచ్చించిన యెడల నాగసర్పము తోఁకపైని చక్కఁగా నది నిలుచుండు విధమున నీ యంతఃకరణమునందు నుండు నఖండచేతనముయొక్క యునికి ఊర్ధ్వమునకు నెగఁబ్రాకి అఖండా కృతి నొందును.

ఊర్ధ్వభాగమందున్న యఖండచేతన నీ శరీరములోనికి సులభముగాఁ బ్రాఁకుచున్నట్లు మనము గ్రహింపఁగలము. అఖండచేతనముయొక్క సూక్ష్మ పద్ధతిఁ దెలియుటకుఁ బ్రయత్నించువారల శరీరమున నేత్రరూపమగు చక్షురిం

ద్రియము నూర్ధ్వముసకు నెగబ్రాఁకుచున్నట్లు దెలియును. ఈ పద్ధతి, విజ్ఞానమయ పురుషయోగమువలనఁ గలుగుచున్నదని గ్రహింపవలయును.

అఖండచేతనముయొక్క ప్రకాశము, కోశాంతరములయందు, నిలుపవలయును. ఇట్టి జాగ్రతలేనివాడు కోశంబులు తాను విషయవాసనా రహితముగానివాఁడై కోశాంతరములయందు విషయ వాసనలలోఁబడి మునిఁగి పోవును. కావున అన్నమయ పురుషుని ప్రాణమయ పురుషునిగాను, ప్రాణమయ పురుషుని మనోమయ పురుషునిగాను, మనోమయ పురుషుని విజ్ఞానమయ పురుషునిగాను నొనర్పవలయును. ఈ పద్ధతి, భద్రమైన మార్గము. కావున నితర మార్గముల నవలంబించక, దీనియందే సంచరించుట శ్రేయోదాయకము. అట్లుగానిచో కసుగాయను నిప్పిడ్యమొనర్చి పండుఁ జేయుటకుఁ బ్రయత్నించిన విధమగును.

జాగ్రదావస్థయందు నఖండచేతనముయొక్క ప్రకాశము గొంతదెలిసి కొంతదెలియక యుండును. నిద్రావస్థ ప్రాణపంచకముగానుండును. అందుచే నఖండచేతనముయొక్క నిర్ణయము విరివిగాఁ దెలియుచున్నది; కాని జాగ్రదావస్థయందున్న విజ్ఞానమయాత్మ నిద్రావస్థయందుఁ గ్రుంగుచున్నది. అందువలన జాగ్రుతి నిద్రావస్థయందలి ఏఱుక నిర్ణయ మేకత్వమగుటకు ననఁగా : నఖండాకృతిఁ బొందుటకు నిద్రను తగ్గించి జాగృతిని హెచ్చుఁ జేయుటకుఁ బ్రయత్నించవలయును.

అఖండాకృతిగానుండుట నిద్రను తగ్గించుటయని అర్థముకాని నిద్రను బలవంతముగాఁ దగ్గించుటఁగాని, నిద్రను నిరోధించుటగాని రోగహేతువగును. కావున నిది నిద్రను నిగ్రహించుట కాదు. బలవంతముగా నిద్రను నిరోధించుట వలన రోగములేర్పడి యధోగతిని బొందించును.

జాగ్రదావస్థయందు యోగశక్తివలన నిద్రావస్థ నరికట్టలేనివారి యోగశక్తిని నిద్రావస్థ క్రుంగఁజేయును. అరికట్టినవానిని నిద్రావస్థలో వాని యోగశక్తి క్రుంగఁజాలదు.

జాగ్రదావస్థలో నన్నమయ పురుషుని ప్రాణమయ పురుషునిగాను, ప్రాణమయ పురుషుని మనోమయ పురుషునిగాను, మనోమయ పురుషుని

విజ్ఞానమయ పురుషునిగాను, నొనర్చినట్లు తక్కిన యవస్థలయందుఁగూడ మార్పుఁ జెందించవలయును. ఇట్టి పద్ధతివలన జనన మరణ భ్రాంతి రహిత మునకు నుపయోగకరమైన పెక్కు ననుభవములు దెలియఁగలవు.

సాధనయందు నలసటఁ జెందరాదు. ప్రజ్ఞానయుక్తమైన, యచలత్వ ములోఁ బ్రశాంతమగు విశ్రాంతి వహించి ప్రాణబలమును ధరించు నాహార మును దీసికొనుటఁ బ్రథమ తరుణోపాయము.

అన్న, ప్రాణ, మనో మయ, పురుషయోగములకన్న ; వాని యోగ శక్తులకన్న ; విజ్ఞానమయ పురుషయోగము దాని యోగశక్తి చాల గొప్పది. దాని యోగశక్తి స్థిమితముగా నుండును. మఱియు విజ్ఞానపురుష శక్తి స్వభావసిద్ధము. కావున స్వయం సంజాతమని తెలియవలయును.

ఇట్టి యోగానుభవముగల వాఁడే అచల పరిపూర్ణ పరబ్రహ్మమును, తెలిసి తాను దెలియకుండపోగలఁడు. కాని ఇతర పద్ధతులవలన నచల పరి పూర్ణ పరబ్రహ్మమును దెలిసికొన వీలుగాదు. జనన మరణ భ్రాంతి రహిత ముగాఁజాలదు.

## అచల పరిపూర్ణ రాజయోగము

ఒక పాత్రయందు నొకవస్తువు నుంచవలసిన యెడల నింతకు పూర్వ మా పాత్రయందున్న వస్తువును, పూర్తిగాఁ దీసివేసి తానుంచఁదలఁచిన వస్తువు నుంచవలయును. ఆ విధముననే అన్నమయ ప్రాణమయ, మనో మయ విజ్ఞానమయావరణంబుల సంపూర్ణముగాఁ దీసివేసినచో నచల పరి పూర్ణ స్థిరతచేకూరఁగలదు ఏకాస్త కోశావరణ శేషమునిల్చినను నచల పరి పూర్ణ స్థిరతచెడును. ఎందుకనఁగా : అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశంబులకు నొకదానితో నొకటికి సన్నిహిత సంబంధము గలదు. కావున నవి యొకటితో నొకటి చేరియుండును. అచల పరిపూర్ణ పర బయలుకు కోశావరణంబులకు నేలాటి సంబంధములేదు. ఎందుచేత ననఁగా నచల పరిపూర్ణ మఖండము, చలనరహితము, కోశావరణంబులు ఖండములు, విక్షేపములు, అనఁగా చలన స్వభావములు. కావున వానిలో నొకదానికి మఱియొకటి సంబంధములేదు. అందువలన నచల పరిపూర్ణ స్థితికొఱకు

కోశావరణములఁ ద్యజింపవలయును. అందు ముఖ్యముగా విజ్ఞాన మయా వరణంబును నిర్జీవ మొనర్చవలయును. అనఁగాఁ జంచలత్వము నశింపఁజేయ వలయును. అందు నణుమాత్రమైన శేషముండకూడదు. మలయ మారు తముయొక్క స్పర్శవలన మేఘములయందలి జలము నామమాత్రమైన మిగుల కుండ యెట్లు నశియించుచున్నదో అట్లు అచల పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క స్థిరతవలన నఖండచేతనము నామమాత్రముగానైన లేకుండ నశింప వల యును. అచలస్థితియందు దానిని పూర్తిగా నశింపఁజేయవలయును.

అచల పరిపూర్ణ స్థిరత బాహ్యమునందు, సాధ్యపడిన పడవచ్చును. కాని ; అంతరమందు నచల స్థితికలుఁగుట మహా కష్టతరము. ఆంతర స్థిర త్వము, జనన మరణ భ్రాంతి రహితమునకుఁ బ్రయోజనము ; అందువలన నన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ యోగంబుల ననంతరము అచల పరిపూర్ణ రాజయోగము నభ్యసించువారలకు నంతఃకరణమునందు, నచల పరిపూర్ణ స్థితి గలుఁగగలదు. ఇతర పద్ధతులవలన ఆభ్యంతరస్థితి సాధ్యముకాదు. అంతరంగిక స్థిరత్వముగల్గిన నాఁడే భ్రాంతి రహితస్థితి కలిగి నట్లు నిర్ణయించవలయును. కాని వాక్యార్థ సంజ్ఞా జ్ఞానము, కలిఁగినంత మాత్రమున నచల పరిపూర్ణ స్థితికలిగినట్లు నిర్ణయించుకొనగూడదు.

విజ్ఞానమయ పురుషయోగమువలనఁ గలిఁగిన యఖండ చేతనము యొక్క నిజస్వరూపస్థితి ఉత్పత్తి, పాలన, లయములకు మూలకారణముగా నున్నది. బీజములయందలి వృక్షోపాధులకు సూక్ష్మ రూపమైన వాసన మూల కారణముగానున్నది. బీజంబులు క్రియోన్ముఖమొనర్చు నంతవరకు బీజము నందలి వృక్షోపాధియొక్క సత్త చెడకుండునట్లు క్రమసృష్టి కలుఁగు చున్నది.

బీజమును క్రియోన్ముఖమొనర్పక కొంతకాలముంచిన యెడల బీజము నందుఁ గల వృక్షోపాధియొక్క సూక్ష్మ సత్తనశించుచున్నది. కావున విజ్ఞాన మయ పురుషుని యనగా నఖండచేతనముయొక్క పరిణామ మహోరూప ముగాఁ బరిణమించి విషయ పంచకమునందుచేరి యుపాధికి, గారణముగా కుండ, నచల పరిపూర్ణ పరబాహ్యముయొక్క స్థితివలన కొంతకాలముంచి

నచో నుపాధి పద్ధతి నశించును. అఖండచేతనమును నధోరూప పరిణామము నొందనీయక నచల పరిపూర్ణ పరబాహ్యముయొక్క నచలత్వమునందు నుంచుటయే నాంతరస్థిరత్వము. అన్నమయాది యోగరూప క్రమపద్ధతి, నిజ గురు సంప్రదాయకులకే తెలియును. వారికే సాధ్యమగును. కాని ఇతరులకు సాధ్యముకాదు.

## అచల పరిపూర్ణ రాజయోగ పద్ధతి

అంతర స్థిరత్వ రూపమైన యచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క వునికి మాటిమాటికిఁ దెలిసికొని అపరోక్షానుభవుఁడు గావలయును. ఇట్టి స్థితి కుదురుటకు కొంతకాలము పట్టును. ఆలస్యమునకు వెఱచి అచల పరిపూర్ణ స్థితి కుదరలేదని నిస్పృహఁ జెందరాదు. పట్టు విడువరాదు. అచల పరిపూర్ణ స్థితికుదరక పోవుటకుఁ దనయందు నేదోయొక లోపమున్నదని నిర్ణయించి ఆలోపము దెలిసికొని దాని శుద్ధత్వమునకుఁ బ్రయత్నించవలయును.

శీఘ్రముగా : నఖండచేతన మచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క స్థిర త్వమున నుండక పోవుటకు కారణ మేమనగా : మలినచేతనము పృధ్వీ రూపాధారముగా నుండును. సంకల్పరూపమగు నఖండచేతనము సూక్ష్మముగా నూర్ధ్వమున నుండును. అఖండమగు సూక్ష్మ చేతనముయొక్క సంకల్ప రూపము లూర్ధ్వమునుండి త్రొక్కఁబడి స్థూలమగు మలినచేతనమునందు నణఁగియుండును. ఎట్లనఁగా: బీజమునందు వృక్షమణఁగియున్నట్లు గ్రహింప వలయును. బీజము నందణఁగియున్న వృక్షము వీలుగానున్న ప్పుడనఁగా : కాలానుగుణ్యముగా మొలకపైకి వచ్చునట్లు స్థూలమగు మలినచేతనము నుండి సూక్ష్మరూపమగు నఖండచేతనము సంకల్ప రూపమునఁ బైకిఁ వచ్చుచుండును. అన్నమయాది పురుషయోగమువలన నఖండచేతనమును సిద్ధత్వము నొందించు నచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క స్థితినిఁ జేకూర్చుకొనిన యనంతర మఖండచేతన పరిణామ భ్రాంతిని విడువకుండుటకు కారణము గలదు. అది యేదనఁగా : మూలకారణమగు నఖండచేతనము జ్ఞానా జ్ఞాన భూమి కలుగా నున్నది. మఱియు నాకలి, దప్పికి, అను ధర్మమగు ప్రాణి లోకంబును బొందకుండ నెవ్వరుండఁజాలరు. ప్రాణిలోకము శుద్ధా శుద్ధ

పద్ధతిగా నుండును. అందుచేత నీ కోరిక లేనిదే జాగ్రత్తయందునో: స్వప్నము నందునో, ప్రాణలక్షణములు దెలియుచుండును. అంతమాత్రమున నచల పరిపూర్ణస్థితి చెడినదని నిస్పృహాచెందరాదు. ఆ పద్ధతి బాటసారి లక్షణ మని నిర్ణయించి అచల పరిపూర్ణస్థితి కొరకు శ్రద్ధతోఁ బ్రయత్నించవల యును అందువలన ప్రాణసత్త పూర్తిగా నశించి స్వప్న, జాగృతీ లక్షణ ములు పూర్తిగా మాయమగును.

ప్రకృతితోఁగల యితర తత్త్వములు వ్యక్తిగతముగాను, విశ్వగతము గాను, నున్నట్లు లఖండచేతనము, వ్యక్తిగతముగాను, విశ్వగతముగా నున్నది. అచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క స్థితి మాంద్యరూపము దాల్చుటవలన నఖండచేతనముయొక్క చైతన్యపద్ధతిఁ గలిగి పరిణామరూప మలిన సత్వ ములోనికిఁ ద్రోయుచున్నది. కావున సర్వకాల సర్వావస్థలయందు నచల పరిపూర్ణ బ్రహ్మముయొక్క స్థితియను విశ్రాంతియందే యుండవలయును.

కం॥ ఆవరణము నాకసము । నిరావరణము నచల మనుచు । అనిరి మహాత్ముల్ । ఆవరణము మితిగలిగిన । దావరణము లేంది అమితమని తెల్పుకోరా । యీరెంట్ని వేరని కనుక్కోరా । ఆవరణమునసే నివారణ మును జూచి । యావరణ మెడలీన । ఆవలమాట । లేదని కనుక్కోరా । యీరెంట్ని వేరని కనుక్కోరా॥

కం॥ అహమనదుగదా అచలము । అహమున్నదొ లేదొ చూడ । దదినిజమెకదా । అహమును బుట్టించదు గద । అహముద యించేటివరకే । అదివున్నదిగదా । అహమె విశ్వమైనిల్చిందిగదా । అహమె యీముచ్చట్ల । నన్నింంటెరుగును గదా । అహమెతాలేనాని యరిగితె సరిగద । అది వున్నది గదా , అహమె విశ్వమై నిల్చింది గదా ॥

కం॥ పరిపూర్ణ మిదుగో యిదుగో । యెరుకను చూపించి లేని । యెరుకను లేదం । చెరిగించిన గురుదేసరి । యెరుకను విల్పేటిగురుదు । యెందుకోయన్నా । తద్వోధ నీ కెందుకో యన్నా । శరణన్నవారి మస్తకమందు చై బెట్టి । తిరముగ యెరుకాను తీసివెయ్యనివాఁడు । యెందుకో యన్నా । తద్బోధ నీ కెందుకో యన్నా॥

# షష్ఠమ సోపానము

## ఎఱుక యొక్క ఏకత్వ నిర్ణయము

పుష్పము : పంచ తన్మాత్ర ఏకైక రూపముగలదిగా నుండునట్టిది యైనను ముక్కువాసన గ్రహించును. నేత్రము రూపము గ్రహించును. నాలుక రుచిని గ్రహించును. శరీరము స్పర్శము గ్రహించును. శ్రోత్రము శబ్దము గ్రహించును. ఇట్లు, పంచేంద్రియములు నిది పుష్పమని గ్రహించిన విధముగా నెఱుక అపంచీకృతమై ఏకముగానున్నను, పంచీకృతమై యనే కముగా నున్నను, అనేక మేకము నేక మనేకము, అని తెలియనగును.

## అచల పరిపూర్ణమునుండి ఎఱుకను వేరొనర్చు విధము

నీటియందుఁగల వేడిమి నీటినుండి వేఱుచేయుటకు వీలుగాని యట్లుం డినను, శరీరముపైన పడినప్పుడు త్వగింద్రియముద్వారా ఆ నీటి వేడిమిని వేఱుపరచి తెలిసికొనునట్లు నచల పరిపూర్ణ పరబ్రహ్మ, మెఱుకను, వేఱుపర చుటకు వీలులేకున్నను, స్వప్రకాశ బ్రహ్మముయొక్క చేతన పద్ధతి యచల పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క యచలత్వమునందు వేరుపరచి తెలియనగును. అనఁగా ? సూక్ష్మమునుండి సూక్ష్మము గ్రహించనగునని నిశ్చయమగు చున్నది. మఱియు మాడుగులు, మిద్దెలు, చెట్లు చూపించి విదియ నాఁటి చంద్రుని గుర్తింపఁ జేయునట్లు, సప్తఋషి మండలమునుజూచి అరుంధతీ నక్షత్రమును నెఱుఁగజేయునట్లును పిమ్మట మొదలఁజూచిన మాడుగులు, మిద్దెలు మున్నగునవి దృశ్యముగాని విధముగ నచల పరిపూర్ణ పరబయలు నిత్యము, చంచలరూప చేతన మనిత్యమని చెప్పఁబడును.

కుండలోని నీరు, కుండవెలుపల చెమ్మయైనట్లు (ఎఱుక పరిణామము) ఆత్మ శబ్దార్థము వ్యావహారిక సత్తయందు, నేను నేనను నాత్మ యస్మచ్ఛ బ్దార్థమగును. అస్మి శబ్దార్థము నేను. యుష్మచ్ఛబ్దార్థము నీవు. ఈ రెంటిలో నీవనునది నన్నుఁ తెలిసికొనఁ జాలదు. ఎట్లనఁగా ? దీపమునుండి వెలువడిన ప్రకాశమువలన నితరవస్తు సముదాయము దెలియుచున్నది. దీపముయొక్క ప్రకాశము దీపమును దెలిసికొనఁ జాలదుగదా ? తన్ను తాను దెలిసినయెడల దానులేక పోవుచున్నది. తన ముఖము, తాను చూడవలెనన్న

నద్దముండవలయును. అదేరీతిగాఁ దన్నుదాను దెలియ వలయుననిన నచల పరిపూర్ణ పర బ్రహ్మమునందుఁ జూడవలయును అప్పుడు దమంత తామే లేక పోవుచున్నారు.

## పునరావృత్తి రహిత చేతన పద్ధతి

మణిమంత్రౌషధములచేత నగ్నియొక్క ప్రకాశ శక్తి (యుష్ణశక్తి) కట్టుబడినట్లు నచల పరిపూర్ణస్థితియందు నఖండ చైతన్యముయొక్క చేతన మరికట్టఁబడిన యెడల నెఱుకయొక్క పునరావృత్తి రహితము కాగలదు.

## ఎఱుక యొక్క శూన్యస్థాన నిర్ణయము

చలికి మంట వేసుకొనువాఁడు, మంటకు దూరముగాని యట్లును, మిక్కిలి సమీపముగాని యట్లు సమాన లక్షణముగా నుండును. అగ్నియొక్క వేఁడిమియు, చలియు నీ రెండు కలియు చోటును, సమాన లక్షణమని దెలిసికొని అగ్నియొక్క వేడిమి చివరయు చలియొక్క చివరయు నీ రెండు గలియు నంత్యస్థానమనఁగా : నది వేడిచోటు గాదు. చలిచోటుగాదు. కనుక నీ రెండు కలియుచోటు శూన్యస్థానమని చెప్పఁబడును. అచల పరిపూర్ణము, ఎఱుక ఈ రెండు దెలియు చోటు, అనఁగా ఈ రెంటిమధ్య శూన్యస్థానము దీనికి అభావమని పేరు. ఈ స్థానము సామాన్యులగు సాధకులకు బ్రహ్మో వాహమస్మి యను బ్రహ్మవేత్తలకు గోచరము గాదు. అచల పరిపూర్ణ రాజ యోగావలంబనులు మాత్రమే దీనిని దెలుసుకోగలుగుచున్నారు.

## ఎఱుక యొక్క అచలత్వ పద్ధతి

దేవాలయప్రతిష్ఠలయందు ధ్వజస్తంబమును, మంత్ర పూరితము చేత ప్రతిష్ఠించి కదలకుండుటకై దాని నడిమి సందులను గ్రుచ్చి గ్రుచ్చి గట్టిచేయు విధముగా : మంత్ర పూరిత వాక్య నిర్మితముచే నఖండచేతనము యొక్క వస్తు నిశ్చయ జ్ఞానమును గలిగించి దాని చేతన పద్ధతివలనఁ మఱలఁ బరిణామము బొందకుండ నచలస్థితి వలన ఎఱుకకు స్థిరత్వము గలిగించిన యెడల నయ్యది శూన్యమగును. ఈ పద్ధతిచే నెఱుకకు నచలస్థితిని గలిగించుట బోధాగ్నియని పెద్దలు చెప్పుదురు. బోధాగ్నిచేత నెఱుక రహితము సాధించనగును.

### పోయిన ఎఱుక తిరిగి యావరించని విధము

పిశాచముసోఁకినవానికి మంత్రానుష్ఠానముచేత నాపిశాచము వీడిపోవును తిరిగి యావరింపకుండ యంత్రధారణ చేయునట్లు గురువుయొక్క యనుగ్రహమువలన ఎఱుక పోవును తిరిగి యావరింపకుండ స్థితియను రక్షయందు నుండవలయును. ఈ రక్షణ గురువానుగ్రహమువలనఁ గలిగిన యచలస్థితి యనఁబడును.

### పునరావృత్తి రహితము

దీప ప్రకాశము ఘటపటాదులను జూపి-దీపమునుజూపి, దీపములోనే తాను పోయినట్లు చేతనా పరిణామమగు నింద్రియ సముచ్ఛ్రయము, బాహ్యాంతర ప్రపంచమును జూపి ప్రత్యగాత్మనుజూపి చైతన్యముతోనే తాను లేక పోవుచున్నది.

సూర్యునియందుండు సుష్ణకిరణములు జగత్తునందుఁ బడి జగత్తును గాల్పక సూర్యకాంతమణియందుఁబడి యగ్నిజ్వాల గలిగి జగత్తును గాల్చు విధమున నచల పరిపూర్ణ పరబ్రహ్మస్థితి శరీరమందుఁబడి శరీరమును విక్షేప రహితమొనర్పక అంతఃకరణాధిష్ఠాన స్వప్రకాశ ప్రత్యగాత్మయందుఁబడి దానిని విక్షేప రహితమొనర్చును. దానివలన పునరావృత్తి రహితమగును.

### ఎఱుక తన యావరణమందుఁ దాను నశించు విధము

చెట్టునందుఁ బుట్టిన నిప్పు చెట్టును గాల్చివేసి దానితోఁగూడ దాను నశించునట్లు విక్షేప రూపమైన ఎఱుక అచలస్థితియందు పునరావృత్తి రహితముతోఁ బాటు తానుగూడ నశించును.

### అచల స్థితిగల ఎఱుకయందు సంకల్పమ్ములు చేరని విధము

నిప్పుచేత కాలుచుండిన పర్వతమును జీవరాసులెట్లు చేరవో అట్లు బోధాగ్నిచేత దహింపబడుచున్న యంతఃకరమున సంకల్పములు చేరవు.

### ఎఱుకయొక్క ఉనికి నిర్ణయము

బూరుగు చెట్టునకు నుపాధికారణమగు విత్తనము బూరుగు దూది యందు నగపడకున్నను నున్నదని, ఎట్లు నిర్ణయింపఁబడుచున్నదో అట్లు

సర్వమునకు నుపాధికారణ మఖండచేతనము ్రాంతిబవళ్ళను నిర్ణయములేక సర్వాంతరములయందు నిండి ఉపాధిఁగలుఁగ జేయుచున్నదని నిశ్చయ మగు చున్నది.

## త్యాగ పద్ధతి

అభిమాన త్యాగమువలన, దేహ త్యాగము కాబోదు. ఉపాధికి కారణ మగు నెఱుక త్యాగమువలన దేహత్యాగమగును.

## భ్రాంతి రహిత పద్ధతి

మానస సరోవరమునందు సంచరించు రాజహంస దైవికముగా తామర తీగలందుఁ జిక్కుకొనియున్నను, నోటిచేత వానిని కొఱికివేయుచు భయరహితమైన ఆకాశమునకు నెగసి విహరించునట్లు జనన మరణ భ్రాంతి రహితాంతఃకరణ వృత్తిఁగలవారు దైవికముగా భ్రాంతియందే జిక్కుకొని కదలకయున్నను దమ పరిపూర్ణస్థితివలన భ్రాంతిని దప్పించుకొని జనన మరణ భ్రమ రహితస్థితియందు యుందురు.

## పూర్ణచేతనముయొక్క రహిత పద్ధతి

ప్రజ్వలించుచున్న దీపము దన్నాశ్రయించిన వత్తిని చమురును, సర్వ మునుకాల్చి వానితోగూడఁ దాను నశించుచున్నది. అట్లే యచలస్థితియందు విశేష రహితమగు యెఱుక తన్నాశ్రయించిన తనపరిణామ పద్ధతియందుఁ గల యింద్రియ సముదాయచలసత్వము నశింపఁజేయుచు వానితోపాటు తానుఁగూడ నశించుచున్నది.

## అచల పరిపూర్ణ పరబ్రహ్మయొక్క నిర్ణయపద్ధతి

ఘటమును యెత్తుకొని పోవువాఁడు దానియందలి జలము మాత్రము తీసికొని వెళ్ళుచున్నాఁడు గాని, ఆకాశమును దాని యవకాశమును దీసికొని వెళ్ళనట్లు నచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు బ్రహ్మాండ పిండాండాకార ములుగానున్న యెఱుక దానియందలి కోశభాగంబులను నవస్థా రూపమగు మార్పుల జేయుచుండును గాని అచల పరి పూర్ణమును మార్పుఁజేయ జాలదు. అవస్థారూపమగు మార్పు అనఁగా : సృష్టి స్థితి లయత్వములుఁ బొందింపలేదు.

## ఎఱుకయొక్క పరిణామము మఱియు నధోగతి పద్ధతి

చెఱువుయొక్క కట్ట తెగినయెడల దాని యందలి నీరు నలుదిక్కులం దాటి అధోగతిం జెందినట్లు అచల పద్ధతినుండి విడివడిన ఎఱుక యనేక రూపములుగాఁ బరిణమించి నీచయోని ప్రాప్తిజెందును.

## అచలస్థితి నార్జించు విధానము

చీమలు పుట్టలు పెట్టినట్లు నచల పరిపూర్ణ స్థితి క్రమముగా నార్జింపవలయును.

## గృహస్థాశ్రమముయొక్క యావశ్యకత

నదీ నదములు సముద్రమువలకు ప్రవహించు రీతి నితరాశ్రమ ధర్మపరాయణులు, గృహస్థుల నాశ్రయించి చరితార్థతఁ బొందవలయును. అట్లుగానిచో వారికి జీవితాకాంతయే యుండదు.

## ధర్మమునందలి సత్యము గ్రహించు పద్ధతి

దారియందుఁ బోవుచున్న వానికి సుందరమైన బంగారు వస్తువు దొరికినచో దానినిఁ జూచి ఎంతటి నేర్పరి ఈ వస్తువునుచేసి యున్నాఁడో యని సంతోష చిత్తముతో దానియందలి సత్యమునెట్లు నిర్ణయించునో ఆ పనిఁ దెలిసికొనుటకై తన్నిర్మాతల నెట్లు సమీపించునో అట్లే, సత్య ప్రబోధ యందలి సత్యమును గ్రహించి సత్యప్రబోధకులను నాశ్రయించును.

## ఎఱుకయొక్క అధోపరిణామ పద్ధతి

సూర్యుఁ డస్తమించునపుడు జారపురుషుఁడు పర స్త్రీ గమనమును చోర పురుషుఁడు చోరత్వమును, విద్వాంసులు సత్కార్మాచరణములను నాచరింతురు. పిమ్మట వారు తమో రూప సుషుప్తిఁ బొందుచున్నారు. కావున సత్కార్మాచరణపరులు దేవ మనుష్య జన్మలను నొందుచున్నారు. దుష్కార్మాచరణపరులు పశు, పక్ష్యాది నీచయోనులయందుఁ బుట్టుచున్నారు. అందుచే సూర్యుఁ డస్తమించు విధానము గురుమూర్తివలనఁ దెలిసి నైష్కర్మ్య పరుఁడుగా నుండవలయును.

### సామాన్య బోధలవల్ల ఎఱుక నశింపదు

ఎంతటి వేఁడి నీరు చేతనైన యింటికప్పు తగులఁబడనియట్లు, అల్ప బోధలచేత ననఁగా : యమనియమాది యోగసాధనలవల్ల సహంగ్రహహోపాస నాది బ్రహ్మై వాహమస్మివల్ల యెరుక నశింపదు.

### ఎఱుకయే ఎఱుకయొక్క ఉత్పత్తి స్థితిలయములకు కారణము

సూర్యునియందలి జలకిరణములు భూమిపైన వర్షరూపముగాఁబడి గుంటలు మెఱకలు నిండి చెఱువుగా నేర్పడును. వానియందు సూర్యుఁడు ప్రతిఫలించును. శీత కిరణములచేత నీటియందు జలచరములను నితర వస్తు సముదాయములను సృష్టించును. ఉష్ణ కిరణములనుఁ బ్రసరింపఁజేసి నీటిని దానియందలి ప్రతిబింబ రూపమును దనయందు నైక్యము చేసికొను విధమున నెఱుక సర్వమునకుఁ దానే కారణముగానుండును.

### మానవోపాధియొక్క కర్మ పద్ధతి

ప్రొద్దు గ్రుంకినచో తెల్లవారినవరకు సూర్యోదయము కానియట్లు విజ్ఞానమయాత్మ రూపమగు మానవోపాధికిఁదగు కర్మాచరణ విధానమునందే మానవోపాధి వచ్చును. కాని యితరత్ర అనఁగా యర్ధరాత్రి, ప్రభాత సమయములయందు, సూర్యోదయము కానియట్లు మానవోపాధిరాదు. కావున నీ యుపాధియందే జన్మరహితము. అనియిట్లు ఈ పద్ధతిని దెలిసికొనవలయును.

### ఎఱుకను దెలియునట్టి పద్ధతి

కట్టయందలి యగ్నినిఁ దెలియవలయుననినచో రంపముతోఁ గోసినను, బాడిసెతో చెక్కినను దెలియదు. రెండు కట్టలను, జేర్చి యొకదానితో నొకటి చిలికినచో అగ్ని బయలుదేరును. అట్లే పెఱుగును కవ్వముచే మధించిన వెన్న తనంతటతానే పైకివచ్చు విధముగాఁ తత్వ పరిశోధనవలనఁ దనంతటతానే ఎఱుక బయలుపడును.

### అచల పరిపూర్ణమును దెలియు పద్ధతి

తన ముఖము తనకుఁ గానరాక పోవునెడల నది లేదని నిర్ణయము గానట్టును, ఉన్నదని నిశ్చయ మగునట్లును ఎట్లు సిద్ధాంత మగుచున్నదో అట్లే

అచల పరిపూర్ణ పరబ్రహ్మము దెలిసి తెలియక, తెలియుచున్నది. అందు వలన లేదను నిర్ణయముండదు.

### ఎఱుక తనంతటతాను నశించు పద్ధతి

అగ్నిహోత్రునికి నాఁకలియైనచో నొకరువండి పెట్టవలసినపని లేనట్లు సూర్యునిఁ జూచుటకు దీపమవసరములేనట్లు ముంజేతి కంకణము జూపుటకు నద్దమవసరములేనట్లు పూర్ణ పద్ధతియందు సచలస్థితిఁ బొందిన ఎఱుక యితర యే సాధనలులేక తనంతటతానే నశింపవలయును. నశించును.

### అచలమునందు నెరుక చలింపని పద్ధతి

కొండకుఁ గుఱిఁ బెట్టిన అంబు తప్పిపోవనియట్లు, అచల పరిపూర్ణ పద్ధతియందు సచలత్వము బొందిన యెఱుక యచలత్వమునుండి తప్పి చలనత్వము బొందదు.

### స్వార్ధ పద్ధతి

పశువుల దృష్టి కొన్ని యడుగుల పరిమాణముకన్న హెచ్చు పరిమాణ ముండనట్లు, స్వార్థుల దృక్పథము. అనఁగా భావము, శక్తి, కీర్తి తన యావరణములో ననఁగా భార్యా పుత్రాది బంధువర్గములోనుండును. సర్వ వ్యాపకముగా నుండదు.

### జననమరణ భ్రాంతిపరుల విధి

కాలికి ముల్లుగ్రుచ్చుకొన్నచో దాని వింకొక్కముల్లుచేఁ దీసి రెంటినిఁ బాఱవేసినట్లు అజ్ఞానమును జ్ఞానముచేతఁ దెలిసి, అనఁగా మిశ్రమ చేతనము (ఎఱుకను) నఖండ చేతనముచేఁ (నఖండ ఎఱుకచే) దెలిసికొని ఈ రెంటిని రహితము చేసికొనవలయును.

### భ్రాంతి రహిత ప్రబోధయందు ముక్తి నొందనీయని కారణము

స్థూలమునుండి చేయునట్టి కర్మ సముదాయ ఫలంబులు. సూక్ష్మము నందుఁ జేరి కర్మోపాధికిఁ గారణమగుచున్నవి అనఁగా : మలిన చేతనము నందుచేయు కర్మఫలంబులు నఖండ చేతనమందుఁజేరి జన్మాంతరములయందు ననుభవమునకు వచ్చుచున్నవి కావున కర్మ రహిత విధానమందు మలినతత్వ పద్ధతియగు కార్యము అఖండ పద్ధతియగు కారణము రెంటియందు నొక

కార్యమును మాత్రము విడిచి కారణము విడువనందున ముక్తి కలుఁగదు. కావున కార్య కారణములు రెండును విడువవలయును. కార్య కారణములు రెంటిని విడిచినన౽దే శాంతి సౌఖ్యములు గలుఁగునుగాని కర్మను విడిపింపఁ జేసి కారణమందు ప్రబోధల నెన్నికోట్ల సంవత్సరములు ప్రబోధించినను నైక్యరూప శాంతి సౌఖ్యము చేకూరదు.

### ఏకత్వముగానున్న నెరుకయందు ననేకత్వ నిర్ణయము

అగ్ని ఏకత్వముగానుండి పంచాగ్నులైనట్లు వాయు వేకత్వముగా నుండి పంచ ప్రాణములైనట్లు సూర్యుఁ డేకత్వముగానుండి నేత్రేంద్రియ రూపమున ననేక విధములైనట్లు నెఱుక ఏకత్వముగానుండి జగద్రూపమున ననేకత్వము జెందుచున్నది.

### ఎరుకను మాయయని యనుటకుఁ గారణము

ఇంద్రజాలకుఁడు జాలవిద్యలఁ జూపిన యనంతర మే పద్ధతికూడ నిజముగాక తుదకు నింద్రజాలకుఁడుగూడ లేకపోవుచున్నాఁడు. అట్లే ఎఱుక ఉపాధులయందు నెన్నియో చిత్రవిచిత్ర కార్యము లొనర్చి కార్యములతోఁ బాటు దానుగూడలేక పోవుచున్నది. యిందువలన నెఱుక మాయయని చెప్పఁ బడును.

### ఎఱుక భ్రాంతి రహిత దృష్టాంతరములు

#### ఎఱుక పవిత్ర పద్ధతి

సూర్య గ్రహణమువలనఁ గలిఁగిన మలినము గంగా స్నానమువలన పవిత్రమగునట్లు నెఱుకయొక్క భ్రాంతి గురుపాదోదకమువలన పరిశుద్ధము గావలయును.

#### ఎఱుక నశించు పద్ధతి

1. దీపము తానున్నచోటనే నశించునట్లు భ్రాంతి రహితాంతఃకరణా దిష్ఠానమగు నెఱుక అంతఃకరణమునందే నశించును.

2. మహావాయువు వీచినచో మేఘ జలంబులు, జలరహితమై నిర్వీర్యముగా నశించునట్లు అచలస్థితివలన సర్వకోశంబులు నిర్వీర్యమయి నశించుచున్నవి.

3. కర్పూర మగ్నిచేత దహించునప్పుడు ద్రవరూపముబొంది కఠినత్వ మతోఁబాటు అగ్ని కర్పూరము రెండును నెట్లు నశించి పోవుచున్నవో యట్లే యెఱుక అచల పరిపూర్ణ స్థితివలన ద్రవరూపమైన పరాచేతన పద్ధతినొంది బోధాగ్నిచేత దహింపంబడి సర్వము నశించుచున్నది.

4. ఔషధమువలన వ్యాధి నశించునట్లు నచల స్థితివలన నెరుక నశించు చున్నది.

5. ఆకలి, దప్పులు అన్న పానాదులవలన నశించునట్లు నచల స్థితి వలన నెఱుకయు భ్రాంతియు నశించుచున్నవి.

6. ద్రవ్యార్జనవలన దరిద్రము నశించునట్లు పరిపూర్ణ బ్రహ్మ నిర్ణ యము వలన నెఱుక రూపఱుచున్నది.

7 వస్త్రవిసర్జనవలన మానము బోయినట్లు పరబయలు నిర్ణయమందు నెఱుక నశించుచున్నది.

8. త్యాగమువలన లుబ్ధత్వము పోయినట్లు నచల పరిపూర్ణ శాశ్వత నిర్ణయమువలన నశాశ్వతమగు నెఱుక పొలకువలేక నాశమగుచున్నది.

9. విషమువలన దేహము నశించునట్లు అచలత్వమువలన విక్షేప మగు నెఱుక నశించుచున్నది.

10. సహగమనముచేయు వారికి దేహాభిమానములేనట్లు అచల పరి పూర్ణ ప్రబోధకులకు నెరుకయొక్క యభిమానముండదు. అనగా: గురు తెరుఁగు శరీరాభి మానముండదు.

కం॥ భ్రమరహిత సహిత జనులకు । సుమనసులను నరులసమము । జూచిన విశ్వం । బమరిలేకుండ నుండును । క్రమమున కలవంటి దగుచు । కడు నిజము సుమీ॥

కం॥ కలవారికి మేలుకలో । గలవారికి జాగ్రతందు । కలహము గలదా । కలహించి లేని వారలు । కలవారలె గాని మేల్క । వారు గారె న్నటికిన్॥

# స ప్తమ సోపానము

## కర్మ నిర్ణయము

కర్మ యనఁగా చేయుటయని యర్థము. అధిష్ఠాన చేతనత్వముగాక ఇతర యే పద్ధతులవలన కదలుటయు చేయుటయు నను పద్ధతిలేదు. కావున నధిష్ఠాన చేతన బ్రహ్మము కర్మయని చేయునదియని నిర్ణయము. అట్లగుటచే కారణ కర్మ, కార్య కర్మయని కర్మ రెండువిధముల భేదముండును.

1. కారణ కర్మయనఁగా : నధిష్ఠాన బ్రహ్మచేతన కర్మ, ఇది కోరిక లేక తనంతట తాను జరుగుచుండును. అందువలన నిష్కామ కర్మయనియు నైష్కర్మమనియు చెప్పుదురు. శరీరమును బాల్య యవ్వన కౌమార వృద్ధాప్య మరణములు క్రమముగాఁ బొందించి యియ్యది తిరుగా సృష్టించును. ప్రాణము నిశ్వాస రూపమునఁ బ్రవర్తింపఁ జేయును. ఎందు సౌఅకాయ సముద్రమున నున్నంతవరకు రాత్రింబవళులను నిర్ణయములేక నొక తెప్పపాటు కాలమైన స్థిరత్వముగా నుండనీయక యెట్లు చలింపఁజేయునో అట్లు సంతఃకరణ రూపమైన మనస్సును స్తిమితముగా నుండనీయక ఎల్లప్పుడు చలనత్వము గలుగఁజేసి జనన మరణములఁ బొందించును. ఈ వృత్తి కేవలాత్మవల్లనే జరుగుచున్నదిగాని ఇతరుల సంకల్పమువలన జరుగదు. ఎట్టులనఁగాఁ దాను వేయి సంవత్సరములు బ్రదుకఁ దలఁచును గాని ఆత్మ బ్రదుక నీయదు. తానెల్లప్పుడు బాల్యమునందై నను, యౌవనమునందై నను, కౌమారము నందై నను, వృద్ధాప్యమునందై నను నుండ దలఁచును. ఆత్మ అట్లుండనీయక మార్పుఁ జేయుచుండును.

తాను యోగమునందుండి కాలమును జయించితిని, అని నిర్ణయించును. కాని ఆత్మకాల గర్భములోనే వానిని నుంచి బాలయౌవన కౌమార వృద్ధాప్య దశలు గలిగించును. కావున యీ పద్ధతి ఆత్మయొక్క సహజ నిర్ణయము.

2. కార్య కర్మ యనగా నన్న పానాద్యష్టైశ్వర్యంబులచే రక్షింపబడు చున్న వాఁడనని యంతఃకరణ పరిణామమును జ్ఞానేంద్రియములచే విషయ పంచకము దెలిసి కర్మేంద్రియములచే నన్న పానాదైశ్వర్యంబుల సంపాదన

విధానమునకు కర్మ నాచరించి వాని సిద్ధికై అంతఃకరణ విధానమునకు వేచి యుండుట కార్య కర్మ యనఁబడును.

### కర్మ యోగము

కార్య కర్మాచరణ పద్ధతియందు వచ్చు ఫలము దాను గోరక పర మాత్మార్పితముచేయుట కర్మయోగమని చెప్పఁబడును.

### జ్ఞాన యోగము

అధిష్ఠాన పరబ్రహ్మ చేతనమే కర్మయని తెలిసి ఫలాఫల నిర్ణయము లేక పరమాత్మ నిర్ణయమునందు నుండుట జ్ఞానయోగ మనఁబడును.

### కర్మ సన్యాస నిర్ణయము

తానాచరించు కర్మ ఫలంబుల పరమాత్మార్పితము చేయుటచేఁ దాను నిష్కాముఁడగు బ్రహ్మత్వము నొందెదనను నిర్ణయము కర్మ సన్యాసమని చెప్పఁబడును.

### జ్ఞాన సన్యాసము మరియు మోక్ష సన్యాసము

అధిష్ఠాన చేతన బ్రహ్మము, విక్షేప రూప కర్మాచరణ పద్ధతిగఁగలదు. కావున దానియందలి సర్వ పరిణామ మేకత్వమొనర్చి దాని విక్షేప పద్ధతి సచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు నశింపఁజేయుట మోక్ష సన్యాసము. జ్ఞాన సన్యాసము అని చెప్పఁబడును.

### కర్మ పద్ధతి యందు మానవుఁడే గొప్పవాఁడు

కర్మకు కేంద్రస్థానమగు నధిష్ఠానచేతన బ్రహ్మమును దెలిసికొని బ్రహ్మాండమునందుఁ గల సర్వ శక్తులను తనవంక నాకర్షించుకొని కేంద్రీకరింపంజేసి గొప్పగొప్ప మహత్తులను బాహ్యమునకుఁ బ్రవేశ పెట్టుచున్నాడు. కావున మానవుఁడు సర్వ శక్తిమంతుడు సర్వజ్ఞుడు సర్వోపాధులయందు శ్రేష్ఠుఁడని చెప్పఁబడుచున్నాడు. అందుచే మహాపురుషులు కర్మిష్ఠులుగా నిర్ణయింపఁబడుచున్నారు.

## కర్మా చరణ విధానము

శిష్టాచార కర్మ శాస్త్ర సమ్మతమని దాని నాచరణీయ్య విధానమువలన దైవ శ్రేష్ఠ మానవ జన్మ కలుఁగునని భారతీయల ధర్మము క్రైస్తవ మహమ్మదీయులకు గిట్టదు.

శాస్త్రి నియమమునకు వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించు కర్మ వామాచారమని దాని నాచరణీయ్య విధానమువలన నీచయోని ప్రాప్తములగు పశు పక్షి జన్మలు కలుఁగునని నిర్ణయించి యున్నారు. ఒకే దేశమునందలి నిర్మిత పుణ్యకర్మ నింకొక దేశమునందు పాపకర్మలుగా సిద్ధాంతము చేసియున్నారు. ఎట్లులనగా: కర్మవలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రత్వములు నిర్ణయింపవలెనని ఆర్యుల సిద్ధాంతము.

జన్మమువలనే చాతుర్వర్ణములు గలుఁగుచున్నవి. వాని మిశ్రమము వలన నితర జాతులేర్పడు చున్నవి. అని వైదిక బ్రాహ్మణ సిద్ధాంతము.

పరమాత్మ సృష్టిలో నుపాధులబొందిన ప్రతి మానవుఁడు సమానులే; కాని నిందు వ్యత్యాసము లేదని యొక సిద్ధాంతము.

స్త్రీ పురుషుల పద్ధతియందు, సమాన ప్రతిపత్తులుండవలయునని యొక సిద్ధాంతము.

ఈ వ్యత్యాసములు వ్రాయవలెననిన నూర్లకొలఁది మానవ జన్మోపాధులు సరిపోవు. అందువలన నిట్టి నిర్ణయములందు నేది న్యాయమో; యేది యన్యాయమో నిర్ణయించుటకు సాధ్యముగాకున్నది. మఱియును శిష్టాచార కర్మ నాచరించినను నంతఃకరణమునందు సువాసనా రూపముగా నుండి అయ్యది యుపాధిని కలిగించుచున్నది.

వామాచార కర్మ యాచరించిన నంతఃకరణమునందు నయ్యది దుర్వాసనా మయముగా నుండి యుపాధికి కారణమగుచున్నది. కావున నీ రెండు పద్ధతుల మాని ప్రేమరూపాంతఃకరణము గలిగి తన సంతతిపైనున్న దయ యితర సంతతిపై నుంచవలెను. సత్యమగు వాక్కుతో నున్నది యున్నట్లు జెప్పవలయును. స్వార్థ రహిత శరీర సహాయముతో నితరులకు కష్టకాలము నందు దోడ్పాటుఁ జూపించి ప్రతి ఫలమును గోరకుండవలయును. ఇట్లు ప్రవర్తించువారల యంతఃకరణము పరబ్రహ్మను సంధానమై సంకల్ప రహి

తమై యుండును. వారి శరీరము రోగబాధలు చెందకయుండును, వారివాక్కు ప్రయోజన హీనముగాక సిద్ధత్వము గలిగి ప్రయోజనా స్పదమునై యున్నది. కావున నిట్టి ప్రవర్తనఁగలవారి యాత్మశక్తి యలంకారముగాఁ గాక క్రియా రూపమున నుండఁగలదు. మఱియు నింద్రియ సముదాయ మసత్యమును ద్యజించి సత్యమునందుఁ బ్రవర్తనము జేసినయెడల పరమాత్మ శక్తి యా యింద్రియములయందుఁ బ్రవేశించి గొప్ప శక్తివంతమై యుండును. ఇంత గొప్పశక్తి యితర యోగపద్ధతులయందుఁ గలుఁగఁబోదు. ఇట్టి రహస్యము సామాన్యులకుఁ గోచరముకాదు.

## కర్మయొక్క రహస్య నిర్ణయము

కర్మయందుఁ గర్తృత్వ రహితము, కర్తృత్వ రహితమునందుఁ గర్మాచరణ మెవ్వఁడు దెలిసికొనుచున్నాడో వాఁడు కర్మ రహస్యము దెలిసిన వాఁడనఁబడును. ఇట్టి లక్షణయుతుఁడలజడిఁ గలిగిన పట్టణ ప్రదేశములందు నున్నను కొండ గుహలయందుండినట్టి ప్రశాంత పురుషునివలె నుండును. అతఁ డెల్లప్పుడు కర్మ చేయుచునే యుండును.

## పాప కర్మ రహిత పద్ధతి

పాప కర్మలు చేయక యుండుటయే పాప రహితముగాని పాప కర్మలు చేసి మంత్రములు జపించుటయు దాన ధర్మాదులొనర్చుటయు లోకమునఁ జరుగుచున్నది కాని వీనివలన నెంత మాత్రము పాప రహితము కాజాలదు.

## మానవ జీవిత మెందులకు

ప్రథమమున మానవసేవకొఱకు పాటుపడవలయును. రెండవసారి భగవత్సేవకొఱకు మానవుఁడు తన జీవితమును వినియోగ పఱచవలయును. అట్లుగానియెడల నది నిరర్థకమే యగును.

## గృహస్థ ధర్మ నిర్ణయము

సోదర మానవులు చెట్టుక్రింద చలికి వణఁకుచు నాహారములేక నుపవాసముతోఁ గాలము గడుపుకొని యుండఁగా చెట్టుపైనున్న పక్షులు ముక్కుతో పుల్లలనున్న నగ్నినిఁ దెచ్చి మంటవేసి వారిచలిఁ దీర్చి తమ శరీరముల వారి కాహారముగా నొసఁగిన విధముగా గృహస్థులు తమ ఐది పంచలఁ

గాచుకొనియున్న దీనులగు నతిధి జనులకు వారి సర్వస్వము నొసఁగి నాద రింపవలయును. ఇట్టిది యే గృహస్థాశ్రమ ధర్మము.

## ఉపకార నిర్ణయము

ఒక్కపూట భోజనము పెట్టుటయు నుపకారమే. కొంతకాలమువరకు మఱియు నాజన్మాంతము వఱకు బ్రదుకుఁదెరువు గల్పించుటయుకూడ యుపకారమే ! ద్రవ్యమిచ్చుటకైనా; శాశ్వత సుఖము గలుగఁజేయు పారమార్థిక జ్ఞానము గలిఁగించుటయు మహోపకారమగును. కావున జ్ఞానో పకారము చేయువారలు మహోపకారులనఁ బడుదురు. జన్మ జన్మాంతరమున లోకమునందలి బాధలు, దన కనక వస్తువాహన వితానముచే దీరిపోవు. జ్ఞాన ప్రబోధవలన నవి తీరఁగలవు. మానవ సమాజమునకు జ్ఞానముబోధించి జ్ఞానులను జేయుట మహోపకారమని చెప్పఁబడును.

## కర్మానుభవ స్వరూపము మఱియు పూర్వ జన్మ సంస్కార నిర్ణయము

సముద్రమునందుఁ బెద్ద యలలు పోవునప్పుడు, చిన్నయలలు వచ్చు సూచన తెలియుచుండును. చిన్నయల పెద్దయలగా మాఱి యింకొక చిన్న దానిని నిర్మించును. ఆరీతిగా : మనస్సునందుండు, సంకల్పము యొకటి పూర్తియైనప్పుడు వింకొకదాని సంస్మరణ సూచించి యడఁగిపోవును. కావున దీనిని సంస్కారమని చెప్పుదురు; సంస్కార రూపమైన చిహ్నములు పైకి నగపడక పోయినను అంతఃకరణమందుండి శక్తివంతముగాఁ బనులు చేయు చుండును. మన స్వరూప చిహ్నములు క్షణక్షణమునకు శక్తివంతముగను, శక్తి హీనముగను, నెన్నియో విధముల మార్పు జెందుచుండును. ఇది సంస్కార చిహ్నమే ! దీనినే పూర్వజన్మ సంస్కారమని చెప్పుదురు.

## సత్య స్వరూప నిర్ణయము

ఇంద్రియముల స్వాధీనము నందుంచుకొన్న పరమాత్మ స్వరూప సత్యాను సంధానము చేయువాఁడు. కాలాను గుణ్యముగాఁ దనకెంతటి విపత్తు సంభవించినను, దానింద్రియములకు స్వాధీనముఁకాడు. వానిని వాని స్వరూ పములయందు, బ్రవర్తింపఁజేయడు. తాబేలు దన పాదములను దన కడుపు లోనికి లాగుకొనును. ఆపత్కాలమునందు నెందఱెన్ని విధముల బాధించి

నను నది తన యింద్రియములను పైకి రానీయదు. అట్లే యింద్రియ వశీకరుడుండును. ఇట్టి సత్య ప్రవర్తనలకే భ్రాంతి రహిత స్థితి కలుగును.

### ఉదర పోషణ విధానము

మాంస విక్రయముచేతఁగాని; బంగారు విక్రయము చేతఁగాని, గడించిన ద్రవ్యము గర్భపోషణకే యగును. కావున వ్యవహార వ్యత్యాసము ఘటింపక సంపాదన విధానము న్యాయముగా నాచరించవలయును. గడించిన ద్రవ్యముతో మాతా, పితృ, సోదర, భార్యా, పుత్రాదులను సమముగాఁ జూచి పోషింపవలయును. వీరియందు హెచ్చుతగ్గులు చూపించరాదు. అట్లయిననది నిర్హేతువగును.

### ప్రయోజన హీనము

కుచ్చితుఁడు గుంటలోఁబడి యితరులకు దానికి గూఢార్థము గల్పించి చెప్పును.

### ఆడంబర లక్షణము

వర్షములేని యురుములు మెఱుపులు, ప్రయోజన హీనములు, బహు కాడంబరములు.

### లక్షణ విధానము

స్థావరజంగమాత్మకములగు సర్వోపాధి స్వరూపములు, జీవాత్మ రూపములే. కావున నాత్మను నాత్మయే పోషించుకొనును. కాని యొకనిచే నొకరు రక్షింపఁబడుచున్నారు అని యెన్నఁడును దలంపఁగూడదు. ఇది ఆత్మ ద్రోహమని చెప్పుదురు.

### ప్రపంచ పద్ధతి

ప్రపంచ మేకాలమందైనను నేయుగమందైనను పుణ్యపాప సంకలితముగా నుండును. కావున నెవ్వరినిఁగూడ మనము నిందింప వలసిన పనిలేదు. ఎందుకనఁగాఁ బ్రపంచము. మానవోపాధి యందున్నవారలకు జ్ఞానాభివృద్ధి చేయు సాధన పదార్థముగా నున్నది. దానియందు మనము పరిశ్రమంజేసి యాత్మ జ్ఞానాభివృద్ధిని స్థిరపరచుకొనవలయును. కాని ప్రపంచము నీచమైన దని దానిని విల్చకూడదు, అను వాక్యంబులచేత నిందింపరాదు. అందువలన

నీ కేలాటి ప్రయోజనము గలుగదు. మఱియుఁ బ్రపంచము కుక్కతోఁక వంటిది దాని నెవ్వరుఁ గూడ చక్కజేయలేక తెగనఱికి నట్లుఁ బ్రశాంత పరుఁడుగానుండి ప్రేమాస్పదమైన ఆత్మ జ్ఞానాభివృద్ధిచేసికొని జనన మరణ భ్రాంతి తెగనఱుకవలయును.

## ధర్మ నిర్ణయము

మనము చేయు పనులయందు ధర్మమనునది యుండదు. అది మన యంతఃకరణము నందుండును, ఏపనులేయే పద్ధతులయందు జరుగుచున్నవో వాని విధి విధానము దెలిసికొను పద్ధతి అంతఃకరణమునందుండును. కావున ధర్మమునకు నంతఃకరణమే స్థానముగా నుండుచున్నది.

## మోక్షావసరము

కర్మయోగము నీ ప్రపంచము క్షణభంగురమని మనకుఁ బ్రత్యక్షముగాఁ దెలియఁజేసి మనచే నొప్పుకొనఁ జేయుచున్నది. అందువలన వ్యష్ట్యంతః కరణ రూపమైన జీవనము, లోకము, స్వర్గము, శరీరము, మనస్సు వీనిని విడిచిపెట్టినస్థితిఁ దెలిసికొనుటయే మోక్షమని, నిర్ణయము మరియు సాధన యని చెప్పఁబడును.

## పుణ్య పాప కర్మల నిర్ణయము

పుణ్యకర్మనుండి పాపకర్మ, పాపకర్మనుండి పుణ్యకర్మ సంభవించు చున్నది. కాని కేవల పాపకర్మగాని కేవల పుణ్యకర్మగాని ప్రత్యేక్యముగాలేవు. మనము లోకోపకారము కొఱకు నుపన్యాసములు చేయుచున్నాము. వానివలన మానవుఁడు బాగుపడి సౌఖ్యము జెందుచున్నాడు. ఇట్లు సౌఖ్యముజెందుటచే పుణ్యము గలుఁగుచున్నది. నోటినుండి వెలువడిన గాద్పువలన నెన్నియో క్రిములు నశించుచున్నవి. దీనివలన పాపము గలుఁగుచున్నది.

మూర్ఖులుగానున్న వారలమాయకులను బాధించెదరు వారికి యెంతచెప్పి నను వినరు. అందువలన వారిని దుదముట్టించవలసి వచ్చును. దానిచే పాపమువచ్చినను రక్షింపఁబడిన వారినుండి పుణ్యము గలుఁగును. కావున నేపనులు జేసినను కొంత పుణ్యమో బాపమో తటస్థించుచునే యుండును. అందువలన వానియందు లక్ష్యసాధనముంచక కర్తృత్వ రహిత కర్మాచరణ

మొనర్చువరెను. వానియందలి లక్ష్యసాధనవలన నాత్మఖండకారణమగు చున్నది. కాని అఖండ స్వరూపము కాజాలదు. ఆత్మయొక్క కర్తృత్వ సాధనయను లక్ష్యముకై మోక్షము చేకూరుచున్నది. కనుక యీ పద్ధతిఁ దెలిసిన వారే కర్మయోగులని నిర్ణయము.

## కర్మపాషండుల పద్ధతి

### కామ్యకర్మ-నిషిద్ధకర్మయని కర్మ రెండు విధములు

1. దేవమనుష్యజన్మలను గలుఁగజేయునట్టిది కామ్యకర్మ. 2. పశు పక్షిక్రిమి కీటకాదుల జన్మఁగలుగజేయునట్టిది నిషిద్ధకర్మ. ఈ రెండు పద్ధతుల యందు లక్ష్యము నుంచక "యదేచ్ఛఁగా: కర్మాచరణ మొనర్చినచో సంచితము నశించును. అందువలన జన్మరహితముకాగలదను నిర్ణయముకలవారు కర్మపాషండులని చెప్పఁబడుదురు.

కం॥ అనుభవ వేదాంతులమని । తినరాని పదార్థమెల్ల । తినుదుర్జనులఁ । కనటోకుము తద్భోధను । వినటోకుము యెన్నటికి వివేకవిచారా ॥

కం॥ జిహ్వోపస్థ విషయము । లెవ్విగలవొ వాటి విడువలేని గురువులఁ । యెవ్వరుజేరి కొలుతురో । యివ్వసుధను వారు జెడుదు రిదినిజముసుమీ ॥

కం॥ పాషండ మతమువారల । వేషంబులు జూచిశిష్య వితతిభ్రమించుఁ । యీషత్తిబోధెరుగక । దూషింతురు విన్న కన్న । దుర్భాషణలఁ ॥

కం॥ నిజగురుబోధ నెరుంగక । గుజగుజ శిష్యులకు జెప్పు । గురువులబోధల్। భుజగ విషోపమ మగుసుమి । సుజనౌఘము మెచ్చదట్టి । సుద్దిని పట్టీ ॥

కందార్థము॥ బలధన విద్యలు దుష్టుల । కిలగలిగిన నౌరుల నొంతురీర్ష్యము తోడఁ । బలధన విద్యలు శిష్టుల కిలగలిగిన నౌరులభ్రోతు । రెంతో మోద మునా । సీవీరెంటి నెరిగి మోదమునా । కలలోననైన దుష్టుల చెంతజేరాకు మేలమి శిష్టులచెంత కలనైన వదలాకు యెంతో మోదమునా । సీవీరెంటి నెరిగి మోదమునా ॥

కం॥ కనకకుసుమగంధవాసన । తనకొనగాదలచిషట్పదము గొనదటులన్ । వినదులేనహమె బ్రహ్మం । చవిపల్కె నృతతివిల్వ । నవియీ బోధన్ ॥

# అష్టమ సోపానము

## అచల పరిపూర్ణ పరబయలుయొక్క నిర్ణయము

ఆకాశమునందు పక్షులు ప్రవర్తించిన జాడ జలచరములు జలమునందు సంచరించిన గురుతు నెట్లు దెలియుటకు లేదో అట్లు అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు నెఱుకయొక్క రూపభ్రాంతి దెలియఁగూడదు. అట్టి పద్ధతిఁ గల దానిని నచల పరిపూర్ణ పరబయలని తెలియఁదగును.

## అవసరా నవసరములు

చీఁకటియందుండునట్టి పదార్థమునుజూచుటకు. నేత్రమునకు దీప సహాయము గావలయును. సూర్యునిఁజూచుటకు నేసహాయమవసరము లేదు.

## అశరీర పద్ధతి

ఈశ్వరుఁడుజీవులొనర్చు కర్మానుసారముగా ఫలములనొసఁగి తాన కర్తగానుండునట్లు పరిపూర్ణస్థితిఁగల యశరీరి లోకహితమునకు సర్వకర్మల నొనర్చియకర్తగానుండును.

## జ్ఞానసాధన పద్ధతి

సాధనలవలన నంతఃకరణశుద్ధియగును. కాని జ్ఞానముకలుఁగదు. విచారణవలన జ్ఞానముకలుఁగును గాని సాధనవలన గలుఁగదు. మోక్షముజ్ఞానము వలన కలుఁగునుగాని సాధనలవలనగలుఁగదు. కావున జనన మరణ భ్రాంతి రహితమోక్షమునకు. విచారణ అవసరము.

## విచారణ పద్ధతి

తామ్రపాత్రల శుద్ధిచేయుటకుఁ జింతపండు, యిసుక. ఇటిక రాయి పొడి కావలసియుండును. స్ఫటికమణిని శుద్ధిచేయుటకు పట్టిజలము మాత్రం చాలును నీవిధముగా నంతఃకరణశుద్ధి యొనర్చుటకు నొక్క పరిపూర్ణబోధ చాలును. అంతఃకరణమునందలి సంకల్పములశుద్ధిచేయుటకు నెన్నియోగసాధన లున్నను. నాసంకల్పములు తాత్కాలికముగాఁ బోయి నట్లుండి మఱలఁ దలయెత్తుచునేయున్నవి. వీనిని రూపుమాపఁగలిఁగినది యొకపరిపూర్ణ బోధయే.

## కర్మఫల పద్ధతి

అమావాస్యచీకటియందు నావరించిన మేఘములు చీకటినభివృద్ధి పరుచునట్లు కర్మ లజ్ఞానమును వృద్ధిచేయును. కాని అజ్ఞానమునుపోగొట్టజాలవు. పటము పటాంతరమందున్న యణువునకు విరోధికానియట్లు స్థూలావరణమునకు సూక్ష్మరూపమైన యెఱుక విరోధికాజాలదు. దానికయ్యది ఆధారమగుచున్నది.

## శత్రురహిత పద్ధతి

భూమండలమునందలి సమస్తరాజులను జయించిన చక్రవర్తికి నితర శత్రువులుండనియట్లు అచలపరిపూర్ణ స్థితిఁ గలవారలకు కాలత్రయ, ఈషణత్రయ తాపత్రయాదులును, జన్మజన్మాంతరస్థితియు, ప్రళయశత్రుస్థానమును, స్వర్గనరకలోక శత్రుత్వములును పీడింపజాలవు.

## ఎఱుకకు మూలములేని పద్ధతి

తల్లిలేనిబిడ్డలకు శరీరము, కులము, వయస్సులను నిర్ణయమేరీతిగానుండదో అట్లు మూలములేని యెఱుకకు శరీరకులవయోనిర్ణయము లెంతమాత్రముండఁజాలవు.

## ఎఱుక పరిపూర్ణముగాని విధము

గొడ్రాలికొడుకు తనతల్లినియెట్లు పుత్రవతిఁగా నొనర్పజాలఁడో గొడ్రాలు తనపుత్రుని కన్నకుమరుఁగా నెట్లుఁజేయలేదో అట్లే ఎఱుక అచలపరిపూర్ణముకాఁజాలదు.

## ఎఱుక రక్షణ విధము

గర్భిణిస్త్రీ తనగర్భమునందున్న శిశువును నపాయమురాకుండ నెట్లు గాపాడుకొనుచున్నదో అట్లే యెఱుక తనపరిణామరూపంబును, ప్రత్యగాత్మ, పరమాత్మరూపంబులను గాపాడుచున్నది.

## లోభ గుణముగలవాని జ్ఞానము నశించు విధము

ఉదయమునుండి సాయంత్రమువరకు కష్టపడి వడికిననూలుదారముతో పొయ్యి వెలిఁగించినట్లు లోభబుద్ధిగలవారు గురువాక్యములయందు వైరా

గ్యము, స్వకార్యములయందు శూరత్వము వహించి వారిజ్ఞానసిద్ధిని బూడిద పాలు గావించుకొనుచున్నారు.

## సత్త్వగుణ స్వరూప నిర్ణయము

గర్భవతియగు స్త్రీ తానుసంతానవతికాగలనని సంతోషమాపాద మస్తకపర్యంతము సకలేంద్రియములనెట్లు నావరింపఁ జేసుకొనుచున్నదో ఆరీతిగా ః సత్వగుణము సర్వశరీరము నావరించుకొనియుండునని తెలియ వలయును.

## రజోగుణ స్వరూప నిర్ణయము

సంతానవతియగుచున్నానని సంతోషముగలయువతి. మాతాశిశువులము సౌఖ్యవంతముగా నుండగలమొ యుండఁజాలమొ ? యనుభీతి లక్షణము చెందినది రజోగుణప్రవృత్తియని చెప్పఁబడును.

## తమోగుణ స్వరూప నిర్ణయము

గర్భిణీస్త్రీ ప్రసవవేదన నొందునప్పుడు సత్వరజఃప్రవృత్తులగావి తనస్థితినిఁగాని దెలియక వేదనయందుఁదాను మగ్నఁతజెందియుండుట యేది గలదో నదియే తమోగుణ స్వరూపమని తెలియవలయును. వేదాంతమునందలి యభిప్రాయమేకత్వము కనుఁగొనుటయు నట్టి యేకత్వముగనుఁ గొనుటకు తత్త్వశాస్త్రము అధ్యాత్మశాస్త్రము, అనురెండు శాస్త్రములు మనకుఁదోడ్పడు చున్నవి.

## తత్త్వశాస్త్ర నిర్ణయము

తత్త్వశాస్త్రమనఁగా ః ప్రపంచమంతయు నేకపదార్థముగామాఱును. అట్టిపదార్థ మాకాశమనిచెప్పఁబడును. ఆకాశముయొక్క సూక్ష్మభాగమే యాత్మ. ఈయాత్మ చేతనపద్ధతియందు పిపీలికాది బ్రహ్మపర్యంతము సృష్టి నిర్మాణదక్షతయగును. ఈయాత్మ తాటస్థ్యలక్షణమందు, సర్వములయమగును. కావున మనము చూచుచున్న సర్వబ్రహ్మాండ మావిరిరూపముగా మాఱును. అదియాకాశమునందుఁగలిసి యాత్మయందు లయమగును. ప్రవృత్తి నివృత్తులను బరంపరజనితములై యుండును. అందువలన ఆకాశాత్మల యేకత్వమునందు దనవ్యష్ట్యోపాధి యేకత్వము గనుఁగొనుటయే ముక్తియని చెప్పఁబడును. ఇదియే తత్త్వశాస్త్ర నిర్ణయము.

### అధ్యాత్మ శాస్త్రాభిప్రాయము

జ్ఞానేంద్రియ నాళములయందు మనస్సు యింద్రియ రూపమున నుండును. మనస్సునకు వెనుక బుద్ధీంద్రియముండును. దాని వెనుక జ్ఞానేంద్రియముండును. దాని వెనుక నాత్మయుండును. ఆత్మ ప్రకాశమువలన మనస్సు నిర్గతమై జ్ఞానేంద్రియములద్వారా : విషయములఁదెలిసికొని బుద్ధికి నివేదించును. దానినుండి జ్ఞానముగలిగి పునరాగమనము చేయుచుండును. అనఁగా మరల క్రియోన్ముఖము చెందుచుండును. ఇదియే కర్మేంద్రియ నిచయమని చెప్పఁబడును. మనస్సెట్టి ప్రయత్నముచేయునో అదియే తెలియుచుండును. కాని; యితర మేమియుఁదెలియదు. ఆత్మ ప్రకాశము ప్రతి మానవుని యందుండును. ఆత్మ ప్రకాశము దానని సర్వకార్యంబులాత్మ వల్లనే తెలియుచున్నవి. జరుగుచున్నవి. కావున ఇట్టి నిశ్చయమువలన సర్వమేకమేయగునని యధ్యాత్మ శాస్త్రాభిప్రాయము.

### దృష్టాంతము

వాది ప్రతివాదులకు సమత్వమైన విషయము దృష్టాంతమందురు.

### ద్రాష్టాంతికము

దృష్టాంత పద్ధతిగా తన స్వరూపమునందు నిశ్చయము గలిగించునది అనఁగా: వస్తు నిశ్చయ జ్ఞానముఁగలిగించునది ద్రాష్టాంతిక మనఁబడును.

ప్రమాణమనఁగా: నున్నదియున్నట్లు యథార్థ జ్ఞానము గలుఁగఁజేయునట్టి వాక్యములు ప్రమాణములనఁబడును.

### అవాంతర వాక్యము

జీవులు వేరుగను బ్రహ్మ వేరుగను దేనికది తెలియఁజేయునట్టిది.

### మహా వాక్యము

జీవ బ్రహ్మైక్యమును దెలియఁజేయునది.

### అధ్యాత్మ నిర్ణయము

ప్రతి శరీరమునందు ప్రత్యగాత్మభావము. అనఁగా : జీవభావము అధ్యాత్మ యనఁబడును.

## ఆదిభౌతిక నిర్ణయము

పుట్టి చచ్చునది అనఁగా : పంచేంద్రియములకుఁ గలుఁగువాంఛలు ఆది భౌతికమని చెప్పఁబడును.

## ఆది దైవికము

సకలేంద్రియములకు, సర్వప్రాణులకు శక్తిఁ గలిఁగించి ఆదిత్య మండల వర్తియగు హిరణ్య గర్భుఁడు ఆదిదైవికము.

## ఆది యజ్ఞము

ప్రథమసృష్టికి కారణమైన పరబ్రహ్మ చేతసకర్మ ఆదియజ్ఞమని చెప్పఁబడును.

## విక్షేప శక్తికంటే ఆవరణశక్తి చెడ్డది

విక్షేప శక్తివలనఁ బుట్టిన స్థూలసూక్ష్మ శరీరములద్వారా మోక్షమును సంపాదించి పొందవచ్చును. ఆవరణ శక్తియొక్క విజ్ఞానావరణమువలన జడుఁడగును. కావున విక్షేప శక్తికంటె నావరణ శక్తిచెడ్డది. మఱియు విక్షేపశక్తి పగలువంటిది. ఆవరణశక్తి రాత్రివంటిది. అందువలన వృత్తి ప్రళయము, అవస్థాప్రళయము, దేహప్రళయము, ఈ మూఁడు గలిఁగినను ముక్తినిఁగలుఁగ నీయక యావరించి మఱల నుపాధిఁగలుగఁజేయుచున్నది. ఈ యావరణశక్తి నశించనిచో జనన మరణ రహితమగు ముక్తి గలుఁగఁ జాలదు.

## అజ్ఞానము

దృగ్రూపమైన తెలివి. తన స్వస్థానమగు ప్రకాశము. అనఁగా : స్వయం ప్రకాశమును దెలిసికొనలేక దృశ్యరూపమగు నైశ్వర్యమును వని తాది భోగములను దెలియఁజేయుచున్నది. అందువలన అహంవృత్తిగలిగి, నేను నేనని పలుకునది యేది గలదో అదియే అజ్ఞానమని చెప్పఁబడును.

## సందేహము

ఆచార్యోపదేశము ననుసరించి వస్తు నిశ్చయజ్ఞానమును దెలిసికొనలేక శబ్దానుమానాది ప్రమాణములచే నిశ్చయించుకొనినచో నది సందేహ

వివృత్తిగాదు. ఆచార్య నిర్ణయవిధానము నిజముగా భ్రాంతి రహితమగునా? కాదా? యను సందిగ్ధమే సందేహమని చెప్పఁబడును.

### విపరీతము

అనిత్యమగు ప్రపంచమునకు నిత్య పరమాత్మ యాధారమనియు, నన్నమయకోశము దాను గాననియు హిరణ్మయకోశమే తా ననియు విట్టి నిర్ణయ మొనర్చుట విపరీతమనఁబడును.

### హృదయ గ్రంధి

సూక్ష్మ శరీరమనఁగా జ్ఞానేంద్రియ పంచకము, ప్రాణేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, మనోబుద్ధులు నీ పదియేడు తత్త్వములతో నిర్మితమగు సూక్ష్మశరీరము హృదయ గ్రంధియనఁబడును.

### వస్తు నిశ్చయజ్ఞానముయొక్క శ్రేష్ఠత

ఒకరిచే వినిన పదార్థమును మనన్సునందూహించుట ధ్యానమనఁబడును. ధ్యానము హెచ్చుగనొనర్చునది యోగము. ఈ యోగమునందుఁ దెలియఁబడు బ్రహ్మము యోగము చెడినచోఁ దానును చెడును.

శ్రవణ మనన విధి ధ్యానలచే నిర్ణయింపఁబడిన బ్రహ్మముగూడ నయ్యవి చెడినచో వాని వెనువెంటనే ఆ బ్రహ్మముచెడును. పిమ్మట నజ్ఞానమావరించును.

వస్తు నిశ్చయజ్ఞానము నజ్ఞానమావరింపదు. శ్రవణమనన విధి ధ్యానలు యోగయోగాంగము లేవికూడ నా వస్తు నిశ్చయ జ్ఞానమును జెఱుపఁజాలవు. కావున అయ్యది సత్యము. తక్కిన మార్గములు కంటకావృతములు అసత్యములు (నశ్వరములు.)

### ప్రమాణ నిర్ణయము

ఇంద్రియార్థ సన్నికర్షజ్ఞానము అనఁగా నొకవస్తువునుజూచి ప్రత్యక్ష జ్ఞానమేర్పడుచున్నది. ఈ ప్రత్యక్షజ్ఞానము సవికల్పమనియు నిర్వికల్పమనియు రెండు విధములు. నేత్రేంద్రియముచేఁ దెలియునట్టి ఘటజ్ఞానము సవికల్పము ఎట్లనగా: ఘటజ్ఞానము నేత్రేంద్రియమందుండునట్టిది. దీనినే సవికల్పమందురు.

ఘట విచ్చిన్నానంతరము ఘటోపాధి మూలమగు పృద్వ్యంతఃకరణ మందుండును. దీనిని నిర్వికల్పమని చెప్పఁబడును. అందువలన శబ్ద స్పర్శరూప రసగంధములను విషయపంచకము శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణ ములను జ్ఞానేంద్రియ పంచకము లన్యోన్యసంబంధము గలుఁగుచున్నది. ఇట్లే జ్ఞానేంద్రియములకును మనస్సునకును సంబంధముగలదు. మనస్సునకును ప్రాణమునకును, ప్రాణమునకును పరమాత్మకును, నన్యోన్య సంబంధము గలదు. కావున వీనికిఁ గలుఁగు మోక్షము ప్రత్యక్షముగా నుండవలయును.

కం॥ అన్నము దిన్నను నాకలి దిన్నఁగ నీరంబుఁద్రావఁదృష్ణయురోగం.
బెన్నఁగ నౌషద సేవనః,

అనున్యాయమువలన మృష్టాన్నముచే నాకలియు, శీతలోదకముచేఁ దప్పియు, ఔషదముచే రోగమును, నివృత్తిఁ జెందుచున్నది. కాని పంచ భక్ష్య పరమాన్నముల నామమాకర్ణించు మాత్రమున కూప తటాకాది నదీ జలంబుల వినుమాత్రమున, నౌషధముల పేరు లాలకించుమాత్రమున నాకలియు, దప్పియు, రోగబాధలను మానవియట్లు ఉన్నదియున్నట్లు వస్తు నిశ్చయము ప్రత్యక్షముగా గోచరింపవలయును. ఇదిగాక రాత్రియందు నెండు మొద్దును జూచి మానిసియని నిర్ణయించుకొని ప్రత్యక్ష ప్రమాణమని సిద్ధాంతము చేసికొన్నను నుదయమందు మఱల నా మొద్దును జూచినప్పుడు మానసియను జ్ఞానము నశించి యిది మొద్దను జ్ఞానముగా మాఱుచున్నది. అందువలన పరమార్ధ జ్ఞానము ప్రొద్దుఁ దిరుగుడు పూవువలెఁగాక వినాశన జ్ఞానముగాక పగలు ప్రత్యక్షముగా జూచిన జ్ఞానము రాత్రియందుఁగాని రోగబాధలు గలుఁగు సమయమునఁగాని మఱపుకు రాకయుండునట్లు పర బ్రహ్మ జ్ఞానము నచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు జ్ఞానాజ్ఞాన రహిత పద్ధతి సవికల్ప నిర్వికల్పములుగాక యున్నవి యున్నట్లు గోచరించును.

## ఇతర ప్రమాణములు

అనుమాన ప్రమాణమనియు, ఉపమాన ప్రమాణమనియు శబ్ద ప్రమాణమనియు, అర్థాపత్తి ప్రమాణమనియుఁ జెప్పఁబడునివి ప్రత్యక్ష,

ప్రమాణముయొక్క యంతరములు. ఇవి కొంత ప్రత్యక్షమగు పిమ్మట మిగత వీవి నిర్ణయము జరుగుచున్నది.

అనుమాన ప్రమాణ నిర్ణయము

ఏదైన నొకవస్తువు నొకప్పుడు ప్రత్యక్షముగాఁజూచి యింకొకప్పుడు దానికి సంబంధమగు వస్తువునుజూచి పూర్వవస్తు జ్ఞానము గలుగుట అనఁగా కనఁబడని పదార్థ జ్ఞానము గలుగుట యనుమాన ప్రమాణమనఁబడును.

పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టము అని మూఁడు విధములు. అనుమాన ప్రమాణమునఁగలవు. కారణమునుజూచి కార్యజ్ఞానమూహించుట. అనఁగా : మేఘమునుజూచి వర్షజ్ఞానమును, చదువుచుండిన విద్యార్థినిఁజూచి పాండిత్య నిర్ణయమును, వివాహమునుజూచి సంతాన నిర్ణయమును, ఈ మూఁడు నిర్ణయము పూర్వవత్తనుదాని యనుబంధములు.

కార్యమును జూచి కారణ జ్ఞానమూహించుట అనఁగా : నదీ ప్రవాహమునుజూచి వర్ష నిర్ణయము, కుమారునిఁజూచి తండ్రి నిర్ణయము, సృష్టిని జూచి అనధికార నిర్ణయమును చేయునట్లును, సుఖ దుఃఖములఁ జూచి పూర్వ జన్మకర్మ నిర్ణయమొనర్చునట్లు నీ చతుర్విధ పద్ధతులు శేషవత్వను బంధ నిర్ణయములని తెలియవలయును.

ఇంటినుండి బయలుదేరనిదే యితరచోటికిఁ బోలేమను, నిశ్చయము సామాన్యతోదృష్టము.

ఉపమాన ప్రమాణ నిర్ణయము

ఊరిలోనుండు నావునుజూచి అడవిలోనుండు నావు యిదేవిధముగా నుండునను నిర్ణయము ఉపమానమనఁబడును.

శబ్ద ప్రమాణ నిర్ణయము

యధార్థ పదార్థ జ్ఞానము గలిగించునది శబ్ద ప్రమాణమనఁబడును.

అర్థాపత్తి నిర్ణయము

మేఘమున్నచో వర్షము గలుఁగునట్లు కారణమున్నచోఁ గార్యము గల్గుననుట యర్థాపత్తి.

అసంభవ నిర్ణయము

సృష్టిస్థితిలేవి, పరిపూర్ణ పరమాత్మ, సృష్టిస్థితికి కారణమను నిర్ణయము అసంభవము.

ఐతీయ్య నిర్ణయము

అతఁడట్లుచేసెను, ఇతఁడిట్లొనర్చెను. అను నిశ్చయము నైతీయ్య మనఁబడును.

అభావ నిర్ణయము

ఏనుగును దెమ్మని చెప్పినయెడల నచ్చట ఏనుఁగు లేదనుపద్ధతి అవగతమగుట యభావమని తెలియనగును. ప్రమాణ పద్ధతులచేతనే మానవులు సత్యాసత్యములఁ దెలిసికొనఁగలరు.

సత్యపదార్థము గమనించుటకుఁ బ్రమాణపద్ధతి దప్ప యితర మార్గములేవు నవవిధ పదార్థ సహజ విరోధపద్ధతులు దెలియుటకుఁ బ్రమాణ పద్ధతి నిర్ణయింప బడినది. ప్రమాణ పద్ధతివిఁ దెలిసికొన్నవారు తత్వవేత్తలు వారు మోక్షమును బొందగలరు.

మఱి ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావము, వ్యావృదాభావము, సమవర్తకా భావము, సామాన్యా భావము, ప్రావృదాభావము, యని అష్ట విధములు.

౧ ప్రాగ్భావమనగా : అసత్పదార్థ నిర్ణయము, అనఁగా నసత్వాభావము, పూర్వమందులేనిది, తర్వాతనున్నట్లు దెలియుచున్నది. ఎట్లనఁగా : బంగారమందు నగల యాకృతి, మృత్తునందుఁ గుండల యాకారము, పూర్వము లేక తర్వాత తెలియఁబడుచున్నది. కావున బంగారము శాశ్వతముగాఁ దెలియుచుండుటచే సత్పదార్థమనియు, నగల యాకృతి, నశించుచున్నది. కావున అసద్రూపంబులని తెలియవలయును. అందుచే నాకృతులు ప్రాగ భావములని నిర్ణయము.

౨ ప్రధ్వంసా భావమనఁగా : సదసత్తులు, అభావమగుట, ఘటోపాధి యందు ఘటాకాశముగాను, మఠోపాధియందు మఠాకాశముగాను, దెలియఁబడి ఘటమఠ విచ్ఛిన్నతతోఁబాటు ఘటమఠాకాశములు నశించుచున్నవి.

అటులనే యెఱుక యుపాధితోఁ బోవుచున్నది. కావున స్వరూపమగు యెఱుక దాని పరిణామములను, రూపనామ క్రియాద్యాకార సముదాయము, ద్వంద్వము, నశించుచున్నది. అందువలన సద స్వరూప రహితము, ప్రధ్వంసాభావమని చెప్పఁబడును.

౩ అన్యోన్యాభావమనఁగా : సత్యా సదభావమని చెప్పబడును. నెద్దు నందు గుఱ్ఱపు పోలికయు, గుఱ్ఱమునందు నెద్దుపోలికయు, నక్కయందు కుక్క పోలికయు, కుక్కయందు నక్కపోలికయు గానిపించినను నది యిది గాదు. యిది యదిగాదు. అట్లలే యచల పరిపూర్ణ పరబ్రహ్మముయొక్క పూర్ణత్వ పద్ధతి నెఱుకయందున్నను అది యిదిగాదు. యిది అదిగాదు. కావున సత్యా సదనుభావము, అన్యోన్యభావమని చెప్పఁబడును.

౪ అత్యంతా భావమనఁగా : తదసదభావమని చెప్పఁబడును. పరమార్థ సత్యత్వము లేకపోయినను వ్యవహార సత్యత్వపు రీతియున్నట్లు దెలియు చున్నదనినను, గొడ్రాలు కొడుకురీతిని, వానర శృంగమురీతిని గంధర్వ నగరమురీతిని, యెండమావుల జలమురీతిని దెలియఁబడు చున్నది. కావున సదసదభావ నిర్ణయము నత్యంతాభావమని చెప్పఁబడును.

౫ యావ్యదాభావమనఁగా : యెఱుకయొక్క యేకత్వానేకత్వ నిర్ణయ భావము, ఘటాకాశ మఠాకాశ మహాకాశము, లేకనే యున్నట్లు బ్రహ్మచైతన్య మొక్కటియే అందఱియందున్నది. అయినను దేని గుఱుతు దానిదే, మఱియు నొకటి నశించునెడల నింకొకటి దానిని జూచుచున్నది. కావున నేకానేకము లుగాఁ దెలియునది అభావమని నిశ్చయమగుచున్నది. దీనిని యావ్యదా భావమని చెప్పుదురు.

౬ ప్రావ్యదాభావమనఁగా : శరీరములేకయే గుఱుతు కర్మల నాచరించు చున్నది. ఎట్లనఁగా : పాషాణాదులయందు నగ్ని యున్నదనిగాని లేదని గాని నిర్ణయ మెట్లులేదో అట్లే ఎఱుక యున్నది లేదు. మఱియు విచారించి నప్పుడున్నది. విచారించనప్పుడు లేదు. వాయువు శరీర రహితముగా వృక్షా దులను గూల్చివేయునట్లు ఎఱుక శరీరము లేకయే యున్నట్లు దెలియు చున్నది. శాశ్వతముగా నయ్యదిలేదు. అందువలన ప్రావ్యదాభావమని చెప్పఁబడును.

౧౨ సమవర్తకా భావమనఁగా : దన పరిణామమగు మలిన పదార్థమును మలిన రహితమగు తన స్వరూపము చేసికొనినను నెఱుకతాను స్వయముగా నభావము జెందినను నిర్ణయము సమవర్తకా భావమని చెప్పఁబడును. ఎట్లనగా : నీరు తాను స్వయముగాఁ బ్రకాశవంతమై యితర వస్తువులను మలిన రహితముగా నొనర్చి ప్రకాశవంతములఁగాఁ జేసినట్లు ఎఱుక తాను ప్రకాశవంతమై తన పరిణామమగు నితర కోశములఁ బ్రకాశవంతములుగాఁ జేసికొన్నను దాను నభావత్వము జెందుచున్నది. కావున దీని సమవర్తకా భావమని చెప్పఁబడును.

౧౩ సామాన్యాభావమనఁగా : బరబ్రహ్మమగు చేతనము సామాన్యమని నిర్ణయము. ఇది యితరుల యిచ్ఛలేక తనంతతానే పుట్టుచున్నది. ఎట్లనఁగా: సూర్యునకు నగ్నివి పుట్టించవలయునను నిచ్ఛలేదు. కాని యగ్ని తనంతతానే పుట్టుచున్నట్లు నెఱుకయగు నధిష్ఠాన చేతన బ్రహ్మము దనంతటఁదానే పుట్టుచున్నది. కావున సామాన్యమని చెప్పఁబడును. సామాన్యపద్ధతిఁగల సూక్ష్మ రూపమైన చేతనపద్ధతి సముత్పన్నమై యుపాధి పొందుచున్నది. అందువలన సామాన్యాభావమని చెప్పఁబడెను. భావాభావము లెఱుక నిర్ణయములు గాని యచల పరిపూర్ణమునందు భావాభావములు లేవు.

ఇతి శ్రీ అచలర్షి దయానంద పౌన్నాల రాజయోగి విరచిత
అచల పరిపూర్ణ రాజయోగీయము. నిజప్రబోధ విధానము
ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ్య
సప్తమ, అష్టమ సోపానములు
సంపూర్ణము.

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు
శ్రీ నిజగురు మహారాజకీ
జై. జై. జై.